# భారతి

మాసపత్రిక

సంపాదకుడు:
వలెంక శంభుప్రసాద్

మార్చి 1968

సంపుటము: 45 : : సంచిక 3

విడిప్రతి: వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మార్చి 1968

# "సుఖినో భవంతు!"

శ్రీ కె. వి. సత్యనారాయణాచార్యులు

మార్చిలో పరీక్ష తప్పిన విద్యార్థికి
మరో సెప్టెంబర్ 'ఛాన్సు'లా—
మెయిల్ తప్పిన ప్రయాణీకునికి
మరునాటి ప్యాసింజరు 'ట్రయిన్'లా—
నిత్యజీవిత సమస్యల (తోరణం)తో
సతమతమయ్యే సామాన్య మానవునికి
ఊహాలోకంలో మెరిసే 'ఆశాకిరణం'లా—
మళ్లీ ఉగాది వచ్చింది!
'మెషీను'గా మారిన మనిషి మనస్సులో
'ఖుషీ' తరంగాల హుషారు నింపింది!
కసితీరా గతాన్ని నిందించే 'కష్టమర్' నోటికి
కాస్త విశ్రాంతిని కలిగించింది!
చెవులకన్నా కళ్లపైనే నమ్మకమున్న జనానికి
సాక్ష్యంగా—
శిశిరాన్ని మధువసంతంగా మార్చి చూపించింది!
ఈ ఉగాది
చెదిరిన పెదవులపై మందహాసాన్ని
మళ్లీ అందిస్తానంది!
రేపటి 'నిన్న'కి—నిన్నటి 'రేపు'కి
తేడా లేదనుకొనే 'తెల్లమొగాల'కి—
భవిష్యత్తు 'భూతం'కన్నా బాగుంటుందని
నిరూపిస్తానంది!

—

# తెలుగు - సంస్కృతము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

తెలుగుభాషలో పదములను 1. తత్సమములు, 2. తద్భవములు, 3. దేశ్యములు, 4. గ్రామ్యములు అని వ్యాకరణములు విభాగము చేసినవి. కాని యీ విభాగము, శాస్త్రీయమైన వ్యాకరణ రచన కొఱకు చేయబడినదిగాని, భాషాసంప్రదాయముగాని— భాషాపరిణామ పద్ధతినిగాని దృష్టిలో నుంచుకొని చేసినదికాదు. ఈ క్రమము ననుసరించిన తెలుగు భాషలో 'తత్సమములు' అనునది మొదటి విభాగమగును. కేవలము సంస్కృత పదములను తెలుగు భాషలో మొదటివనుట భాషాస్వభావ విరుద్ధముగదా! రెండవది తద్భవములు. తద్భవములనగా—దానినుండి పుట్టినవి. ఒకదానినుండి పుట్టినవి యని చెప్పుట చేతనే, అవి తెలుగుకన్న విలక్షణమగు వేఱొకభాష నుండి పుట్టినవని స్పష్టమగుచున్నది. కాబట్టి అవి తెలుగుభాషాస్వాభావికముగానున్నను — తద్భవములు— స్వతస్సిద్ధములు కావని తేలుచున్నది. దీనినిబట్టి స్వతస్సిద్ధమగు భాష యొకటి వీని రెండింటికి ముందుండవలయునని స్పష్టమగుచున్నది. అదియే దేశ్యము. తెలుగుదేశమున నిత్యవ్యవహార సిద్ధమగు భాష దేశ్యము. ఈ దేశ్యము లేక దేశభాష సంస్కారము లేనివారు మాట్లాడుకొనునపుడు మార్పులను చెందుచు సంస్కారముగల భాషకన్న భిన్నముగా నుండును. ఇదియే గ్రామ్యము. అయినప్పటికి నిది దేశ్యములోని యంతర్భాగమేకాని వేఱుకాదని గ్రహింపవలయును. ఏలననగా సంస్కారములేనివారు, తమకు స్వతస్సిద్ధమైన లేక ఉగ్గుబాలతో నేర్చిన భాషగాక మఱియొకభాష మాట్లాడుట యసంభవము.

పై వివరణమునుబట్టి పరిశీలించినచో మనకు మొదటిది దేశ్యము. తరువాతిది తద్భవము. ఆ వెనుక తత్సమము—అని నిర్ధారణయైనది. భాషాతత్త్వమును బట్టి యిదియే పరిణామక్రమమని తెలియగలదు.

మొదటిదైన దేశ్యము—అచ్చతెలుఁగు, దేశియని రెండు విధములు. అచ్చతెలుగు పలుకులనగా నందఱకు తెలివిడియైన మాటలు. ఉదా. పాలు, పెరుగు, నేయి మొదలగునవి. దేశి పలుకులనగా అచ్చతెలుగులో నొకప్పుడు అందఱకు తెలిసినవై, కాలక్రమమున, కవి ప్రయోగమువలన గ్రంథస్థములైనవి. ఉదా. ఎఱకువ—వేనలి – మొదలగునవి.

ఈ రెండు విభాగములలో దేశిపలుకులఁకన్న అచ్చతెనుగు మాటలే ముందని చెప్పవచ్చును. అది దేశిపదముల తీరునుబట్టి తెలియును. ఉదా:—ఎఱుగు— అనునది క్రియ. అచ్చతెనుఁగులో నీవు 'ఎఱుగుదువా' అని వ్యవహారములో నుండును. కాని 'నీ కెఱకువా' అని యుండదు. ఏలననగా—ఎఱుకువ—'ఎఱుగు' ధాతువు కృదంతరూపము. కవుల గ్రంధములలో నుండును. ఇట్లే 'వేనలి' అనగా కొప్పు. ఒకప్పుడు 'వేనలి' కొప్పునకు వాడుకలోనుండి, క్రమముగా నది కవిప్రయుక్తమై గ్రంథముల కెక్కి, వాడుకనుండి తప్పిపోయినది. దీనినిబట్టి అచ్చతెలుగే 'దేశి'కన్న ముందని తెలియుచున్నది. అచ్చతెలుగు పదములేయైనను, దేశిపదములు గ్రంథస్థములై నిత్యవ్యవహారదూరము లగుటచేత తెలుగు వైయాకరణులీ విభాగము చేయవలసివచ్చినది.

## తద్భవములు

అచ్చతెలుగు మాట్లాడువారికి తమ భాషకన్న విలక్షణమైన ధ్వనులతోనున్న వేఱొక భాషతో అనగా సంస్కృతముతో సంబంధము కలిగినప్పుడు, ఆ సంస్కృత పదోచ్చారణగల శబ్దములను తెలుగు భాషానుగుణ్యముగా గ్రహింపవలసివచ్చినది. సంస్కృతభాషలో మహాప్రాణములు—ఖ, ఘ, ఛ, ఝ మొదలగునవి! సంయుక్తాక్షరములు—వృక్షము మొ

లగునవి కలవు. తెలుగున నివి లేవు. కాబట్టి ఆ పదములు తెలుగున వ్యవహరింపబడినపుడు సరళములుగా, శైథిల్య రూపములతో వాడుకలోనికి వచ్చినవి. హర్షము—అరుసము; స్పర్శన—పరిసన; ఘంట—గంట మొదలైనవి. దీనివలన 'తద్భవములు' అచ్చతెలుగు, దేశి తరువాతినే భాషలోనికి వచ్చినవనుట స్పష్టము. సంస్కృతపదము లా రీతిగా నుచ్చారణచే మార్పుల నొంది, తెలుగుభాషలో వ్యవహరింపబడుటచేత నవి తెలుగుభాషా విభాగమైనవి. ఇక వీనికి మూలమైన సంస్కృత పదములు—

### తత్సమములు

అను పేర నాల్గవ విభాగముగా నున్నవి. తత్సమములు కేవలము సంస్కృత పదములు. వానిని తెలుగులో వాడుక చేయునపుడు—తెలుగు ప్రత్యయము లాసంస్కృత పదములకు చేర్చి వాడుచున్నాము. ఉదా:—రామః. తెలుగున—రాముఁడు. సంస్కృత 'రామ' శబ్దమునకు 'డు' ప్రత్యయము చేర్చి వాడినపుడు, ఆ 'రాముఁడు' అను పదము తెలుగు భాషలో నొక పదముగా పరిణమించినది. ఇట్లు ప్రత్యయములను చేర్చుటచేతనేగాక ఇతర సంస్కృత పదములను, పదము చివర ధ్వనులను తెలుగు భాషాను గుణ్యముగా వర్తింపచేసి వాడుచున్నాము. ఉదా:—తటిత్—తటిత్తు. అబలా—అబల. దీనివలన మొదట నా పదములు సంస్కృతమే యైనను, తెలుగు ప్రత్యయాదులు చేర్చుటచేత తెలుగైనవని స్పష్టమగుచున్నది. ఇందుచేత సంస్కృత పదములకు, తెలుగునకు తొలుత నేమాత్రము సంబంధము లేదనియు, నా వెనుక ప్రత్యయాదులను చేర్చుటచేత నవి తెలుగుగా పరిణమించి, తెలుగుతో నవినాభావ సంబంధము గలిగి యున్నవనియు తెలియవలెను.

ప్రత్యయ మెప్పుడును, పదము నంటియుండును గాని, దానికి ప్రత్యేక ప్రయోగములేదు గాబట్టి సంస్కృత భాషాపదము లట్టి ప్రత్యయములతో నున్నవి; ధ్వనులలో మార్పుచెందినవి, తత్సమములైనవి. ఈ ప్రక్రియవలన అపారమైన సంస్కృత భాషలోని పదజాలమునకెల్ల తెలుగుభాషలో ప్రవేశము గలిగినది.

తత్సమములు చేరుటతో తెలుగుభాషా పరిణామక్రమము పూర్తియైనది. అవి ప్రజలలో సంస్కార మున్నవారు అనగా శిష్టులు విశేషముగా నిత్యవ్యవహారములోకూడ వాడుట ప్రారంభించిరి. ఎప్పుడును శిష్టవ్యావహారికముగనున్న భాష కావ్యరచనకు మార్గము చూపును. అందుచే తత్సమపద వ్యవహారముతోడనే, తెలుగుభాష పరిపుష్టమై సారస్వత విశిష్టత గడించినది.

తత్సమములు భాషాపరిపుష్టిని కలుగజేయుటయేగాక తెలుగుభాషా సౌష్ఠవమునకు, భాషోచ్చారణకు, భాషావ్యవస్థకు స్థిరత్వము గలిగించినవి. ఇతర భాషాపదము లేవిజేరినను భాషలో మార్పులు కలుగజేయలేదుసరికదా తెలుగులో కలిసిపోయినవి. తత్సమములు చేరినతర్వాత భాషలోనికి చారిత్రకముగ కాలాంతరములలో అరబీ, పారశీ, ఇంగ్లీషు మున్నగు నితర భాషాపదములు రాజకీయ, సాంఘిక పరిస్థితుల చేత ప్రవేశించినను, వానికి వేఱుగ వైయాకరణులు వ్యవస్థ నేర్పఱుపవలసిన యావశ్యకత లేకపోయినది. దీనినిబట్టి తెలుగుభాషా పరిణామమును నాలుగు దశలుగా విభజింపవచ్చును.

| | | |
|---|---|---|
| మొదటి దశ | — | అచ్చ తెలుగు |
| రెండవ దశ | — | దేశి తెలుగు |
| మూడవ దశ | — | తద్భవములు |
| నాల్గవ దశ | | తత్సమములు |

ఈ భాషాపరిణామ దృష్టితో తెలుగునకుగల పేళ్లనుగూర్చి పరిశీలించిన మన కీనాటి భాషావివాదము లనావశ్యకములని తెలియగలదు.

తెనుగు, తెలుగు, ఆంధ్రము—అను మూడు పదములు భాష కున్నవి. దీనిలో 'తెనుగు' మొదటిది. రెండవది—'తెలుగు' అని చెప్పవచ్చును. పై వివరణమునుబట్టి 'తెనుగు, తెలుగు' అను నీ రెండును భాషకు పేరులు కాబట్టి యవి అచ్చతెలుగు పదములనుటకు సందేహములేదు. ఇక—ఇవి తద్భవము లనుటకు వీలున్నదా చూతము మొదట యే దేశమునకు వ్యవహారసిద్ధమగుభాషకు, నా దేశభాషాసిద్ధమగు పేరే యుండునుగాని మఱియొక పదమునుండి పుట్టిన తద్భవము పేరుగ నుండుట యసంభవము. కాబట్టి

యిది తద్భవ మెంతమాత్రమునుగాదు. ఇందుచేత నిది దేశ్యమని చెప్పవలయును.

ఇక 'ఆంధ్రము' అను పదము విచారింతము. ఇది సంస్కృతపదము కాబట్టి తత్సమము. తత్సమములు భాషలో ప్రవేశించుట తెలుగుభాషా పరిణామదశలో చివరి దశయని తెలిపితిని. కావున తొలినుండి యీ పేరుండుట పొసగదు. ఈ పదములో అచ్చతెనుగునగాని, దేశితెనుగునగాని లేని మహాప్రాణాక్షరము, సంయుక్తాక్షరము నున్నవి. పై క్రమము చూచిన ఆంధ్రము మొదట తద్భవరూపముగానే ప్రవేశింపవలయును. కాని తత్సమముగా ప్రవేశింపజాలదు. తెలుగుననేకాదు. ఏ ద్రావిడభాషయందు, సంస్కృతము స్వస్వరూపముతో నిలువజాలదు.

తమిళభాషలో తద్భవరూపములోతప్ప, తత్సమముగ సంస్కృతపదము ప్రవేశింపనేరదు. కన్నడమున, తెలుగున తొలుత తద్భవములుగా మాఱి, యా వెనుక తత్సమములుగా స్వస్వరూపముతో నిలుచును.

ఈ నియమము ననుసరించిన 'ఆంధ్ర పదము' తెనుగున స్వస్వరూపముతో నుండుటకు వీలులేదు. ప్రాచీనకాలమునుండి 'ఆంధ్రపదము' సంస్కృతములోనైనా భాషావాచకమై, తెలుగుతో సంబంధించియున్నయెడల 'ఆంధ్ర'పదమునకు 'అందిరి—అందిరము' అను తద్భవరూపము లుండియుండవలయును. కాని యట్టి పదము లున్నట్లు మన కేమియు నిదర్శనములుగాని, ప్రమాణములుగాని లేవు. దీనినిబట్టి తద్భవము లేర్పడునాటికి 'ఆంధ్ర'శబ్దము తెనుగున వాడుకలో లేదని చెప్పవచ్చును.

ఆంధ్రము సంస్కృతముగాన 'ఆంధ్ర'శబ్దమునకు 'ము' ప్రత్యయము చేర్చి భాషావాచకముగ మనము గ్రహించి వాడుకొనరాదాయన్న, అది యంతకంటెను పొసగదు.

ఆంధ్రశబ్దము సంస్కృతభాషలో దేశ, జాతి వాచకము మాత్రముగనే యున్నది. దీనికి—'ఆంధ్రః — ఆంధ్రీ—ఆంధ్రమ్'— అను రూపములు గలవు. తెనుగున—'ఆంధ్ర' విషయమున—(కు. సం. 1—23) అనుచోట ఆదిదేశ వాచకముగా కనపడుచున్నది. కాని తక్కిన 'ఆంధ్రీ, ఆంధ్రము' అనువానికి ప్రయోగములు లేవు. కాబట్టి 'ఆంధ్ర'శబ్దము తెనుగున దేశవాచకముగాని భాషావాచకముగా ప్రయోగింపబడలేదు. అనగా ఆంధ్రశబ్దము తత్సమముగా ప్రవేశించునాటికి యది దేశవాచకముగానేగాని భాషావాచకముగా లేదు.

ఆంధ్రశబ్దము దేశవాచకముగనుండి భాషావాచకద్యోతకముకాకపోవుట బట్టియే, తెలుగున ప్రాచీనకవు లాపదమును భాషాపరముగ ప్రయోగింవినప్పుడు 'ఆంధ్రభాష' అని భాషాశబ్దము కలిపియే వాడిరిగాని వ్యస్తముగ 'ఆంధ్రము'న రచియించెదనని వాడలేదు. అట్టి ప్రయోగములు కంచుకాగడతో వెదకినా కానరావు.

తెలుగున మనకు దొరికిన శాసనములలో 'ఆంధ్ర'పదము భాషాపరముగ కన్పట్టదు. నన్నయకాలమునకూడ సంస్కృతభాషలో 'ఆంధ్ర' శబ్దప్రయోగమున్నదిగాని తెలుగున నన్నయభారత భాగమున 'ఆంధ్ర' శబ్దములేదు. సంస్కృతభాషలో నందమపూడి శాసనమున 'యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్రభాషాసు' అని వ్రాసిన నన్నయ తెనుగున [2]ఆంధ్రభాషయని ప్రయోగింపలేదు. కాబట్టి అప్పటి కవిప్రయోగములలో ఆంధ్రభాషలేదు.

---

1. తెలుగునకు 'త్రిలింగ'పదము ప్రకృతియని కావ్యాలంకార చూడామణిలో గలదు. ఆ గ్రంథము క్రీ. శ. 1402—'07 మధ్య రచితమైనది. అందే చివర—

త్రిలింగ నిదానమై తనరుకతన
నాంధ్రదేశంబునాఁ ద్రిలింగాఖ్యమయ్యె
తెలుఁగగుచుఁ దద్భవము దానివలన పొడమె
'వెనుక' కొందఱు దానినే తెనుగు నంద్రు

'వెనుక' అనుటచేత, తెలుగునకు పూర్వరూపము 'తెనుగు' అనియు, త్రిలింగశబ్దము తన కాలమునకు మాత్రముమే వచ్చినదని తెలియుచున్నది. దీనికి కవిప్రయోగము అనగా 'త్రిలింగభాషలో నే నీ కావ్యము వ్రాయుచున్నాను' అనునది లేదు.

2. 'ఆంధ్రభాష' అని తొలుత ప్రయోగించిన కవి పాల్కురికి సోమనాథుడు.

అనగా తెనుగునకు, ఆంధ్ర శబ్దమునకు భాషా వాచక సంబంధ మేమియులేదని సారాంశము. ఆంధ్ర శబ్దము దేశ జాతి వాచకముగను, తెనుగు భాషావాచకముగను నిలిచిపోయినది.

పై వివరణముచేత తత్సమమగు ఆంధ్రశబ్దము కన్న 'దేశి'యైన తెనుగు ఎంతో పూర్వముదని నిశ్చయము.

భారత వర్షమున దేశభాషలలో నున్న పేళ్లను ఆయాదేశనామములను చూచిన అవి యభిన్నములుగ నున్నవి. కాని తెలుగు ఒక్కటి మాత్రమే భిన్నముగ నున్నది.

| | | |
|---|---|---|
| మహారాష్ట్రము | — మహారాష్ట్ర | భాష |
| తమిళనాడు | — తమిళ | ,, |
| కన్నడ దేశము | — కన్నడ | ,, |
| మళయాళ ,, | — మళయాళ | ,, |
| బంగాళా ,, | — బంగాళీ | ,, |
| ఓఢ్ర ,, | — ఓఢ్ర | ,, |
| అస్సాము ,, | — అస్సామీ | ,, |
| పంజాబు | — పంజాబీ | ,, |
| సింధు | — సింధీ | ,, |
| ఆంధ్రము | — తెనుగుభాష, | |

పాశ్చాత్య దేశములందు నిదియే రీతిగ నున్నది.

| | |
|---|---|
| ఇంగ్లండు | — ఇంగ్లీషు |
| ఫ్రాన్సు | — ఫ్రెంచి |
| జర్మన్ | — జర్మన్ |
| రష్యా | — రష్యను. |

పై దేశముల వారాంధ్రులను గూర్చి చెప్పునపుడు తెలుగువారని యందురేకాని 'ఆంధ్రుల'నియనరు.

ఇందుచేత తొలుత ఆంధ్ర, తెలుగు శబ్దములకు సంబంధమే లేదు. కాని యా సంబంధము కలుగుటకు కారణమొకటి యున్నది. తెలుగువారు భాష మాటలాడు ప్రదేశమును మొదట యాక్రమించిన వా రాంధ్రులు. ఆంధ్రు లిది యాక్రమించిన నాటి నుండి తెలుగునకు, ఆంధ్రమునకు సంబంధము గలిగినది. దీనివలన పాలకు లాంధ్రులైనను, వారి భాష ప్రాకృతమైనను, వారు దేశీయులైన పాలితప్రజల భాషయగు తెలుగుభాషనే వాడుచుండిరి. ఆనాడు దేశ మాంధ్రమైనను దేశప్రజలు మాట్లాడు భాష తెలుగగుటచేత తెలుగు భాషకు ఆంధ్ర మనుపేరు రాలేదు.

ఇది యొక్కటియే తెలుగుభాష ప్రాచీనతను నిర్వివాదముగ నిరూపించును. 'ఆంధ్ర'శబ్దము ఐతరేయ బ్రాహ్మణమున నున్నట్లందఱు నేకగ్రీవముగ నంగీకరించిరి. అప్పు డాయాంధ్రు లాక్రమించిన ప్రదేశమున తెలుగువారు నివసించియున్నారు. కావున ఆంధ్రులకన్న తెనుగువారే ప్రాచీనులు. వారి భాష ప్రాచీనము.

తెనుగుభాష మాటలాడువారు, పెక్కునాడు లలో నివసించుటచేత భాష యొకటియైనను 'తెలుగు నాడు' అను నేకైకనామము దేశమునకు రాలేదు. ఆంధ్రు లీనాడులన్నింటిని పాలించిన కారణమున దేశమునకు 'ఆంధ్ర'నామము వచ్చినది.

దీనినిబట్టి సంస్కృతమునగాని, ఇతర దేశ భాషలలోగాని 'ఆంధ్రశబ్దము' ప్రసక్తమైనప్పు డది— తెనుగుభాష, తెలుగువారు— అని యర్థము చేసికొనవలయును.

సంస్కృత పదములు తెనుగులోనికి ప్రత్యయములు చేర్చి వాడుకొన్నప్పుడు ఆ పదములు తెనుగు భాషా పరిపాటి ననుసరించియే వర్తిల్లును. విభక్తులు— కారకము— సంధులు—సంస్కృతభాషా విభక్తి, సంధి, కారకాదుల నేమాత్రము ననుసరింపవు. ఉదా:— 'రామః – రాముఁడు' అని తెలుగులోనికి వచ్చినపు డింకనా పదమునకు సంస్కృతభాషాపరిపాటి యుండనే యుండదు. తెలుఁగు విభక్తి ప్రత్యయము 'డు' మీఁదనే తక్కిన కార్యములు వచ్చును. ఇట్లే సంస్కృత క్రియలను— ఇంచుగాగమము చేర్చి తెలుగున ప్రయుక్తములగును.

ఇట్లనేక పదములనేగాక సమాసములును,

సంస్కృతమునుండి గ్రహించుటకీ ప్రత్యయములు చేర్చు విధానము కారణమైనది. ఎంత పెద్దసంస్కృత సమాసమైనను తెలుగు ప్రత్యయము చేర్చి, యా సమాసమును తెలుగుగా చేయవచ్చును.

సంస్కృతభాషాశబ్దములను తెలుగు కవులు విశేషముగ కావ్యశైలి కుపయోగించుటచేతను, యతి ప్రాస నిర్బంధములచేతను తెలుగున సంస్కృత కోశములందు మనకు కన్పట్టని సంస్కృతపదము లెన్నో తెలుగు కవులు వాడియున్నారు.

1. సమాసములు చేయుట.

2. యతిప్రాసములు — ఛందస్సున వాడుట.

3. సంస్కృతవ్యాకరణ మర్యాదను పాటించుట

4. దేశి విధముగా సంస్కృతము వాడుట.

5. సంస్కృతము వేఱని తెలుపుటకు సంస్కృతము ననుకరణ విధానము ననుసరించుట.

6. వైదిక సంస్కృతమును క్వాచితముగా వాడుకచేయుట. ఇట్లు వైదిక, లౌకిక భాషలను రెండింటిని 'తెలుగు' వ్యవహారమున వర్తిల్లజేసినది. తెలుగున యతిప్రాస నిర్బంధమున్నను, సంస్కృత భాషా స్వరూపమును, యథాతథముగ నిలిపినది. ఉత్తర సంస్కృత భాషాస్వరూపమును, దాక్షిణాత్య సంస్కృత సంప్రదాయమును స్పష్టముగనుండి సమ్మేళనము చెందినవి. తెలుగునకు సంస్కృతము సంబంధమే లేనప్పుడు — ఇంత యవినాభావ సంబంధమెట్లేర్పడి యున్నదని ప్రశ్నవచ్చును. స్త్రీ పురుషులిరువురికి తొలుత నేమాత్రము సంబంధము లేకపోయినను, వివాహబంధము ఏర్పడిన తరువాత యొకరైనట్లు, సంస్కృతభాషకు తెలుగునకు మొదట సంబంధమే లేకపోయినను, నా వెనుక ప్రత్యయము చేర్చుట అను సూత్రసంబంధమువలన తెలుగు సంస్కృతము లొక్కటియైనవి. భార్యా భర్తలొక్కటియైనను వారి ప్రకృతి తత్త్వములు వేఱుగదా! అట్లే తెలుగు సంస్కృత భాషాతత్త్వములు వేఱు., దేశభాషలలో నొకటియగు ప్రాకృతము గూర్చి 'సంస్కృత వాక్కు పరుషము—పురుష సంబంధమైనది. ప్రాకృతము సుకుమార వాక్కు. సరళము. స్త్రీ వాక్కు' అను సూక్తిగలదు. కాని పరుష సరళములు ప్రాకృతమున లేవు. సంస్కృతమున లేవు. తెలుగుననే యున్నవి. కాబట్టి వాని కవినాభావ సంబంధము గలదు.—ఇది యెట్లు సంఘటించినదియు వివరించుచున్నాను.

### "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స"

మన భాషాసాహిత్య విమర్శనలలో నందఱును పై సూక్తి నుదాహరించినవారేకాని, అందలి యర్థముగాని, భావమునుగాని వివరింపలేదు. 'దేశభాషలందు తెలుగు లెస్స' అనగా దేశభాషలో తెలుఁగు శ్రేష్ఠమైనదని యర్థము. కాని ఆ శ్రేష్ఠత్వ మీ భాషకెట్లు కలిగినది నిరూపితము కాలేదు. ఇచ్చట తెలుగనగా కేవలము అచ్చతెనుగు అను నర్థముకాదు. అట్లైన నిది దేశభాషలలో శ్రేష్ఠమగుట కవకాశమేలేదు. ఏలననగా అది కావ్యనిర్మాణమునకు సమర్థమగు భాషకాదు. సంస్కృత పదములు తత్సమములుగా అచ్చతెనుగులో చేరినవెనుకనే, భాషాపరిణామము పూర్తియైనదని — అప్పుడే అది కావ్యరచన కనుకూలపడినదని యీవలకే తెలుపబడినది. ఈ యభిప్రాయమును పురస్కరించుకొనియే పూర్వలాక్షణికులు తత్సమ రహితమగు కావ్యమే ఉండదని స్పష్టపఱచియున్నారు.[3] తత్సమ తద్భవ దేశ్యయుక్తమైన తెలుగే కావ్యభాషగా రూపొందుటచేత సంస్కృతములేని తెలుగు కావ్యము సంఘటిల్ల నేరదు. ఒక్కకావ్యభాషయేకాదు — తెలుగువారి నిత్యవ్యవహారములో కూడా సంస్కృత పదముల వాడుకలేక దైనందిన కృత్యములే సాగవు. ఇట్లు వ్యవహారమునను, గ్రాంథికమునను సంస్కృతము శరీరమున రక్తమువలె ప్రవహించి రెండింటికి విడదీయరాని యనుబంధము సమకూర్చి సంస్కృతములేక తెలుగు లేదని స్థిరీకరించినది. ఇందువలన దేశభాష

---

3. తెలుగున పదునాఱవ శతాబ్దినుండి అచ్చ తెలుగు కావ్యములు ప్రచారములోనికి వచ్చినను వానిలో ఏ రెండుమూడు కావ్యములకో తప్ప వాఙ్మయమున స్థానమే లేదు. భాష కృతకమగుటయు భావము లనుసరణము లగుటయు దీనికి కారణమని చెప్పవచ్చును. దీని కపవాదము ఆదిభట్ల నారాయణదాసుగారి అచ్చతెలుగు రచనలు.

లందు 'తెలుగు' లెస్స అయినది సంస్కృతభాషా మూలముననే యని నిర్వివాదముగా గ్రహింపవలెను. నిరవద్యమగు సంస్కృతభాషా ప్రౌఢిమయు, నిసర్గ మధురమగు దేశి తెనుగు నుడికారమును అల్లిక జిగి బిగితో నల్లసిల్లినవి. ఈ హేతువుచేత రసస్ఫూర్తితో రామణీయకము పదప్రసన్నతతో భావోష్మలత, మహిష్ఠతతో మాధుర్యము తెలుగు సంతరించుకొని స్వర ప్రధానమైన సంగీతమును, వర్ణప్రధానమైన సాహిత్యమును సమ్మేళనము గావించి అవ్యక్తమధురమైన గానమును సువ్యక్తము చేసినది. భారతీయ దేశభాషలలో నేభాషయందు కన్పట్టని యిట్టి లోకోత్తర సన్నివేశముచేతనే తెలుగు దేశభాషలందు మిన్నయైనది. ఇక తెలుగు సంస్కృతభాష నే రీతిగా గ్రహించి తనలో నైక్యము చేసికొనినదో తెలిసికొందము.

## మణిప్రవాళ రచన

తెలుగున సంస్కృత పదములు మొదట సంస్కృతభాషా పండితుల మూలముగా ప్రవేశించినవి. ఆ సంస్కృత పండితులు తెలుగువారగుటచేతను, తెనుగే మాతృభాషగా గలిగినవారగుటచేతను వారు సంస్కృతపదములను తెలుగుపదములను కలగాపులగముగా వ్యవహారమున వాడుచు వానిని ఛందోబద్ధము గావించిరి. తెలుగులో సంస్కృతము తత్సమరూపమున ప్రవేశించినను, అది సంస్కృత విభక్తులతో నుండదు. అలాగున నున్నప్పుడే తెనుగుకన్న వేఱుగా సంస్కృతము కనబడుతుంది. అవి రెండూ విడివిడిగా కనబడుచు ఒకే వాక్యార్థమున సమన్వయించినట్టి రచనకు 'మణిప్రవాళము' అని పేరు. మణులు, ప్రవాళములు అనగా పగడములు కలిపి, ఒకే దారములో గ్రుచ్చినట్లయితే, వాని ప్రత్యేక స్వరూపము ఎట్లు సుస్పష్టమవుతుందో, అట్లే మణిప్రవాళములో, తెలుగు సంస్కృతముల పదస్వరూపము చక్కగా వ్యక్తమవుతుంది. అట్టివానిని కొన్ని చూపుచున్నాను.

'కిం దారుణా వంకరటింకరేణ
కిం వానసా చీకిరి బాకిరేణ
సర్వజ్ఞ భూపాల విలోకనార్థం
వైదుష్యమేకం విదుషాస్సహాయ.'

'వోసి వోసి వినవే మమవృత్తం
కాశిదేశమవగాహనసిక్తం
జొన్నకూడు మహిషీదధిసిక్తం
తిన్నవాడు గుణవంతుడు లోకే.'

'తండులాలు గృహమందు నసన్తి
తిండికైతె పదిమంది వసన్తి
కుండలెల్ల గదిలోన లుఠన్తి
రండ నాః కొడుకులెల్ల హసన్తి.

మల్లినాథ సూరి

'ఏకైక దుడ్డుః కులపండితానామ్
దుడ్డుద్వయం కుండలపండితానామ్
ఏగాని యేగాని కవీశ్వరాణామ్
కాసుద్వయం చిల్లర పండితానామ్.

సర్వమంగళేశ్వర శాస్త్రి

చింతకాయ కలేకాయ బీరకాయ తమాదికే
ఉచ్చింతకాయ వాక్కాయ సాధకాయ తమాంజలిమ్

అభినవ పండితరాయ
మాడభూషి వెంకటాచార్యకవి

నశ్యదానం మహాదానం వస్త్రదానంతు మధ్యమమ్
కపిసం కన్నెదానంచ అన్నదానం వృథావృథా.

ఆషాడ శుద్ధపంచమ్యాం వచ్చెనే వృద్ధగౌతమీ
అథవా తప్పిదారేణ ద్వాదశ్యామది తప్పదూ.

కల్లుభిఃచెడ్డభిశ్చైవ పుల్లుభిర్బట్టపీలికైః
అథవా తిన్నె ఓరంచ పంచైతే శౌచసాధకాః.

(ఎవరివో?)

మచ్చునకు చూపితినికాని యిట్టి రచనలు తెలుగుభాషలో చాలా ప్రాచీనకాలమునుండి యున్నట్లు పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకములోని ఈ క్రింది పద్యము తెలుపుచున్నది.

'అనయము చేతులందు
భవదంఘ్రి సరోజయుగం నమామి
నెమ్మనమున సంస్మరామి
యను మాట

నిన్ వరివస్కరోమ్య హమ్మనుచు
మణిప్రవాళమున నంకన సేయుదు
భక్తలోక హృద్వనజ విహారలోల
బసవా! బసవా! బసవా! వృషాధిపా!

63. ప.

క్రీ. శ. 1250 ప్రాంతముననున్న కేతన నాటి కిట్టి మణిప్రవాళ రచనకూడ వ్యాప్తమగుచుండుట చేతనే, తన ఆంధ్రభాషా భూషణమున దీని కాతడు అనుశాసనము చేయవలసివచ్చినది.

'వృక్షేణ దక్షాయ పక్షిభిః పుత్రస్య
యను విభక్తులు తెనుంగునకు జొరవు
అస్తిప్రయాతి గాయంతి భుంక్తే సంతి
నయతి స్మరతి యను క్రియలు సొరవు
గత్వాహసిత్వా ప్రకాశ్య సంతజ్యనా
దనరు త్వాంత ల్యబంతములు సొరవు
గంతుంపురీం రిపుంహంతుం సుతంపాతు
మనుతు మున్నంతంబు లరయ జొరవు
అపిచతుహిలైన వానను లనగ బెక్కు
లవ్యయంబులు చొరవెందు నాంధ్రకవిత
బెరపడంబులతోడను దొరలి నిల్చు
నవి తెనుంగులు గావింతు నభిమతముగ.'

పై పద్యమున 'ఆంధ్రకవిత' యను మాట గమనింపదగినది. దీనినిబట్టి తెలుగున[4] నొకప్పు డీ రచన యుండెడిదనియు, కేతన నిషేధించిన నాటి నుండియు నది వృగ్యమయ్యెననియు చెప్పవచ్చును.[5]

### అనుకరణ విధానము

కాలక్రమమున పై మణిప్రవాళ రచన—అనుకరణ విధానమునకు మార్గదర్శకమైనది. అనుకరణ విధానమనగా, వాక్యముగాని, పద్యముగాని యంతయు సంస్కృతభాషలో నున్నను—వాని చివర అను అనుక్రియ చేర్చుట. ఉదాహరణ:

'సాధీయోముఖపూరితోద్వమితా
సత్యోర్ధ్వగోదన్వద
ర్ణోధారాంతరటత్తిమింగిలగిల
ప్రోద్దాంనినిధ్యాన ల
ధీశ ప్రభుతా స్వభాగహరణా
ర్థాయాయి నాథానుజ
ప్రాధాన్యాతి విలోలవాక్ద్వగబట
బ్రహ్మన్ స్తుమన్ త్వాం అనున్'

ఈ పద్యమున 'అనున్' అనునది తెలుగు. తక్కినదంతయు సంస్కృతమే. అయినను, తెనుగు ద్రుతాంతక్రియ యుండుటచేతను, తెనుగుభాషకు నియతమగు యతిప్రాస లుండుటచేతను, నిది తెలుగు పద్యమే యగుచున్నది. కాలక్రమమున పద్యమంతయును గాక, పద్యభాగములయందును, గద్యభాగములయందును, సంస్కృత వాక్యములను యథాతథముగా వాడి, వాని చివర అనుక్రియ చేర్చు సంప్రదాయము వ్యాప్తిలోనికి వచ్చినది. నన్నయయే ఈ సంప్రదాయమునకు ఆద్యుడని చెప్పవచ్చును. భారతావతారికలో ప్రారంభము చూడండి:

'శ్రీ వాణీగిరిజాశ్చిరాయదధతో
వక్షోముఖాఙ్గేషు యే
లోకానాంస్థితి మావహన్త్య విహతాం
స్త్రీపుంస యోగోద్భవామ్
తేవేదత్రయమూర్తయస్త్రి పురుషా
స్సంపూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ
శ్రీకంధరాశ్రేయసే.'

అని సకల భువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరిహర స్తుతి

4. మణిప్రవాళ రచనలు, తెలుగునకేకాక తోడి ద్రవిడభాషలందున్నవి. తమిళమున, కన్నడమున, మళయాళమున నిట్టి రచన లున్నట్లు సోమనాథుని వృషాధిప శతకమునందే ఉదాహరణము లున్నవి. స్థల సంకోచమువలన నా పద్యముల నిందు పొందుపఱచ లేదు. మణిప్రవాళశైలి మళయాళభాషలో సంప్రదాయసిద్ధము. నేటికిని నిలిచియున్నది.

5. ఈ నిషేధమును సూచనగా క్రీ. శ. 1100 ప్రాంతమువాడగు కవిజనాశ్రయకర్త రేచనయు చేసియున్నాడు.

యించి'...ఉపలబ్ధమైన తెలుగు సాహిత్యములో తొలి గ్రంథమగు భారతమే, సంస్కృత శ్లోకముతో ప్రారంభమై, 'అను' అనే తెలుగు పదప్రుతో ప్రారంభమగుచున్నది. దీనినిబట్టి నన్నయయే, తన తరువాత వెలువడు తెలుగు సాహిత్యమంతయు సంస్కృత వాఙ్మయానుసరణమే యగునని ముందుగానే సూచించెనని కొందఱి విమర్శకుల యభిప్రాయము. ఇది యెట్లున్నను నన్నయ ఈ పద్ధతి పద్యములం దనుసరింపలేదుగాని వచనములో ననుసరించియున్నాడు. పాల్కురికి సోమనాథుడు తెలుగు కవు లందఱిలోను, ఈ రీతిని హెచ్చుగా నుపయోగించుకొన్నాడు. పండితారాధ్య చరిత్రలో 367 సంస్కృత వాక్యములు గ్రహింపబడినవి. తరువాతి కవులు పద్యములలో నుపయోగించుటచేత తెలుగు వైయాకరణులు దీనిని అనుకరణ సంధిగా పరిగణింపవలసివచ్చినది. ఇందువలన వాక్యము సంస్కృతమైనను సంధిచే తెలుగైనది.

## ప్రత్యయ పథకము

తెలుగు విభక్తి ప్రత్యయములు చేర్చి సంస్కృత పదములు వాడుకొను సంప్రదాయమునుబట్టి సంస్కృత పదజాలమునంతయు తెలుగుగా చేయు నవకాశము గలిగినది. పదములేకాదు—సంస్కృత సమాసములను యథాతథముగా తెలుగు ప్రత్యయము చేర్చి, వానిని తెలుగు చేయవచ్చును. ప్రకృతి సిదముగా, అచ్చ తెనుగునకాని దేశితెనుగునగాని సమాసము లుండవు. కాని తెనుగున నేడు సమాసము లుండుట, తత్సమ పదమ్మూలముననేయని గ్రహింపవలెను. ఎంత దీర్ఘ సంస్కృత సమాసమునైనను—చివర వాక్క తెలుగు ప్రత్యయము చేర్చి దానిని తెలుగు చేయవచ్చును. ఉదాహరణము లెన్నేని చూపవచ్చును. పద్యమున నొకటి, వచనమున కొకటి చూపుదును.

'సాల కదంబ నింబ కుట
జ ప్రజ కింశుక నారికేళ త
క్కోల జటాజటాలవట
కుంజ విశాలరసాల తాళ హిం
తాల తమాల లోల దళ
దాడిమ మంజుల వంజు ళార్జునో
త్తాల మధూక తిందుక వి
తానవికాసిత కాననంబులన్.

భాస్క. సుం. 60 ప.

ఇందు పద్యము నాలుగు పాదము లొకే సమాసము, చివర తెలుగు ప్రత్యయము.

(అది మఱియు)

'మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాతకామ్రాతక నరసపనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుంద కురువక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సింధువార చందన పిచుమంద మందార జంబూ జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళు బిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశు పాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర.మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంత సమయ సౌభాగ్య సంపదంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలిత లలిత విటపవిటపి వీరు -న్నివహాలంకృతంబును—'

భాగవతము—అష్టమస్కంధము - 24.

ఈ వచనమంతయు సంస్కృత సమాసమే-చివర తెలుగు ప్రత్యయము. పై రెండు గ్రంథములు తెలుగే గదా. మహాసముద్రమువంటి సంస్కృతభాషను గ్రహించుటకు ఒక చిన్నతెలుగు ప్రత్యయమునకున్న శబ్దశక్తి ఎంత మహత్తరమైనదో గదా.

తెలుగు సంస్కృతభాషల అవినాభావ సంబంధాన్ని నిరూపించే మఱి రెండు విషయాలను తెలుపుతున్నాను. ఒకటి చిత్రప్రశ్నోత్తరాలు. రెండు ఉభయ భాషాకందాలు. ఇవి కడమదేశభాషలలో వేనియందు లేవు.

## చిత్ర ప్రశ్నోత్తరాలు

ప్రశ్నలు సంస్కృతభాషలోను — ఉత్తరము సంస్కృతములోను? తెనుగులోను ఒకే పదముగా ఉండుట.

'కిం వదత్యాతురో వైద్యం
వాజిశాలాచ కీది
ఆంధ్ర సంస్కృత భాషాభ్యా
మేకమే వోత్తరం వద.'

రోగి వైద్యుడితో ఏమంటాడు? గుఱ్ఱాలశాల నేమంటారు? అని ప్రశ్నలు రెండింటికి 'మందురా' అని జవాబు. తెలుగులో 'మందురా' అనగా మందు కావాలి అని అర్థము. సంస్కృతములో 'మందురా' అనగా గుఱ్ఱాలశాల—'వాజిశాలాతు మందురా' అని అమరుడు. (అమరము. ద్వితీయకాండ. పురవర్గము. 6.).

ఉభయభాషాకందములు

ఉభయభాషాకందమున ఒకే తెలుగు కంద పద్యమును పదముల విఱుపుచేత కేవలము సంస్కృత పద్యముగాను కేవలము అచ్చతెనుగు పద్యముగాను సమన్వయించి అర్థము చెప్పవచ్చును. చూడుడు :

'మా యమ్మాసను నీవే
రాయలవై కావ దేవరా జేజేజే
మాయాతుమలా నినయది
పాయక సంతోసమున్న పలమిల సామీ.
(కళాపూర్ణోదయము 6–161.)

అచ్చతెనుగున పదవిభాగము.

దేవరా, జేజేజే, ఇలసామీ, నీవే రాయలవై, కావ, ఉన్న పలము, సంతోసము, పాయక, మాయాతుమలు, అనిన యది, మా యమ్మాసను.

తాత్పర్యము :

రాజా, నీకు జయము. ఇచ్చటి ప్రభువా నీవు పాలకుడవై కాపాడుటవలన ఫలమగు సంతోషము మా మనస్సులలో నెలకొన్నది. మా యమ్మ తోడు సుమా !

సంస్కృతమున పద విభాగము :

మా—అయమ్—మానసు నీవే—రాః—అలవా—ఏకా—అవత్—ఏవ రాజే ఆజేజే—మా—ఆయాతు—మలాని—న పాయక—సంతః—అసముత్ నవల—మిల—పా—అమీ.

అన్వయ క్రమము—(హే) సునీవే, అయమ్, మామాన, రాః, అలవా ఏకా, అవత్ఏవ, అజేజే రాజే మా ఆయాతు మలానిన (హే) పాయక, సంతః యది అసముత్, నవల, మిల, అమీపా .

తాత్పర్యము—

విశేషముగా మూలధనముగల రాజా, రాబడిని పురస్కరించుకొని మూలధనము వెచ్చింపకుము. ధనము నాశనము లేనిది—తన్ను పెంచినవానిని పెంచునది ముఖ్యమైనది అగును. విష్ణువును పూజించెడు రాజు కొఱకు లక్ష్మి వచ్చును. పాపములు రావు. విద్వాంసులు వచ్చినయెడల సంతోషములేనివాడవై తొలగక వారితో కూడియుండుము. విద్వాంసులు—ఆ లక్ష్మి స్వరూపులే.

ఇట్టి ఉభయభాషా కందపద్యము—పిండిప్రోలు లక్ష్మణకవి రచితమైన లంకావిజయము (రావణదమ్మీయము)న గలదు. (2–230). ఈ రెండింటికి అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి (1831–1892) ఎనుబదేండ్ల క్రిందట వ్యాఖ్యానములు వ్రాసియున్నాడు. విస్తరభీతిచే దాని నిచట ఉదాహరించలేదు.

పై వివరణమువలన ఒకవైపున తెలుగు తన ప్రత్యేక వ్యక్తిత్వము నిలువబెట్టికొనుచు వేఱొక వైపున సంస్కృతభాషను తనలో నెట్లు సమ్మేళనము చేసికొననది తెలియగలదు. ఇంతేకాదు—దేశభాషలలో యావద్భారత వర్షమున, నిత్య వ్యవహారమునను, గ్రాంథికముగాను సంస్కృతమునే యుపయోగించి దానిని సజీవముగా భాసింపజేసినది తెలుగుభాష. భిన్నత్వమునం దైక్యత పెంపొందించినది. ఎట్టి విలక్షణ తత్త్వముగల యితర భాషలనైనను, తనలో నిముడ్చుకొనగల శక్తివంతమైనది. ఈ రీతిగా భాషా సమైక్యత, జాతీయ సమైక్యత తెలుగు సాధించినది.

వివాదములు, విమర్శలు, విశేషముగా మన భాషా చరిత్రలో వ్యాప్తి చెందుచున్నవి. అందుండి నిర్దిష్టమైన విషయములు నిరూపింపవచ్చునని చూపుటకే ఈ వ్యాస ముద్దేశింపబడినది. భాషావేత్తలు, విద్వాంసులు దీనిని పరిశీలింతురని భావించుచున్నాను.

---

6. ఇట్టి వింకనూ గలవు. ఎనభైయేండక్రింద అచ్చుపడిన 'నానార్థగాంభీర్య చమత్కారిణి' అనే గ్రంథములో అర్థముతో వివరింపబడినవి. ఇంకా ఎన్నో సంప్రదాయసిద్ధంగా వ్యాప్తిలోనున్న చమత్కారాలను ఆ గ్రంథం తెలుపుతుంది. భాషా సంప్రదాయ దృష్ట్యా వీని సేకరణ ఆవశ్యకముగా చేయదగినది.

# కొడవటిగంటి నవలాలోకం

## శ్రీ రామమోహనరాయ్

కథారచనకు సాంఘిక ప్రయోజనం ఉండాలని గుర్తించిన రచయితలు కొద్దిమందే. వారిలోనూ సాంఘిక ప్రయోజనంతోనే వ్రాయాలని సంకల్పించిన వారు మరీ అరుదుగా కన్పిస్తారు. 'కానరాకే కదలించటం' అనేది కవిత్వానికివలెనే సాహిత్య ప్రక్రియ లన్నింటికీ వర్తిస్తుంది. కదలించే కథలతో శిల్పం చెడకుండ, బోధచేసినట్లుగాకుండ సంస్కారాన్ని నరనరాల్లోకి ఎక్కించగలిగిన కథారచయితలు తెలుగులో చాల కొద్దిమందే ఉన్నారు. వారిలో శ్రీ కొడవటిగంటి కుటుంబరావు అగ్రగణ్యులు.

'Poetry is the criticism of life' అనే సూక్తిని నవల విషయంలో మరింత చక్కగా అన్వయించవచ్చు. జీవిత ప్రతిబింబమే నవల అయితే జీవిత వైవిధ్యాన్నంతటినీ ప్రదర్శించాలి నవల. జీవితాని కున్నంత గాంభీర్యమూ, లోతూ నవలకీ ఉండాలి. కొన్ని సంఘటనల నేరుకొని ఎంత చక్కగా మలిచినా అవి కథానిక లవుతాయేగాని నవల కావు. సంఘటనలను కళాత్మకంగా ప్రదర్శించటంలో నేర్పు చూపించినంత మాత్రాన, వాటిని ప్రపంచించి, అద్భుత సత్యాలను మనస్సుకు పట్టేలాగ చెప్పినంతమాత్రాన నవలా రచయిత కృతకృత్యుడైనట్లుకాదు. జీవితాన్ని కళాత్మకమైన వాస్తవికత (Artistic reality) తో దర్శింప జేయటం ప్రతిభతో కూడుకొన్నపని. ఎంత తక్కువలో ముగించినా జీవితంపట్ల ఒక అవగాహన కలిగించ గలిగితే నవలారచన సార్థకమైనట్లే. ఈ విషయాన్ని గమనించి ఉత్తమ నవలా రచయితలుగా గణుతికెక్కిన వారు తెలుగులో కొద్దిమందే ఉన్నారు. వారిలో శ్రీ కుటుంబరావు సారస్వతంలో విత్తనాల ధాన్యం పండించిన కృషికుడు.

శ్రీ కుటుంబరావు సారస్వత జీవితం ప్రారంభించి నాలుగు దశాబ్దాలు పైమాటే. సుదీర్ఘమైన యీ కాలంలో ఆయన కలం క్రిందపెట్టిందిలేదు. కథలు, కథానికలు, స్కెచ్‌లూ, గల్పికలూ, నాటికలూ, వ్యాసాలేగాక నవలలు, నవలికలూ వ్రాశారు. గుణం లోనే గాక రాశిలోనూ అపరిమితమైన ఆయన రచన లన్నీ జీర్ణించుకున్నవారుండటం కష్టం. రచనలు ప్రారంభించాక తెనుగు పత్రిక లన్నింటికీ ఆయన రచనల నందించారు. చిన్నా పెద్దా తేడాలేదు. వాటిలో కొన్ని పత్రికలు యిప్పుడు వెలువడటంలేదు. ఆ పత్రికలలోపడి ఆ తరం పాఠకుల ఆదరాన్ని సంపాదించుకొన్న రచనలు యిప్పుడు సంపుటాలుగా దొరకటంలేదు. ఉదాహరణకు శ్రీ కుటుంబరావు వ్రాసిన 'తల్లిలేని పిల్ల' అనే కథాసంపుటం యిప్పుడు లభించటంలేదు. కాలంకంటే ఎప్పుడూ ఒక పదేళ్లనా ముందే ఉంటారు కుటుంబరావు. ప్రచురణకర్తలొకరు చెప్పినట్లు సారస్వతంలో వెనుకబడి ఉండటానికి గుర్తు శ్రీ కుటుంబరావు కథలు చదివి ఉండక పోవటమే. నాలుగు దశాబ్దాలుగా సాగిన ఆయన రచనా వ్యాసంగం అంతా ఒకచోటనే లభించకపోవటం తెలుగు జాతి దురదృష్టం. రచయితల 'Complete Works' ప్రచురించటం ఎంత అవసరమో యీనాటికీ పాఠకులూ, ప్రచురణ కర్తలూ గుర్తించటంలేదు.

బహుముఖంగా శ్రీ కొడవటిగంటి రచనా వ్యాసంగం సాగిపోయినా ముఖ్యంగా ఆయనచూపు కథలూ, నవలలూ, నవలికలపైననే. అందునా ఆయన నవలలూ, నవలికల రచనాతత్వాన్ని పరామర్శించటం కష్టసాధ్యం. ఐతే ఏవాక్య రచన చదివినా రచయితగా శ్రీ కుటుంబరావు వ్యక్తిత్వం వెల్లడౌతుంది, ఆయన వ్రాసిన రచన లెన్ని చదివినా ఆయననుండి తెలిసికోవలసింది యింకా ఎంతో ఉన్నట్లనిపిస్తుంది. మాట్లాడినంత సహజంగా వచన రచన చేయటం ఆధునిక రచయితలలో ఆయన లాగా మరెవ్వరికీ కుదరలేదు. కాని తెలుగు వచనంలో కుటుంబరావు వొరవడి యేమీ యేర్పడలేదు. దానికి కారణం ఆ రచనలలోని అసాధారణమైన సాదాతనం.

తన ప్రక్కనే జరుగుతున్న జీవిత నాటకాన్ని చెవి యొగ్గి విని వెన్వెంటనే వ్రాసుకుపోయినంత సహజంగా ఉంటాయి వారి నవలల్లో సంభాషణలు. జీవితమెంత రసవంతమైన నాటకమో ఆయన నవలలూ అంతటి రసవత్తరాలు. 'Novel is a pocket theatre' అనే సూక్తి అక్షరాల ఆయన నవలలకు సరిపోతుంది.

నలభైయేళ్ల పైబడిన సారస్వత వ్యాసంగంలో ఆయన రచన అన్నింటినీగాక, కొన్ని నవలలూ, నవలికలూ పరిశీలించి వాటిలో రచయిత అజ్ఞాతంగానే ఉండి వెల్లడించిన జీవిత సత్యాలనూ, అనుస్యూతంగా పాఠకుడి ఉత్కంఠను రేకెత్తింపజేసి చదివించే రచనా శిల్పమూ ఆకళించుకోవచ్చు 'చదువు' అనే నవల వ్రాసిన కొంతకాలందాకా ఆయన మరెన్ని కథలు వ్రాసినా ఆ నవలాశిల్పం తెనుగువారి హృదయాలలో మాసిపోలేదు. ఈనాటికీ ప్రౌఢవయస్కులు ఆ నవలను తెలుగులోని ఉత్తమ నవలల్లో వొకటిగా కళ్ల కద్దుకుంటున్నారంటే ఆ నవలలో ఏ విషయాలు అంతగా ముగ్ధుల్ని చేశాయో చూద్దాం.

సుందరం అనే యువకుడు ద్వితీయ ప్రపంచ యుద్ధం ముందటివాడు. ఆ కాలపు స్వాతంత్ర్యోద్యమంతోనూ, కరువురోజులైన 'డిప్రెషన్' రోజుల తోనూ, ఉషారేఖలు తొంగిచూస్తున్న సాహిత్యం తోనూ సాన్నిహిత్యం కలవాడు. తల్లి వాళ్లో అక్షరాలు దిద్దటం నేర్చిన పసివాడు పెద్ద చదువరియై, స్వాతంత్ర్యోద్యమంలో అంటీఅంటనట్లుండి, ఎమ్మే ఎలెల్బీ చదివి నిరుద్యోగిగా మిగిలిపోతాడు. కాని చదువుల పరమార్థం ఆలస్యంగా అతడి కప్పటి కర్థమౌతుంది. 'చదువు' నవలలో శేషగిరి విశిష్టమైన పాత్ర. సత్యాగ్రహోద్యమంలో చేరి, ఉద్యోగం చాలించి, పిల్లల చదువులు చాలించి, జాతీయ పాఠశాల నడిపి ఎన్నో ఎదురుదెబ్బలు తిన్నతరువాత గూడ అతడిని సమాజం అర్థంచేసికొని గౌరవించకపోతే ఖిన్నుడౌతాడు. బలవంతపు బ్రహ్మచర్యంవలె తప్పనిసరియై సత్యాగ్రహోద్యమంలో జైలుకు పోతాడు. అదేమంటే తన పిల్లలనుకూడ శ్రీకృష్ణ జన్మస్థాన మలంకరించక పోవనివ్వట మటుంచి 'నా కెలాగూ తప్పదుగదా' అంటాడు. ఆ తరువాత కోరికలు చంపుకున్న ముని వొస్తరుగా బయటికిరాని కీర్తికాంక్షతో వేగిపోయి దారిద్ర్యాన్ని కోరి వరించి, విధిలేక అట్టే పెట్టుకుంటాడు. శేషగిరి దయనీయమైన వ్యక్తి. సీతమ్మ గారంటే సుందరం తల్లి. ఆమె వ్యక్తిత్వం విలక్షణమైనది. మాతృత్వం తొణికిసలాడే తెలుగు తల్లి ఆమె. తన బిడ్డకు తానే చదువు నేర్పించటం ప్రారంభించి అమోఘమైన ఆనందం పొందుతుంది. తనకురాని ఇంగ్లీషు కొడుకునేర్చుకుంటున్నపుడు తాను చెప్పలేకపోయినందుకు చెప్పలేనిబాధ పొందుతుంది. భర్త పోయాక ఏకాకిగానే, బంధువుల సాయం అడపాదడపా పొందుతూ కొడుకును పెంచి, పెద్దవాణ్ణిచేసి చదివిస్తుంది. కొడుకుతో యెడబాటు సహించలేని తల్లిపేగు ఆమెది. సీతమ్మగారిలాటి వ్యక్తిత్వమే వారిటీనల వ్రాస్తున్న 'అనుభవం'లోని 'పార్వతి'కి ముమ్మూర్తులూ సరిపోతుంది.

శ్రీ కుటుంబరావుగారి నవలాశిల్పంలో చదువు మరీ ప్రాథమిక దశ. జీవితచిత్రణ కిచ్చిన ప్రాముఖ్యము జీవితసత్యాల నద్భుతంగా వెల్లడించటంలో చూపించలేదు. చదువు నవల వ్రాసినాటికి ఆయన అభూతకల్పన లెరుగడు; మిథ్యాదర్శాలను వర్ణించడు; అతిలోకపాత్రచిత్రణ ఆయన కలంనుండి రాదు. అన్నిపాత్రలూ, సంఘటనలూ సమాజంలోవే సంభాషణల నాయన కూర్చలేదు. విని వ్రాశారేమో ననిపిస్తుంది. సమాజపునడక ఉన్నది ఉన్నట్లుగానే ఆయన రచనలో రూపురేఖలు దిద్దుకొన్నది. ప్రతిభ ఆయన సొత్తు కావటంవలన, కళలను రాజకీయాలనుండి విడివడ నివ్వటం సుతరామూ ఆయన అంగీకరించక పోవటంచేత, వర్గకలహంద్వారా సమసమాజ నిర్మాణంలో అపారమైన విశ్వాసం కలవాడు కావటంచేతా, నవలలోని పాత్రల నాయన తన వాదాని కనుగుణంగా మలుచుకుంటాడు. ఇదే వారి నవలల్లో లోపమైతే యీ లోపం బెర్నార్డ్‌షా నాటకాలలోనూ ఉన్నది. శ్రీ కుటుంబరావు చెప్పినట్లుగానే వినేవీ, ఆయన వాదంలాగే గడుసుగా వాదించి నెగ్గేవీ అయిన పాత్రలూ, వర్గకలహాన్ని పనిగట్టుకొని సంఘటనల మధ్య నిరికించి, పాత్రల మనసుల్లో దూరి, పెట్టుబడిదారీ సమాజంపైన చావుదెబ్బలుకొట్టి, జీవితంలో

రాజకీయాల కత్యధిక ప్రాధాన్య మివ్వటమూ, ఆయన రచనలలో కొరుకుడుపడని కొన్ని విషయాలు.

'ఎండమావులు' అనే నవలికలోనూ రాజు అనే ప్రెస్ కార్మికుడు కమ్యూనిజాన్ని గూర్చి, కమ్యూనిజావిర్భావంతో మరో ప్రపంచపు మంచిసమాజాన్ని గూర్చి దీర్ఘోపన్యాసాలు చేస్తాడు. ఈ విధంగా కమ్యూనిస్టు సిద్ధాంతాలు వల్లించటం శిల్పానికి లోపంగా శ్రీ ఆర్ద్ర అభిప్రాయపడ్డారు. కాని యిది పొరబాటు. వ్యక్తులు రాజకీయ సంభాషణలను వల్లించటం శిల్పలోపమెలా గౌతుంది? అందునా కార్మికులలో అటువంటి రాజకీయ విశ్వాసాలు గలవారుండటం సర్వసహజం. 'ఫాసిజమ్'స్థానాన్ని కమ్యూనిస్టు వ్యతిరేకత కాజేసిందని శ్రీ కుటుంబరావు తమ రచనలలో అడుగడుగునా హెచ్చరిస్తూనే ఉన్నారు. ప్రెస్ పనివాళ్లలో కమ్యూనిస్టు భావాలున్న వాళ్లుండటంలో అబ్బురమేమున్నది? ప్రెస్ పనివాడుగా జీవితం ప్రారంభించి సినిమాలో సంభాషణలు వ్రాసేదాకా ఎదిగి, ధనంతోబాటు అంతస్తునుగూడ పెంచుకుంటాడు రంగారావు. అతడి తాళిగట్టిన భార్య అనుకూలవతికాకపోగా, ప్రతికూలవతిగూడ కావటంతో సుందరం అనే తన చిన్నప్పటి స్నేహితురాలితో సంబంధం యేర్పరచుకొంటాడు. ఈ యిద్దరి జీవన సాహచర్యం రచయిత సమర్థిస్తున్నట్లు కన్పిస్తుంది. ఈ సంబంధాన్ని సహించగలిగిన పాఠకులున్నా హర్షించగలిగిన వాళ్లుండటం అరుదు. సినిమా వ్యక్తులు రంగారావును దూరంచేసినతరువాత, తన యథార్థస్థితిని గుర్తించేటట్లు చేసినవాడు తనతోటి కార్మికుడూ, కమ్యూనిస్టు అయిన రాజే. లయతప్పిన రంగారావు జీవితాన్ని మళ్లీ గాడిలో పడేసిన 'అర్ధాంగి' సుందరమే. తనను కాటందిన సినిమా జీవితంమీదికే తిరగబడాలనుకొంటాడు రంగారావు. ఇటీవలి నవలాసాహిత్యంలో ఎన్ని అభిప్రాయభేదాలకు గురియైనా ఎండమావులు నిస్సందేహంగా ఉత్తమ నవలిక.

కమ్యూనిస్టు సిద్ధాంతాలపై అపారవిశ్వాసం కలిగిన ప్రజ్ఞాశాలి కుటుంబరావు కమ్యూనిజం ఒక ఆదర్శంమాత్రమే కాదనీ అవశ్యం అవలంబనీయమైన జీవిత విధానమనీ దృఢంగా విశ్వసించి 'అరుణోదయం' నవలలో స్థాపించారు. ఇది ఏకపక్షచిత్రణ అనడానికి సంకోచింప నక్కరలేదు. అందులోని కథ నాయన క్రొత్తగా వ్రాయలేదు. 'స్వర్గసీమ' సినిమా కథనే తీసుకున్నట్లు చెప్పారు. స్వర్గసీమలా సాగే నడిమితరగతి సంసారం ఆర్థికచిక్కులలో పడినప్పుడు, అతడి పెంకుటిల్లు కుంగిపోయి, లేమి ముంచెత్తినప్పుడు అతడికి దిక్కును చూపేదీ, ఆదరించేదీ తనలో కలుపుకొని ఐకమత్యపుశక్తిని చాటేదీ కమ్యూనిజం వొక్కటే నంటారు. చిత్రణ ఎంత బాగున్నా కమ్యూనిజం వొక్కటే రక్షించగలదనటం శంకాస్పదం. అరుణోదయమయ్యేదాక నడిమి తరగతి వేచి ఉండకతప్పదనీ, అదొక్కటే శరణ్యమనటం జీవితాన్ని వొకవైపునుంచి చూడటమే.

'అనామిక' అనే చిన్న నవలలోనూ స్నేహితుల మధ్య చిన్న రాజకీయ చర్చ నేర్పరచి అందులోకూడ కమ్యూనిజపు విశిష్టతను పనిగట్టుకొని ఉగ్గడించారు. చురుకైన యువకుడు గోవిందరావు సారస్వతాభిలాషి. ఒక సంపన్నుడు తన రచన ననువదించమని కోరగా అందుకు సమ్మతించాడు. అతడి భార్య సీత అభిమానాన్ని చూరగొంటాడు. ఆమె చనిపొయ్యేముందు అతడికి కొక మంచి ఉద్యోగం వచ్చేయేర్పాటు చేస్తుంది. అంతేకాక తన వ్రేలి ఉంగరాన్ని ఆ యువకుడి కాబోయే భార్యకు కానుకగా పంపిస్తుంది. ఈ చిన్న నవలికలోనే విషయంలో ఐక్యతలేదు. ఎక్కడి కక్కడే రచయిత తన వాదాలను వెల్లడించుకోవటానికి చిన్న చిన్న చర్చా వేదికలేర్పరిచారు. చదువుతున్నప్పుడాయన రచనాశక్తి చదివించినా, పుస్తకం మూసి ఆలోచిస్తే యీ చర్చ లీనవలలో అనవసరమనిపిస్తాయి.

ఐశ్వర్యం మనుష్యులను వేరుచేస్తుంది. క్రిమినల్ లాయర్‌గా అనేకమంది నేరస్థులను, హంతకులను శిక్షనుండి తప్పించి, చాల డబ్బు సంపాదించిన లాయరొకాయన తన కొడుకు డాక్టరై డబ్బు సంపాదనకు విముఖుడై ప్రజాసేవ చెయ్యాలనుకోవటం సహించలేడు. అంతేగాక ఆ కుమారుడే తన దగ్గరకు పేషెంటుగావచ్చిన ఒక వ్యక్తి చనిపోగా అతడి వితంతువును భార్యగా స్వీకరించాడు. ఇది సహించలేక కొడుకును దూరం చేసుకొంటాడు. సంతృప్తితో బ్రతుకుతున్న కొడుకును చూసి దారిద్ర్యానికి రంగుపూసి జీవించటమని హేళన చేస్తాడు; చీదరించు

కుంటాడు; మమకారాన్ని తెంచుకోలేకపోయినా భౌతికంగా దూరంగానే జీవిస్తాడు. విశ్వసాహిత్యావలోకనం చేసిన డాక్టరు తన వృత్తిధర్మాన్ని నిర్వర్తించటంలో నియమబద్ధంగా మాత్రమే జీవిస్తాడు. అందువలన డబ్బు రాకపోగా పేషెంట్లనుండి దూరమై ప్రాక్టీసు లేని డాక్టరుగా మిగిలిపోతాడు. కత్తిమీద నడిపించినట్లు ఆయన తన భార్యాబిడ్డలను సాదాగా, ఉన్నతమైన ఆదర్శాలతో జీవించేటట్లు చేస్తాడు. కాని కథ అడ్డం తిరుగుతుంది. ఆయన కుమార్తె 'నర్సు' తాత పంచనచేరి భోగభాగ్యాలనే అభిలషిస్తుంది. అందుకు డాక్టరు బాధగా నిట్టూర్పు మాత్రమే విడుస్తాడు. ధనికులైన మధ్యతరగతి మనుష్యుల మనస్తత్వంతో ఐశ్వర్యానికున్న లంకెను చక్కగా వర్ణించారు. వాళ్లు తాత్కాలికంగా డబ్బులేనివారైనా సమయమూ, అవకాశమూ వచ్చినప్పుడు మాత్రం ధనికుల పంచనే చేరతారంటారు రచయిత. డాక్టరూ, డాక్టరును ప్రేమించిన ఆదర్శాలున్న యువకుడు, 'నర్సు'ను పెళ్లాడి ఆమె స్వార్థానికి విస్తుపోయిన ఈ యువకుడూ ఆదర్శాలలో విఫలమైనట్లు వాస్తవాలనే రచనలో రూపం దిద్దారు.

వ్యక్తుల బలహీనతలనూ, భయాలనూ అతి చమత్కారంగా వాడుపుగా — బెదిరిన మనుష్యులు, భయం కథలలో బయటపెట్టారు. దేవుడి భయం; కార్మికభయం; దొంగలభయం యిటువంటి భయాలే గాక సంఘంలో తెలివిగా, నేర్పుగా బ్రతుకుతున్న వాళ్లను చూసి, బెదిరిపోయే మనుష్యుల మనస్సులనూ, చేతలనూ, మాటలనూ మంచిజరుగబోతున్నప్పుడు కీడును శంకించి, అనవసరంగా అమిత భయపడే మనస్తత్వాన్ని అద్వితీయంగా వివరించారు. సీతప్ప; రావమ్మ; సత్తెం; సోవిదేవి, ఆ కుటుంబంలో అందరూ వింతైన బెదిరిన మనుష్యులే. సీతప్పవంటి ఉయస్థులూ, అసమర్థులూ, అల్పజీవులు ఎందరో భన్నారు. వారిని రచనలో ప్రవేశపెట్టి విజయం సాధించినవారు కొద్దిమందే. వారిలో శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి చిత్రించిన సుబ్బయ్య వొకడు (అల్పజీవి). భయం కథలు చదువుతూంటే పాఠకులు ఆ బలహీనతలు తమలో ఉండగానే ఒక భయంతో వాటిని మళ్లీ చదివి, చప్పరించి ఆ భయం తమలో లేదని సరిపెట్టుకోజూస్తారు. మొదట్లో వాట్టి 'కారికేచర్'లాగే శ్రీ కుటుంబరావు సీతప్పను గూర్చిన రచన ప్రారంభించారటకాని అది సజీవమైన పాత్ర. జీవమున్న ఆ పాత్రను కారెక్టర్‌గా గుర్తించి కొనసాగించారు. శ్రీ కుటుంబరావు రచనల నభిమానించేవారి కాయన రచనలలోని జీవితసత్యాలను నెమరువేసుకొన్నంతగా ఆయన చిత్రించిన పాత్రలు చిరస్మరణీయంగా కన్పించవు. ఆ కొరత బెదిరిన మనుష్యులు; భయం కథలవలన తీరింది. ఆ రచనలలోని వ్యక్తులందరూ సజీవమైనవారుగ కలకాలం తెలుగువారిలో మెసలుతారు. అసలు వాళ్లు సమాజంలోనివారేగా. కాకపోతే కుటుంబంలో ఉన్న వ్యక్తులందరూ బెదిరిన మనుష్యులు కావటం వింత. ఈ బెదిరిన మనుష్యులకు సరియైన గడుసరి శ్రీమతి భానుమతిగారి 'అత్తగారు'. బలహీనతలు పెరిగితే సీతప్పలాగ మారిపోతామనే భయాన్ని చదువరులలో కలిగించారు.

వాస్తవసమాజజీవనంలోనుండి కొంతదూరం ముందుకు నడిచి 'కొత్త అల్లుడు'; 'కొత్తకోడలు' ఏవిధంగా ఉండాలో ఆదర్శంగా తీర్చిదిద్దారు. సంకుచిత భావాలుగల నడిమి తరగతి జీవులను కాలాతీతంగా ఊహిస్తూ, ఆదర్శంగా తమ జీవితాన్ని తామే కావలసిన విధంగా తీర్చిదిద్దుకోగలిగేవారిని చూసి సహించకపోవటమూ, ఐతే ఆదర్శజీవులు ఈ దివాంధుల చేతిలో బందీలుకాక, తామే విజయం పొందటమూ ఈ నవలల్లో ద్యోతకమవుతాయి. ఈ నవలలు సహజంగా లేవని అనిపించవచ్చు. కాని రాబోవు యుగం దూతలైన యువకులకు మార్గదర్శకాలు.

కొత్తఅల్లుడులో కమలమ్మ, ముకుందుడూ సంకుచితత్వానికి ప్రతీకలు. అనుమయ్య మంచివాడే— "Nothing but a good man." అల్లుడు కుశాలరావు కాలాతీత వ్యక్తి. యువకు లందరికీ ఆదర్శప్రాయుడు. కొత్తకోడలులో సరోజిని ఆడపిల్లలలోనే మణిదీపం. ఆ అమ్మాయి గుణగణాలు చూసి ఈనాటి ఆడపిల్లలు ఎంతైనా నేర్చుకోవాలి. హనుమాయమ్మగారు ఇంటికి పెత్తనం చలాయించుకోవాలనే పిచ్చి పట్టుదలగలది. కుటుంబం కలిసిమెలిసిఉంటే కలిగే ఆనందం ఆమె యెరుగదు. పిల్లలందర్నీ పిరికివాళ్లుగా, అసమర్థులుగా పెంచాలని ప్రయత్నిస్తుంది. కాని కాలమే వాళ్లను కాలానుగుణంగా పెంచుతుంది.

ఆమె భర్త వస్తుతః మంచివాడైనా, హనుమాయమ్మ నోటికి జడిసి మంచి సూచనలివ్వబోయీ మానుకుంటాడు. చలపతి, సరోజినిని ప్రేమించీ, ఆ అమ్మాయికంటె ముందుగా వెల్లడించలేని అసమర్థుడు.

పై నవలల్లో గుర్తుంచుకోదగిన జీవితసత్యాలు కోకొల్లలు. 'మాకు దారిద్ర్యభయం జాస్తి. అందుకని వీలైనంత దరిద్రంగా బ్రతుకుతుంటాం' అంటాడు చలపతి. కొనుక్కోగలిగీ వాచీ, రేడియోలయినా కొనుక్కోకుండానే ఎన్నో మధ్యతరగతి కుటుంబాలు కల్పించుకొన్న దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. బాల్యంలో నేరాలు చేసినవాళ్లు పెదయ్యాక బుద్ధిమంతులైనా సంకుచితులైన మనుష్యులు మాత్రం వాళ్లను వేటాడ్డం మానుకోరు. ఈ అజ్ఞాలను, అజ్ఞతను తొలగించుకొని, పెద్దవాళ్ల ప్రమేయం తగ్గించుకొని, స్వతంత్రించి వివాహాలు చేసుకోవచ్చునంటారు. కుశాలరావు తన మామగారినుండి బంధుత్వాపేక్షనుతప్ప దేనినీ ఆశించడు. ఇది ఎంత దొడ్డగుణం!

స్నేహితుల మధ్యనుండే రాగబంధం ఎంతటి బలీయమైనదో, పవిత్రమైనదో వివరిస్తారు 'స్నేహితులు' అనే నవలికలో. 'సృష్టిలో తియ్యనిది స్నేహమే.' ఐతే బాల్యస్నేహం మరీ తియ్యనిది. ఈ బాల్యస్నేహానుబంధాలు పెరిగి పెద్దవాళ్లయ్యాక, వివాహాలై జీవితాలలోకి కొత్త వ్యక్తులు ప్రవేశించాక, మనస్సులలో ఏవిధంగా అడ్డుగోడలు పెరిగి, పెద్దవై, రాకపోకలూ, పలుకరింపులూ, చూపులూ తగ్గిపోతాయో చక్కగా చెప్పుకుపోయారు. ఈ అనర్థాలకు మూలకారణం ఆర్థిక సమస్యలే. ఆడవాళ్ళుకూడ మరికొంత కారణం కావొచ్చునంటారు. తన భర్త స్నేహితులను, వాళ్ళ వాళ్ళ సంపదనుబట్టే చాలమంది మధ్యతరగతి కుటుంబీకులు స్నేహితులను అంచనా కట్టటాన్నిచూచి ఆయన విస్తుపోతారు.

ఆర్థికమైన చిక్కులు లేనివాడు మధ్యతరగతిలో పెద్ద అదృష్టవంతుడికిందలెక్క. ఆర్థికమైన చిక్కులున్న వాడేమో శాపగ్రస్థుడున్నా. ఆప్తమిత్రులనుండి ధన సహాయం స్వీకరించవలసినప్పుడు అభిమానియైన సంసారిబాధ వర్ణనాతీతం. శ్రీ కుటుంబరావు వర్ణనల కతీతంకాదని యీనవలిక నిరూపిస్తుంది. కుటుంబస్నేహాలను పటిష్ఠంగా ఉంచుకోవటానికి పెద్దవాళ్లు పిల్లల పెళ్లిళ్లు నిశ్చయింపజూస్తారు. వాళ్ల మనస్సులు తెలుసుకోరు. తెలుసుకున్నా అది పెళ్ళిళ్ళకే దారితీస్తాయనుకోవటం సరికాదంటారు.

విడ్డూరమైన మనస్తత్వం గలిగిన 'ఇందిర' అనే అమ్మాయి తనకు తన తండ్రి యివ్వలేని చీరలూ, నగలూ, కారూ, మేడా యివన్నీ ధనవంతుడిని పెళ్లాడి తీర్చుకోవాలనుకొంటుంది 'తిమింగలం వేట' అనే నవలికలో. బుద్ధిమంతుడూ, పత్రికాఫీసులో చిన్న ఉద్యోగం చేస్తున్న యువకుడి సంబంధం తండ్రితెస్తే తిరస్కరిస్తుంది. తనకంటె ఎంతో పెద్దవాడూ, భార్యపోయినవాడూ అయిన తన దూరపు బంధువు రఘురామయ్యను పెళ్లాడాలనుకొంటుంది. ఎంతకీ రచయితలు తల్లిదండ్రుల డబ్బాశనూ, స్వార్థాన్ని బయటపెట్టి దుయ్యబడతారేగాని కన్నెపిల్లల మనస్సులలోనూ ఉండే దురాలోచనలు, దూరాలోచనలూ వ్రాయరు. కాని శ్రీ కుటుంబరావు యీ నవలికలో కొత్తకోణంనుండి వివాహసమస్యను మన ముందుంచారు. తిమింగలంవంటిరఘురామయ్య పెళ్ళికి సమ్మతించకపోగా, ఇందిర తండ్రిని చెడతిడుతూ ఉత్తరం వ్రాస్తాడు. ఇందిర తండ్రి తన కుమార్తె ఆలోచనలకు క్రుంగిపోతాడు. తల్లిమాత్రం హర్షిస్తుంది. కాని సాధ్యపడనందుకు మాత్రమే విచారిస్తుంది. విధిలేక ఇందిర, తండ్రి ఏ సంబంధం కుదిర్చినా సరేనని సిద్ధమౌతుంది ఇటువంటి ఇందిరలు మన సమాజంలో ఎందరో!

పై కథలో తిమింగలం రఘురామయ్యకంటే 'పెళ్ళికూతురు' కథలో వెంకటేశ్వర్లే మెరుగు. పిల్లతండ్రీ, తన సహాధ్యాయీ కుత్సితపు బుద్ధితో డబ్బాశతో కుమార్తెను తనకు, మూడో పెళ్ళి వాడికి కట్టబెట్టబోగా ఆ అమ్మాయి గడుసుగా బుద్ధి చెప్పింది. అందరాడపిల్లల లాగా నూతిని గోతిని వెతక్కుండా, ఏడ్చి శోకాలు పెట్టకుండా వెంకటేశ్వర్లు మనస్సు మార్చేస్తుంది. ఆ అమ్మాయి మనస్సు తెలిసికొన్న వెంకటేశ్వర్లు తన కొడుకుకే ఆ అమ్మాయినిచ్చి పెళ్ళి జరిపిస్తాడు.

తెలుగు కథలలో యువతీయువకులెప్పుడూ అందమైన వాళ్లే. వాళ్ళ తల్లిదండ్రులుకూడ అందం మిగిలి, యౌవనం జారిపోయిన అందగాళ్లే. వాళ్ల

బంధువర్గమూ అంతే. కురూపులకు కథలలో స్థానం లేదు. శ్రీ కొడవటిగంటి సాహసంతో కురూపుల కథలు వ్రాశారు. కనకం అనే యువకుడు బస్సులో తనను చూసి నవ్విన అమ్మాయి కురూపి యని అసహ్యించుకుంటాడు. పని ఉండి వాళ్ళింటికే వెడతాడు. క్రమంగా పరిచయం పెరుగుతుంది. అది స్నేహం మాత్రమే. ఆ అమ్మాయికి వచ్చిన విపత్తులో అంటే ఆ అమ్మాయి ప్రాణాధికంగా ప్రేమిస్తున్న వాళ్ళ అన్నకూతురు బేబీ చనిపోయినప్పుడు ఆ 'షాక్' తట్టుకోలేక పోతుంది. ఆ ఆపదలో కనకం ఆమెను వోదారుస్తాడు. ఆప్యాయతతో దగ్గరకు తీసుకొంటాడు జాలి ప్రేమగా పరివర్తనం చెందుతుంది. ఆ అమ్మాయి కనకం డొక్కలో దూరి పండుకొంటుంది. ఆ అమ్మాయిని మాతృభావంతో చూసి తన తలపుకు సిగ్గుపడి నవ్వుకొంటాడు. 'కురూపి' అనే యీ పేరు గలిగిన పెద్దకథను ఉత్తమ కథల చేర్చవచ్చు. కథలలో యిది నూతన ప్రయోగం. సమర్థుడైన రచయిత తీర్పు. కురూపులకే కాదు. మంచి కథలు చదవాలనుకొని అవి రావటం లేదనే సహృదయులకుకూడ వోదార్పు.

మరొక కురూపిని గురించి psycho-analysis తో గల్పిక వ్రాశారు. నిజమైన ప్రేమ కురూపికీ, సౌందర్యానికీ మధ్యజనిస్తుందని వాదించి వొప్పిస్తారీగల్పికలో. అది ప్రేమో—కామమో మనమే తేల్చుకోవాలని అసందిగ్ధంగా వొదిలేస్తారు.

శ్రీ కుటుంబరావు వ్రాసిన మంచి కథలను వ్రేళ్లమీద లెక్కించాలంటే వ్రేళ్ళు చాలవు. ఆయన కథలన్నింటినీ చదివిన వాళ్ళెందరో ఉండరు. నేనూ అన్ని కథలనూ చదవలేదు. ఏ కథ మంచిదనటంకంటే ఏ కథ మంచిది కాదో ఆలోచించాలి. నచ్చిన కథలు, నచ్చని కథలుగా విభజించుకోవచ్చునుగాని ప్రయోజనంలేని కథలనాయన వ్రాయవే లేదు. 'సూరి సిద్ధాంతం' పేరుతో ఆయన వ్రాసిన నాలుగు కథానికలూ జాతిరత్నాలు. సూరి సూపర్‌మాన్. కాలాన్ని శాసించగలడు. తాను ప్రగతి పథంలో నడుస్తూ యితరులను నడిపించగలడు. సనాతనమతం అన్న వాడినల్లా జైల్లో పారేస్తే కొన్నాళ్ళకు హరిజనుల్లోనే గాంధీ మహాత్ముడు పుట్టుకు రావచ్చునంటాడు. దగాపడిన తమ్ముళ్లైన హరిజనుల ఉద్ధరణ జరగాలంటే సనాతనులను శిక్షింపక తప్పదంటాడు సూరి.

మూఢ నమ్మకాలను హేళనచేసి, ఖండించిన రచయితలు చాలమంది ఉన్నారు. కాని సున్నిత మనస్కులనుకొనేవారి అంతరాత్మ దాస్యాన్ని; పవిత్రులనుకొనే వాళ్ళిచ్చిన ధనం దాచిపెట్టి, ఆ డబ్బు ఖర్చయినప్పుడు వాళ్ళకు కష్టాలొస్తాయనుకొనే నవీన మౌఢ్యాన్ని (అనుబంధం నవలలో) తూర్పారబట్టటం శ్రీ కుటుంబరావు విశిష్టత. ఆచారపరులుగా, శీలవంతులుగా, పెద్దమనుష్యులుగా నటించే పెద్దల లొసుగుల నాయన యెన్నటికీ సహించరు. ఉపేక్షించరు; కలంపట్టి కథ వ్రాయక వొదిలిపెట్టరు. సంఘంలోని లోపాలను కళాత్మకంగానే కథలలో జొప్పించి, వాటి పరిష్కారమార్గం ఆలోచిస్తే అందే విధంగా వదిలేస్తారు. ఇంతటి సారస్వత సేవ చేసిన తెలుగు కథకుడు మరొకడు లేడనటం అతిశయోక్తి కాదు.

శ్రీ కుటుంబరావు కొన్ని నాటికలూ వ్రాశారు. అయితే అవి దుస్తులు మార్చుకొన్న ఆయన కథలే. కథలలోని పాత్రల సంభాషణలు సజీవంగా ఉంటాయి గాబట్టి కథలను నాటికలుగా వ్రాయటానికెక్కువ శ్రమపడనక్కర లేదు. వాటి ప్రదర్శన గురించి, నాటక శిల్పం గురించి, నాటికలకు కావలసిన సకలమైన హంగుల గురించి తెలుగు వారంతగా పట్టించుకోలేదు. చదివి ఆనందించి వదిలేశారు. 'యథార్థవాది, అనే నాటికల సంపుటిలోని నాటికలూ, మరికొన్ని పౌరాణిక పాత్రల ఉదాత్తతను క్రిందుపరచిన నాటికలూ, బకాసురుడివంటి హేతువాద ప్రధానమైన నాటికలూ ప్రదర్శనలో విజయవంతం కావటం కష్టం. అయితే సంభాషణలు నాటకీయంగా లేవనటానికిసీల్లేదు.

'రసరాట్టు' అనే చిన్న పుస్తకం ఆయన స్కెచ్‌లూ, గల్పికలూ, అభూత కల్పనలతో కూర్చబడినది. రచనా శిల్పం పరాకాష్ఠనందుకొన్న కొడవటిగంటి రచనలివి. ఇందులో ఏ వొక్కటి చదివినా రచయిత పేరు చూడకుండానే అది కుటుంబరావుగారు వ్రాసినదని చెప్పవచ్చు. మనస్తత్వాలను చిత్రీకరించటంలో యీ గల్పికలు గొప్ప 'ఎక్స్‌రే'లు. 'నీ భార్య మహాపతివత అనుకుంటున్నావు గామాలు. నిన్నెరక్క మునుపు నా దగ్గరకు ముప్ఫైమూడుసార్లు వచ్చింది. కాదనమను'—ఈ వాక్యం చదివాక ఒక్క

ఊపున ఆ రచన చదవకుండా ఎలా ఉండగలం? ఉత్తమ శ్రేణికి చెందిన గల్పిక లిందులో ఉన్నాయి.

శ్రీ కుటుంబరావు వ్యాసా లనేకం వ్రాసినా ఎక్కువ భాగం రాజకీయాలకు, సారస్వతానికీ, సినిమాలకు సంబంధించినవి. రాజకీయ లోకంలో ఆయన మార్క్సిస్టు సానుభూతిపరుడైనా వివిధ రాజకీయ సిద్ధాంతాల నాకళించుకొన్నవాడు. ప్రజాస్వామ్య దేశాలలోని దారిద్ర్యం బాధాకరమైతే, కేపిటలిస్టు దేశాలలోని దారిద్ర్యం మరింత దుర్భరమన్న ఆయన అభిప్రాయం గణింపదగినది. కళాకారునికి స్వాతంత్ర్యమూ, తన కాళ్ళమీద నిలబడలేని ఆర్థిక వ్యవస్థ, వ్యాపారస్థుల ఆశ్రయమూ, ఉన్నన్ని రోజులూ కళలు కాంతివంతం కావు; నేలమీద నిలిచి కళ మానవ వికాసానికీ, ఆనందానికీ తోడ్పడదంటారు. సారస్వతవనంలో పిచ్చిమొక్కలు పిచ్చిగా తలయెత్తినప్పుడు గురజాడ అప్పారావనే తోటమాలివచ్చి పరిమళ భరితమైన పువ్వులు పూయించాడనీ, ఆ వనమాలి పోయాక మళ్ళీ గుంటపూలే పూయిస్తున్నాయనీ హెచ్చరిస్తారు. ఆయన వ్యాసాల నొక్కచోట చేర్చి పుస్తక రూపంలో ప్రచురించనే లేదు.

విజ్ఞాన శాస్త్రాభివృద్ధిని ప్రశంసిస్తూ, వివరిస్తూ, మానవ విజ్ఞాన ప్రగతికి అవి ఏ విధంగా దోహదకారులో చెప్పటానికి ఆయన వ్యాసాలేగాక పుస్తకాలు గూడ వ్రాశారు. కొన్నింటిని అనువదించారు. తెలుగులో విజ్ఞాన శాస్త్ర గ్రంథాల కొఱతనని కొంతవరకైనా తీర్చగలవు.

నవలా, కథానికలే ప్రధానమైనా కుటుంబరావుగారి సాహిత్యం శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. పుష్పించి విరివిగా ఫలించింది. వీరి సాహిత్యం విరగకాచి వొంగిన సహకార తరువులాగ కన్నులకింపై చవులూరిస్తుంది ఆయన కథా—శరీరానికి రాజకీయాలు రక్తనాళాలు. సాహిత్య వ్యాసంగం చైతన్యం. ప్రజాహితమూ, సాహిత్యంతో సంస్కారాన్ని అందించటమూ ఆయన ఊపిరి. సమసమాజ నిర్మాణం ఆయన గమ్యం.

భాషలో ఆకర్షణ ఒక్కఊపున చదివించ గలిగినా, చెప్పదలచుకొన్న విషయానికున్న ప్రాధాన్యం భాషకు లేదు. విషయం ఆనందింపజేసినా అందమైన దనిపించదు. ప్రకృతి సౌందర్య వర్ణనా, కళ కళ, కోసమేనన్న కళాకారుల కౌశలాన్ని నుతించటమూ కన్పించవు. వాస్తవం పేరిట పేర్లలోనూ, సంభాషణలలోనూ వికృతత్వానికి చోటిస్తారు. కొందరు రచయితలేమో నేలమీద నడవనివ్వని తమ పాత్రలకు కుహనానాగరకనామాలనుంచితే, వాస్తవమని ఉన్న పేర్లనే విరిచి ప్రత్యేకత జూపిస్తారు. సరోజను సరోజిని, సుభద్రను సుభద్రాం అనీ, కనకసుందరరావును 'కనకం' అనీ 'నర్సు' అనీ రసస్ఫూర్తిలేని వాస్తవం వ్రాస్తారు. ఈ వాస్తవికతవలన ప్రయోజనం వాస్తవికతేదప్ప మరేమీ లేదేమో!

దయనీయమైన బాలవితంతువులు, కల్పించుకొన్న ఇంటెడు చాకిరీతో సతమతమయ్యే స్త్రీలూ, వాళ్ల సంకుచితభావాలూ, క్రిందనున్నవాడు తనలాగా బ్రతికితే వోర్వలేక తన మెడ నెప్పుడూ మేడలపై సారించి అలా బ్రతకాలని కోరుకునే మధ్యతరగతి మూఢులూ, శ్రమించి శ్రామికస్వర్గం సాధించాలని కలలుగనే శ్రామికులూ, రాజకీయోద్యమాలలో చితికిపోయి, కాలంతో ముందుకు నడవలేక చతికిలబడిపోయిన చల్లారిన సంసారులూ కుటుంబరావు కథలలో అడుగడుగునా కన్పిస్తారు. ఏవిధమైన మనస్తత్వం గలిగిన వ్యక్తులయినా కుటుంబరావు రచనలలో కన్పిస్తారనటం అతిశయోక్తి కాదు. షేక్స్పియర్ మహాకవిలో యీ గుణాన్ని ఆంగ్లసారస్వత విమర్శకులు బహుధా స్తుతిస్తారు. గురజాడ రచనలలోనూ యీ గొప్పదనం కన్పిస్తుంది. ప్రపంచ ప్రఖ్యాత రచయితల రచనలను కుటుంబరావు బాగా ఆకళించుకున్నారు. ఛెకోవ్, గోర్కీ, షా, షేక్స్పియర్, భాసుడు యిలా చెప్పుకుపోతే ఎందరెందరి ప్రభావమో వారి రచనలపై నున్నది. కాని ఏవీ అనువాదాలుగాని, అనుసరణలుగాని కావు. వస్తువూ, భాషా రెండూ కుటుంబరావు స్వంతమే.

సారస్వతానికి ప్రయోజనం ఉండితీరాలనటంలో అభిప్రాయభేదా లుంటాయి. సాహిత్య పరమప్రయోజనం ఆనందమే సాంఘిక ప్రయోజనం గౌణంగానైనా ఉండాలని యీనాడెందరో గుర్తిస్తున్నారు. ఆ ప్రయోజనాన్ని పుష్కలంగా సాధించిన మహారచయిత శ్రీ కుటుంబరావు. కేరళరాష్ట్రంలో జరిగిన అఖిలభారతీయ రచయితల సభలలో నవలలపై జరిగిన సదస్సుకు శ్రీ కుటుంబరావు అధ్యక్షత వహించటం ఆంధ్రులందరికీ గర్వకారణం. 'ఆంధ్ర సాహిత్యఅకాడెమీ' ఇప్పటికైనా వారిని గుర్తించినందుకు వారు వ్రాసిన 'తార' అనే నవలకు బహుమతి యిచ్చినందుకు అకాడెమీని అభినందించాలి. ఈ బహుమతి శ్రీ కుటుంబరావు రచనలకు గీటురాయికాదుగాని వారి కీర్తిధ్వజానికి మరొక జేగంట.

# సుందరి

## "నిరాశా చక్రవర్తి"

ఈ ప్రపంచమంతా ఒక నగ్నసుందరిలా—
ఈ ప్రపంచమంతా ఒక మనోజ్ఞరాణిలా—
రాత్రి నా కలలో సాక్షాత్కరించింది
నేను నీ దానను రమ్మంది.

నేను గబగబ మేలుకున్నాను
నా సుందరిని చేరుకున్నాను
నే నప్పుడు భాషనే మర్చిపోయాను
తెలియని భావాలతో నిండిపోయాను.

ఇంతకీ ఆమె ఎవరు?
నన్నెందుకలా లాక్కుపోతోంది!
ఏ తెలియని లోకాలకో...
ఏ మేఘాల చాటుకో.........
నే నెందుకలా పరుగెడుతున్నాను?
నే నెందుకిలా మారిపోయాను?!

మార్గమధ్యంలో ఒక దారుణం
నా సుందరి జగమంతా అల్లుకుపోయింది ఆ క్షణం
ప్రతి మానవుడు నా సుందరిని దోచుకున్నాడు
నా సుందరి అందాన్ని ప్రతివాడూ దాచుకున్నాడు.

ప్రతిదాన్నీ ముక్కలు చేయాలని చూసే యీ ప్రపంచం
నేడు సౌందర్యాన్ని బద్దలు కొట్టింది
ప్రతిదాన్నీ పొందాలనుకునే ఆ అహంకారం
నా సుందరిని జగమంతా విరజిమ్మింది.

## సుందరి

మిలార్డ్, నేనేం చేయను ?
ప్రతి అందమైన వస్తువూ
కళ్ళతో నన్ను రమ్మంటోంది.
ప్రతి అందమైన ప్రాణీ
నాకోసం కలవరిస్తోంది
నేనెటు వెళ్ళేది?
ఎవరిని చేరేది?

ఉదయం బండిలో...
నన్ను దూసుకుపోయిన పడతిలో
సాయంకాలపు బడిలో...
నాపై జాలిచూపులు విసరిన యువతిలో
నా సుందరిని చూడనా?
నీవేనా నా సుందరివని ప్రశ్నించనా?

ఓ నా అందాల సుందరీ,
ప్రతిచోటా నిన్ను చూడలేక
ప్రతిసారి కన్నులు చాలక
ప్రతిమగా మారిపోతున్నాను.
బ్రతుకుతూ చచ్చిపోతున్నాను.



# విభక్తవ్యక్తి - జాన్ డోన్

శ్రీ ఇ. హెచ్. కెంట్

త్తమ సాహిత్యంలో ప్రయోగింపబడిన పద బంధాలు నానుడులై ప్రచలితం కావడం వుంది. ఆ నుడులు పదిమంది రసనలమీదను ఆడటం వుంది. ఇప్పుడు ప్రపంచంలో ఒకానొక మహాసాహిత్యంలో ఆవిర్భవించి, అట్లా నానుడియై ప్రచలితం అవుతున్న పదబంధం ఏమిటి? ఆ పదబంధం ఇప్పటి ప్రపంచ స్థితిగతులకు, వర్తమాన మానవీయవాద అభివ్యక్తికి ప్రతీకం అయినప్పుడు, ఆ పదబంధం విశ్వంకషమైన ప్రతిపత్తిని పొందుతున్నది అని అనవచ్చు. మానవీయవాదం వున్నదంటే, అది విశాలమున్నూ, పరస్పరానుషిక్తమున్నూ అయినటువంటిది. మానవసమాజంయొక్క సర్వమైన బాధ్యతలు అందులో ఇమిడివున్నాయి. ఇచ్చట బాధ్యతాపారస్పర్యము, ఆధార ఆధేయతాస్థితి ముఖ్యాలు ఈ స్థితినంతను చెప్పగల పదబంధం ఒక్కటే వుంది. ఆ పదబంధంయొక్క విశ్వంకషలక్షణాన్ని కాదనడం సాధ్యంకూడా కాదు. ఆ పదబంధం ఇది :

> 'ఏ మనుష్యుడు ఒక ద్వీపం కాదు.'
> 'No man is an Island.'

ఈ పదబంధంలో, లేక వాక్యంలో ఐదు మాటలు వున్నాయి. ఇప్పుడు ప్రపంచంలో సమాజ శాస్త్రవేత్తలేమి, రాజకీయవేత్తలేమి, సంఘసంస్కర్తలేమి ఈ ఐదు మాటలతోడి పదబంధాన్ని తరచు పల్కుతూ వుండటం వుంది మానవజాతియొక్క ఏలుక ఈ మాటలలో పొదువబడివుండటమే ఇందుకు కారణం అనిపిస్తుంది. ఈ ఐదు మాటలతోడి పదబంధంతో కలిసి ఇంకా మరికొన్ని వాక్యాలు వున్నాయి. వానిని ఎవ్వరూ పట్టించుకొనడంలేదు. పల్కడంలేదు. వాక్యాల నన్నింటిని ఇచ్చట చూడవచ్చు.

> 'No man is an island
> entire of itself,
> every man is a piece of a continent,
> a part of the main
> Any man's death diminishes me,
> because I am involved in mankind
> And therefore send not
> to know for whom the bell tolls:
> it tolls for thee'

ఈ మాటలు వ్రాయబడి 300 ఏళ్లు దాటింది. మానవసమాజం సన్నిహితం అవుతున్న స్థితిని, మానవుల మధ్య అంతరాలు, సరిహద్దులు అంతరిస్తున్నవేళ, ఇంతటి గాఢంగా, బాధమైన అర్థంతో విశ్వశక్తిని ప్రతిబింబిస్తూ, ప్రతిధ్వనిస్తూ అభివ్యక్తం చేయబడిన మాటలకూడిక ఇంకొకటి కన్పించదు. నిజమే. అయితే ఆ మాటలు వ్రాసిన వ్యక్తి ఎవరు? ఆ పదబంధాన్ని కూర్చిన మనీషి ఎవరు? ఎంతమందికి అతనినిగూర్చి తెలుసు?

ఆ వ్యక్తి నూతన సమాజ సంస్కరణవాది కాదు; ఏదో మహాసిద్ధాంతాన్ని ప్రపంచిద్దామని కూర్చున్న ప్రవక్తవంటివాడూకాదు. మానవజాతి తన చుట్టూ గోడలు కట్టుకుంటున్నది; ఆ గోడలను పడగొట్టాలి; ఈ బుద్ధితక్కువ తెరలను, కంచెలను తొలగించాలి; జాతిపేర, వర్ణంపేర కట్టబడుతున్న అడ్డంకులను బద్దలుచేయాలి అని ఏదో పనిపెట్టుకొని ఈ వ్యక్తి బయలుదేరలేదు. ప్రపంచంతోనూ, ప్రపంచ వ్యవహారాలతోను గూడా ఆయనకు సంబంధం లేదు. ఆయన ఇప్పుడుకాదు జీవితంఅంతా ఆయన తన అంతర్వ్యక్తితో బాధపడ్డాడు. సంఘర్షణ పడ్డాడు. ఆ బాధతో కవిత్వం వ్రాశాడు. ఆ కవిత్వంలో శృంగారబాధావేదన ఎంత వున్నదో, ఉన్నత పదార్థేతర తత్వ విజిజ్ఞాస, ఆకలి, అంతా వుంది.

ఈ రెండు అచ్చట పడుగు పేకల లాగా ఆయన రచనలలో అల్లుకొని వున్నాయి. అఖండ మానవ జీవన మహాసముద్రంలో ఆయన జీవితం ఒకానొక ద్వీపవతిని పోలి జరిగిపోయింది.

ఆయన అనంత ప్రతిభా సమున్మిషితుడు. అందులో అనుమానం ఏమీ లేదు.

ఆయన పేరు – జాన్ డోన్.

ఒకప్పుడు జాన్ డోన్ రాజదివాణాల వెంట తిరిగి, శృంగార కలాకలాపజుష్టమైన జీవితం గడపాలని అంగలార్చినవాడే. కాని చివరకు సెంట్ పాల్స్ కెథిడ్రల్‌లో డీన్‌గాచేరి జీవితం వెళ్ళబుచ్చాడు. 1631 దాకా బ్రతికి చనిపోయాడు. ప్రపంచం ఆయన్ను మరిచిపోయింది. ఇటీవలివరకు ప్రపంచానికి జాన్ డోన్ అనే మనిషి ఒకడు వున్నాడని, ఆయన ప్రశస్తమైన కవిత్వం వ్రాశాడని తెలియనే తెలియదు. ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభం అయిన తర్వాత ఆయన ఆత్మ మేల్కొన్నట్లయింది. ఎందుచేతనంటే, అప్పుడు, ఆ శతాబ్దంలో ఆయన వ్రాసిన కవిత్వం ఈ ఇరవయ్యో శతాబ్దాన్ని చెబుతున్నట్లు వుంది. ఆ చెప్పడంకూడా తరచినట్లు చెబుతున్నది. ఇంతకు ముందుతరాలవారు ఆయన్ను 'అదో మాదిరి' వ్యక్తిగా భావిస్తూ వచ్చారు. చదువుకున్నవాడేగాని, పాతకాలపునమ్మకాలకు కట్టుబడిపోయిన వాడు అనుకున్నారు. ఆయన రచనలో ఆ లక్షణమూ వుంది. వానిలో మతం వాసన ఎక్కువ. సనాతనత్వం పై మన్నన అధికం. డా॥ జాన్సన్ ఆయన్ను అసలు కవిగా భావన చేయనేలేదు. ఐజాక్ వాల్టన్ అనే ఆయన జాన్‌డోన్ సమకాలికుడు. జాన్‌డోన్ జీవిత చరిత్ర రచించిన వాడు కూడా ఆయనే. ఇప్పుడు ఆ జీవిత గ్రంథాన్ని చదివేవారుకూడా కన్పించరు.

ఇట్లా జాన్‌డోన్ ఈ ఇరవయ్యో శతాబ్దం వచ్చే అంతవరకు అజ్ఞాతుడుగా వుండిపోయాడు. అప్పుడు టి. ఎస్. ఇలియట్ జాన్‌డోన్‌ను పైకి ఎత్తాడు. ఇది ఒక విధమైన పునస్సాక్షాత్కారం వంటిది.

జాన్‌డోన్ వ్రాసిన దానిలో ఎక్కువ భాగం ఆయన మరణానంతరమే ప్రచురితమైంది. ఆ రచనలు టి. ఎస్. ఇలియట్‌ను ఎంతగానో ప్రభావితం చేశాయి ఎర్నెస్ట్ హెమ్మింగ్వే తన ఒక ప్రసిద్ధమైన నవలకు జాన్‌డోన్ వాడిన పదబంధాన్ని తీసుకొని, నామకరణం చేసుకున్నాడు. For Whom the bell Tolls' అన్న నవలకు పేరు జాన్‌డోన్ కవిత్వంలోనే లభించింది. ఇట్లా ప్రసిద్ధులైన ప్రతిభావంతుల చేతులలోపడి జాన్‌డోన్ బ్రతికాడు.

జాన్‌డోన్ వాడిన భాష సుందరతరమైంది. ఆయన రచనలలో నిరంతరంసాగినతాత్వికసంఘర్షణ కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. ఆ సంఘర్షణ అర్థాన్ని జాన్‌డోన్ పూర్తిగా వివరించలేదు. బయట పెట్టలేదు. ఆయనయేమో పవిత్రమైన మతధర్మంలో పడి, అందులోనే బ్రతికినవాడు. ఆయన రచనలలో అందుకు భిన్నమైనభావాలు ఉత్తమ కవిత్వంలో పొదగబడి చెప్పబడి వున్నాయి.

'One short sleep past,
we wake eternally,
And death shall be no more;
Death thou shalt die'

ఆయన మతాభినివిష్టకి, ఈ మాటలకు సమన్వయం కుదరదు. అదేవిధంగా

'For gods' sake,
hold your tongue—
and let me move'

అన్న పంక్తులు కూడాను.

తాత్వికంగా సూక్ష్మార్థసుందరాలైన ధర్మ ప్రవచనాలను జాన్‌డోన్ చేశాడు. లేడీ ఎలిజబెత్‌కు, కౌంట్‌పలాటైన్‌కు వివాహం అయినప్పుడు పెళ్లి పద్యాలను ఆయన వ్రాశాడు. వీనిని ఎట్లా సంగత పరచడం? ఇచ్చట ఆయన వ్యక్తిలోనే ఏదో వైరుధ్యం వుంది. ఏదో అసంగతస్థితి పొనువడివుంది. పెళ్లినాడు ప్రియాసంగమవాంఛావిలాసధీకుడైన ప్రియుణ్ణి గురించి

'He comes and passes
through sphere after sphere
First her sheets,
then her arms
then anywere

అని వ్రాయగలడు.

జాన్‌డోన్ కవితావ్యక్తిలోను ఆ అసంగతి వుంది.

ఇటువంటి ఆయన్ను గురించి వ్రాయబడిన మాటలు ఇట్లావున్నాయి: 'ఆయన ఆత్మ నానాబాధలు పడింది. ఐహికమైన వాంఛలచేతను, ఆముష్మికమైన ఆకాంక్షలచేతను తాడితమై వానిమధ్య ఆయన ఆత్మ నలిగిపోయింది.'

నిజంచెప్పాలంటే జాన్‌డోన్ ఒకానొకరకమైన బాధను, బాఢమైన యాతనను అనుభవించాడు. అది ఒకరితో చెప్పుకోవలసింది, చెప్పుకోతగినదికానిదై పోయింది. అది ఆయనలో అంతర్మథనం క్రింద పరిణమించింది. జాన్‌డోన్ 1573 లో జన్మించాడు. ఆయన తండ్రి రోమన్‌కేథలిక్కు. వ్యాపారం చేసుకుంటూవుండేవాడు. జాన్‌డోన్ పెద్దవాడయ్యేదాకా ఆయన లేడు. తల్లే ఆయన్ను పెంచింది పెద్దవాణ్ణి చేసింది. రోమన్‌కాథలిక్కుగా పెంచింది. అవి ఆ మతం హింసకు గురిచేయబడుతున్న రోజులు. ప్రభుత్వానికి, ఆ మతానికి సరిపడలేదు. జాన్‌డోన్‌కు సోదరుడు వున్నాడు. హెన్రీ. అతణ్ణి ఖైదులో పెట్టారు. అతను ఖైదులోనే మరణించాడు. అతను చేసిన నేరం—రోమన్ మతప్రచారకునికి ఆశ్రయం ఇవ్వడం. ఆ సోదరుని ఆ మరణం జాన్‌డోన్‌ను చాలా బాధపెట్టింది. జాన్‌డోన్‌లో అది ఒక నయంకాని కురుపును పోలి మిగిలిపోయింది. ఎట్లాగో జాన్‌డోన్ తన పదునారవయేట ఆక్స్‌ఫర్డ్‌లో చేరాడు. వయస్సులో చిన్నవాడవడముచేత, Reformed Church కి విధేయుడనై వుంటానన్న ప్రమాణం ఆయన చేయవలసిన అవసరం లేకపోయింది. అది అట్లా ఆయనకు తప్పిపోయింది.

ఆ రోజుల్లో పైకివస్తున్న కవులు రచయితలలో ఆయన ఒకడైనాడు. ఆ కాలపు మేధావులలో, మేధావివర్గం నాయకులలోగూడా ఒకడుగా ఆయన పరిగణింపబడినాడు. ఆయనకుకూడా మొదటి ఎలిజబెత్ రాణి దివాణంలో ప్రవేశం లభించింది.

జాన్‌డోన్ న్యాయవాది పట్టం పుచ్చుకున్నాడు. లార్డ్ ఎగర్టన్ ఆ రోజుల్లో Lord Keeper; ముందు ఆయనకు కార్యదర్శిగా చేరారు. ఎసెక్సు ప్రభువుతో కలిసి కాడిజ్‌కు వెళ్ళాడు. రాజదర్బారులో ఆయన జీవితం ఇట్లా ప్రారంభమైంది. ఐహిక వాంఛలు తీర్చుకొనడానికి కొదువలేదు. ఆయన జీవితం ఆ రోజుల్లో కొంతవరకు ఆక అంటూ లేకుండాకూడా సాగింది. ముందు జీవితం అంతా ఉజ్వలంగా, సర్వసుఖోదర్కంగా వంగివస్తున్నట్లు గోచరిస్తూ వచ్చింది.

ఆ స్థితిలో జాన్‌డోన్ తొందరపడ్డాడు. లార్డ్ ఎగర్టన్ బంధువయ్యైన ఒక కన్యను రహస్యంగా పరిణయమైనాడు. ఆమె పేరు ఆనీ మూర్. ఈ పెండ్లి ఆమె తల్లిదండ్రులకు ఇష్టం లేదు. వారు ఆగ్రహోద్రిక్తులైనారు. జాన్‌డోన్‌ను ఖైదులో పెట్టించారు. ఆట్టేకాలం ఆయన ఖైదులో లేడు అది వేరే విషయం. అయినా ఆయన జీవితం ఇప్పుడు కష్టాలలో పడిపోయింది. నిష్ఠురమైన బాధలకు ఆయన గురికావలసివచ్చింది. అసలు కొంతకాలం ఆయన ఎట్లా జీవించిందీ మొదలైన అనుపానులుగూడా ఇప్పుడు మనకు తెలియవు.

అంతలో బ్రిటన్‌లో కొత్త రాజా సింహాసనం అధిష్ఠించాడు. ఆయన ఒకటవ జేమ్సు. ఆయన జాన్‌డోన్ రచనాశక్తిని, ప్రతిభాసంపత్తిని మన్నించిన వాళ్ళలో ఒకడు. ఆయన రచనలను కొన్నింటిని జేమ్సు మెచ్చుకొనిగూడా వున్నాడు. జాన్‌డోన్ ఇప్పుడు జేమ్సుకు కులాచార్యుడైనాడు.

ఆ నడిమికాలంలో జాన్‌డోన్ మతగ్రంథ పఠనము, ప్రాచ్యభాషా అధ్యయనము చేసివున్నాడు. ఇప్పుడు ఆయన చేయదగు, లేక చేయగల్గిన పని ఏదన్నా వున్నదంటే, అది ఒక్కటే వుంది. అది చర్చిలో చేరడం. మతజీవనం సాగించడం.

1615 లో జాన్‌డోన్ ఎస్టాబ్లిష్‌డ్ చర్చిలో చేరాడు. అంతవరకు ఆయన మనసా అనుభవించిన యాతన అనంతమైంది. ఇప్పుడు తేరుకున్నాడు. ఆంగ్లికన్ చర్చిఅంటే, రోమన్‌కేథలిక్కులకు పడిన రోజులు కావవి. వారితో జాన్‌డోన్ తగూలుపడ్డాడు. వారిని 'ఏడిపించడం'లో తన్నుతానే మించిపోయినాడు. జాన్‌డోన్ రోమన్‌కేథలిక్ మతప్రచారకులను 'కుహనాత్యాగు'లని హేళనకూడా చేశాడు. ఇది జేమ్సుకు ఆనందసంధాయకమైన విషయం అయింది.

మత విషయంలో జాన్‌డోన్ నమ్మకము, విశ్వాసము విచిత్రపరిణతిని పొందుతూ వచ్చాయి. యధార్థమైన కేథలిక్ ధర్మసంప్రదాయ ప్రపంచంలో

ఇంగ్లీషు చర్చి ఒకభాగము, ఒక అంశము అన్న విశ్వాసం ఆయనలో పాతుకుపోయింది. అది అట్లా అని ఆయన ఆత్మనః విశ్వసిస్తూవచ్చాడు. అసలు ఆ కేథలిక్కు సంప్రదాయానికి ఇంగ్లీషు చర్చియే యధార్థప్రతినిధి అన్న నమ్మకంకూడా ఆయనకు కుదిరిపోయింది.

కొంతకాలం ఆయన ఇంగ్లీషు పల్లెపట్టులలో మతాచార్యుడుగావుండి, ఇంగ్లండులోను, ఐరోపాలోను గూడా మతప్రచారం సాగిస్తూ, ఆ మతమును, ఆ మతంతో తన కీర్తిని వ్యాప్తి చెందించుకుంటూ ప్రశస్తిలోనికి వస్తూవచ్చాడు.

1621 లో సెంట్‌పాల్స్ కెథడ్రల్ డీన్ అయినాడు. అంతకు నాల్గు సంవత్సరాల క్రితం ఆయన భార్య చనిపోయింది. పురుడు పోసుకుంటూ ఆమె మరణించింది. శిశువుకూడా పోయింది. ఇప్పుడు ఆమె ఒక చనిపోయిన శిశువును చేతులలో పెట్టుకొని ప్రేతాత్మయై ఆయన కళ్లముందు సాక్షాత్కరిస్తూవచ్చింది. ఈ సాక్షాత్కారం ఆయనకు తొలిసారిగా పారిస్‌లో వుండగా సంభవం అయింది జాన్‌డోన్‌ను గురించి ప్రచారంలోనికివచ్చిన కథలలో ఈ సాక్షాత్కార వృత్తాంతాన్ని గొప్పగా చెప్పుకుంటారు. ఇటువంటి వృత్తాంతాలు జాన్‌డోన్‌ను గురించి చాలా వున్నాయి.

ఆయన మతధర్మప్రవచనం చేస్తూవుంటే, జనం విరగబడి వినేవారు. ఇటువంటి ఒక సందర్భంలో జనం ఆయన నిలబడిన వేదికపైకి విరగబడి వస్తూవుండగా, జాన్‌డోన్‌కు విచిత్రమైన వ్యాధి వచ్చింది. ఆయన అప్పుడు చనిపోయినట్లు ప్రచారం కూడా జరిగింది. జాన్‌డోన్ కాదనలేదు. తాను చనిపోలేదని, బ్రతికేవున్నానని అనలేదు. ఆ బాధ ఆయన పెట్టుకోలేదు. నిజంగా చనిపోయినప్పుడు తనకు నిరాడంబరమైన అంత్యక్రియలను శాసించుకొని, మరీ చనిపోయినాడు.

జాన్‌డోన్ ఆదిలో కొంత కవిత్వం వ్రాసినా, తిరిగి చివరిరోజులలోగాని దానిని చేబట్టలేదు. ఇప్పుడు, ఆ చివరిరోజులలో ఆయన ప్రతిభ ఆ కవిత్వంలో లోతై, గభీరమై, తాత్వికభావసంపన్నమై ప్రతిభాసించింది. ఇప్పుడు ఈ రోజుల్లో సర్వప్రపంచాన్ని ఆకర్షిస్తున్న, సర్వప్రపంచంచేతను—అద్దా! —అనిపించుకుంటున్న, మహారచయితల గ్రంథాలకు నామధేయాలవుతున్న దివ్యపదబంధాలన్నీ ఈ చివరికాలపు ఆయన కవిత్వంలోనే వున్నాయి. 'Death, be not proud'; 'Mine own Executioner'—వంటివి.

జాన్‌డోన్ మతప్రచారకుడు. వేత్త. మహాకవి. మానవీయతాతత్వసంభారమర్యాదమైన ఈ ఇరవయ్యో శతాబ్దం పల్కుతూవున్న ఉత్తమ నినాదం ఆయన ప్రతిభనుంచి ఆవిర్భవించింది. 'One World' అన్న పదబంధం ఆయన లేఖినినుండి ఉద్భవించింది. ఇది ఆయనకు అంతాతెలిసి వచ్చిన పదబంధం అంటామా! జాన్‌డోన్ హృదయంవలన, స్వాభావికజ్ఞానంవల్లనూ కూడా వట్టిపరార్థతరతత్వాలాలసుడు. వట్టివేదాంతి. ఏవిధంగాను ఆయన్ను పూర్తిగా మానవీయతావాది అని, అట్టి సమగ్రతాత్వికుడని అనలేము. ఆయన ఏకప్రపంచగానం చేశాడు. కాని జీవితాంతం 'ద్వీపవతి'గా వుండిపోయినాడు.



# వేయి శబ్ద విచారము

శ్రీ ఎం. కందప్ప శెట్టి

మూలద్రావిడమునందలి సంఖ్యావాచకములు—ఆర్య భాషల ప్రభావమువలన చాలవరకు నేటి ద్రావిడభాషలలో మాయమైనవి. సాహిత్యముగల నేటి దక్షిణ ద్రావిడభాషలలో 'నూఱు'వరకే సంఖ్యావాచకములు నిలిచియున్నవి. సాహిత్యములు లేని కొన్నిద్రావిడ భాషలలో మూడు, నాలుగుకంటె తర్వాతి సంఖ్యావాచకములు మాయమైనవి. వీటిస్థానే ఆర్యభాషా రూపములను అరువు దెచ్చుకొన్నవి ఉదా —బ్రాహుఇ— అసిట్=ఒకటి, ఇరట్=రెండు, ముసిట్=మూడు; తక్కినవి ఆర్యభాషా ఋణపదములు. కురుఖ్—ఒంద్=ఒకటి, ఏండ్=రెండు, మూంద్=మూడు, నాఖ్=నాలుగు; తక్కినవి ఆర్యభాషా ఋణపదములు. ఇత్యాదులు.

సాహిత్యముగల దక్షిణ ద్రావిడములందును 'ఏడు' తర్వాతి సంఖ్యావాచకములలో గొంత తబ్బిబ్బులు జరిగియున్నవి. ఉదా:—తెలుగు—ఎణ్ + పది> ఎణుంబొది (శాసన)> ఎణ్మిది> ఎనిమిది. తొణ్ + పది> తొమ్మిది; ఎనిమిది, తొమ్మిది అను పదములకు మూలద్రావిడ ధాతువులు ఎణ్, తొణ్ అనునవి. ఎనిమిదికి 'ఎణ్టు' అని కన్నడమునను, తొమ్మిదికి 'తొణ్టు' అని తమిళమునను, రూపము లుండుట దీనికి ఆధారము. ఈ ధాతువులు తర్వాతి పూర్ణ సంఖ్యయైన 'పది'తో సమసించి పై రూపములు సిద్ధించినవి.

కన్నడము—ఒన్ + పత్తు> ఒంభత్తు=తొమ్మిది,
తమిళము—ఒన్ + పదు > ఒంబదు=తొమ్మిది.

ఇట్లు ద్రావిడభాషలలో సంఖ్యావాచక విషయమున తారుమారు లగుచుండగా, దక్షిణదేశమునందలి తక్కిన సారస్వతభాషలును వేయి మొదలుకొన్న సంఖ్యావాచకములను ఆర్యభాషలనుండి ఋణము గైకొని యుండగా (కన్న—సాసిర <సహస్ర; తమి, మల— ఆయిరం <సాసిరం) ఒక్కతెలుగున మాత్రము 'వేయి' అనునొక వింతపదము సహస్రార్థమున వాడుకలో నున్నది. ఇది ఆర్యఋణపదమని చెప్పుటకు ఆధారములు లేకపోవుటచే మూలద్రావిడమునుండి వచ్చిన రూపమనియే చెప్పవచ్చును.

ఈ వేయి అను మాటకు సారస్వత, శాసనాధారములనుబట్టి వేయి, వెయి, వేయు, వెయు అను నాలుగు రూపము లున్నట్లు స్పష్టముగ జెప్పవచ్చును. ఇట్లు చివరి అచ్చు మారుచుండుటచే నది ఊతగా వచ్చిన అచ్చు అనియే చెప్పవలెనుగాని మూలద్రావిడ భాషయందలిదని చెప్పలేము. ఏకాచ్క ధాతువులందు యకారపూర్వక అచ్చునకు హ్రస్వదీర్ఘములు రెండు నగుట కొన్నియెడల జరుగును. చేయి, చెయి, నేయి, నెయి, నూయి, నుయి. వేయి, వెయి మొ. వి. మూలద్రావిడమునందును నిట్టి రూపములందు హ్రస్వదీర్ఘములు రెండు నుండుటచే[1] వేయి శబ్దమునందలి ఆది అచ్చు మూలద్రావిడమునందు హ్రస్వమా దీర్ఘమా అని నిర్ణయింపలేము.

వేయి శబ్దమునకు సమానార్థక పదములు (Cognates) ఇతర ద్రావిడభాషలలో లేకపోవుటచే నీ పదచరిత్రకు ఈ భాషలోనే యేదైన ఆధారమున్నదా అని పరిశీలింతము—రూప నిర్మాణమందు వేయి పదము గోయి ప్రభృతులవలెను రేయి ప్రభృతులవలెను నున్నది. విభక్తి ప్రత్యయములు చేరునపుడు గోయి ప్రభృతులును రేయి ప్రభృతులును

---

1. M. Kandappa Chetty—'Historical Grammar of Inscriptional Telugu' (Paras) 1–75-76. Tirupati—1966 (Thesis unpublished) and see also

Bh. Krishnamurti — Telugu Verbal Bases—1—297—299.

భిన్నమార్గములుగ వర్తించుచున్నవి. గోయి—గోతులు; రేయి—రేలు. (బాలవ్యా—ఆచ్ఛిక. 35, 21) ఈ విషయమున వేయి శబ్దము గోయి ప్రభృతులలో చేరక రేయి ప్రభృతులలోనే చేరుచున్నది. అయినను చారిత్రకముగ రేయి ప్రభృతులకును వేయి శబ్దమునకును ఒక భేదమున్నది. రేయి ప్రభృతులు చారిత్రకముగ వర్ణవ్యత్యయము (metathesis) గల్గి ఏర్పడిన రూపములు. ఇరవు> రేయి; అఱయ్> ఱాయి; వరయ్> వ్రాయి. కాని వేయి శబ్దమునకు ఇట్టిది జరిగినట్లు ఆధారములేదు. కావున చారిత్రకముగ వేయి శబ్దమును రేయి ప్రభృతులలోను చేర్చుటకు వీలులేదు.

వేయి శబ్ద బహువచన రూపము చేను, పేను, మీను శబ్దములవలెను ఆవు శబ్దమువలెను తుది యక్షరమునకు లోపమయి అగుచున్నది వేయి—వేలు; చేను — చేలు; పేను — పేలు; మీను — మీలు; ఆవు—ఆలు. సూరిగారి వ్యాకరణము వర్ణనాత్మకము కాబట్టి పేను, చేను, మీను - వీటిని ఒక వర్గముగా చేసి—ఆవు పదమును వేరు వర్గమునకు కేటాయించెను. కాని చారిత్రికముగా పరిశీలించిన—ఆవు శబ్దము చేను, పేను, మీను వర్గమునకే చెందుచున్నది. ఆవు శబ్దమును తొలుత నకారాంతముగనేయుండి పిదప నకారలోపముచే నీ రూపము సిద్ధించెను. దీనికి తమిళమున 'ఆన్' అను రూపము సారస్వతమున గన్పడుచున్నది.[2] తెలుగునకు ఆవుపాలు అనుటకు ఆనపాలు, ఆనవాలు అను రూపములు శాసనములలో విరివిగ గన్పడుచున్నవి. దీనికి నిఘంటువులలో 'బాగుగా నిగురగాచినపాలు' అని అర్థమిచ్చియున్నది. కాని దీనిని చారిత్రకముగా జూచినను, ఆ ప్రయోగ సందర్భములనుబట్టి చూచినను, ఆవు పాలు అను నర్థమే స్ఫురించును.[3] మరియు, తమిళమున నాదివ్యాకరణమైన తొల్కాప్పియమునందు ఆవునేయి అనుటకు ఆననెయ్ అనురూపము సాధించబడియున్నది.[4] కనుక ఆవు పదమును తొలుత, చేను, పేను, మీను వర్గములోనేయుండి తుదకు ఏలనో విడివిడిపడెనని తెలియుచున్నది. ఈ వర్గసంబంధము బహువచన రూపములలో మాత్రము మనకు నేడు గోచరించుచున్నది.

బహువచన రూపమున నేయి శబ్దమును చేను, పేను, మీను, ఆవు శబ్దములవలె తుది యక్షరము లోపించి బహువచన ప్రత్యయము చేరుచున్నది. వేయి — వేలు. అదియుగాక ఆవు శబ్దమునకువలెనే దీనికిని నకారాంతరూపము ఒక్కొక్కచో సమాసగత శబ్దములందు గన్పడుచున్నది. ఉదా:—వేనవేలు (పండితా—ఆచ్ఛికపదపట్టిక); వేనకు వేలు. మొ. వి. కాబట్టి వేయి శబ్దమును చేను పేను మీను ఆవు వర్గములో చేరును అని నిర్ణయింపవచ్చును.

ఈ వేయి అనుమాటకు సహస్రార్థమే గాకుండ ఆధిక్యార్థమును గోచరించును. వేనకువేలు, వేనవేలు అనగా అనేకమనియే యర్థము. తమిళమున వేన్=అధికము అను నొక పదమున్నది. (Tamil Lexicon). బహుశా ఈ రెండు పదములును సంబంధపదములై యుండునని నే నూహించెదను.

| తమిళం | తెలుగు |
|---|---|
| పేన్ | పేను—పేలు |
| మీన్ | మీను—మీలు |
| ఆన్/ఆ— | ఆన్—(సమాస)/ఆవు—ఆలు |
| వేన్ 'అధికము' | వేన్—(సమాస)/వేయి—వేలు. |

ఈ పై శబ్దములలో నకారాంత పదములు మూల రూపములా? లేక నకారము తర్వాత చేరెనా? అనుట ప్రస్తుతాంశము. పై వానిలో అన్, ఆ రెండు రూపములును ఆవు అను నర్థమున తమిళమున నున్నవి. చేను అనుకుటు చేయ్ అనియే యున్నది. ఈ నకారము యొక్కచరిత్రను తులనాత్మకపరిశీలన(Comparative Study) ద్వారానే తేల్చగలము. ప్రస్తుతము నేను తులనాత్మక పరిశీలనకు ప్రయత్నించను. కాని తెలుగులోనే దీని కేదైనా ఆధారమున్నదా అని చర్చించి వదలెదను.

తెలుగుభాషలో అంత్యనకారమును ద్రుతమనెదరు. ఈ ద్రుతమునకు లోపము సహజము.

---

2. Tamil Lexicon–Madras University.

3. Historical Grammar of Inscriptional Telugu–5–2–2.

4. Tolkappiyam–Eluttu—232.

అందులోను దీర్ఘాచ్చునకు తర్వాతనున్న వకారము వకు లోపము సర్వసహజము. కావున నకారాంత రూపమే ప్రాచీనమని నిర్ణయింపవచ్చును. నకార లోపము జరిగినవెనుక ఊతకై వచ్చిన అచ్చులు భిన్న రూపములుగ పరిణమించినవి. ఆన్> ఆ—> ఆవు; వేన్> వే—> వేయి/వేయు. (వకారయకారములు సంధి గతముగ వచ్చినవి )

ఈ నకారాంత శబ్దములు చారిత్రకముగ పరిశీలించిన రెండు వర్గము లవుచున్నవి. 1. CVCVCV 2. $C\bar{V}CV$.5 కలన్వాదులు మొదటి వర్గమునకు, చేను పేను మొదలగునవి రెండవ వర్గమునకు చెందును. మొదటి వర్గమునకు—కులు (తమి—కళ్) అను బహువచన ప్రత్యయమును రెండవ వర్గమునకు —లు (—ళ్ మధ్యద్రావిడ)[6] అను ప్రత్యయమును చేరును. దీర్ఘాచ్చుమీద—లు చేరునపుడు ను లోపించును.

కలను :—కలం—కులు; కెలను :—కెలం—కులు; కొఱను :—కొఱం—కులు; కొలను :—కొలం—కులు, గవను :—గవం — కులు నెఱను:—నెఱం — కులు; వరను:—వరం—కులు; వలను:—వలం—కులు.

చేను : చే—లు; పేను :—పే—లు మొ. వి. ప్రమాను, రేను, గోను శబ్దములు చేను పేను శబ్దములవలెనే యున్నను, చారిత్రకముగ నివి కలన్వాది వర్గమునకే చేరుచున్నవి. ఉదా :—ప్రమాను> *మరన్ (తమి. మరమ్); రేను> *ఎరన్ (తమి. ఇరన్దై చూ T. L.). గోను శబము చరిత్ర సరిగా తెలియుట లేదు. కన్నడమున 'కొసగు' అను నొకపదము గోను అను నర్థమున మున్నది. (చూ. Kittle.) ఇవి రెండును సంబంధ పదములైనచో గోను అను పదమును *కొసన్> *కొయన్> *కోన్> గోను అని సాధింపవచ్చును. ఇక, ఈవె తేవె మొదలగు పదములును ప్రాచీన ద్రావిడమున నకారాంతములే యైనను తెలుగున వానికి చివర చేరిన అచ్చులను బట్టియే వాని చరిత్ర వేరుగ నూహింపవచ్చును.[7]

---

5. C=హల్లు, V=హ్రస్వాచ్చు, $\bar{V}$=దీర్ఘాచ్చు.

6. Telugu Verbal Bases—4–30.

7. వీను, మేను మొదలగు పదములును చారిత్రకముగ చేమ, పేను, మీను వర్గములో చేరవు.



# వి. ఐ. పి.

## శ్రీ తాడిగిరి పోతరాజు

"క్షమించాలి సార్...తొమ్మిది కావస్తోంది...మీకు ఏడింటికే భోంచేసే అలవాటు...ఇక వెళ్దాం"... చేతులు నలుపుకోసాగాడు, ముందుకు వంగబడిన మూర్తి.

'స్లాక్‌షర్ట్' క్రింద ధోవతి కట్టుకొన్న యన్. జి. వో.

దీనమైన చూపులతో వాడిపోయిన చిన్నకళ్ళు—వయస్సుకన్న ముందే సగంవరకూ వెంట్రుకలు రాలిపోయిన మాడు. చెవులకుపైన రెల్లుదుబ్బుల్లా పెరిగిన నలుపూ తెలుపూ వెంట్రుకలు.

మూర్తి బి ఏ కాదు—'ఓల్డ్' యస్. యస్. యల్. సి. 'ఓల్డ్' ఈజ్ 'గోల్డ్' అంటాడు తను. ఇంగ్లీషు వ్యాకరణం తెల్లవాడికన్న పది ఆకులు ఎక్కువే చదివాడు. తన 'డ్రాఫ్ట్' చూసి ఎందరో ఆఫీసర్లు 'శభాష'ని భుజం తట్టారట. వాళ్ళలో ఇద్దరు ముగ్గురు వాళ్ళ పిల్లలకు ట్యూషన్ కూడ చెప్పమన్నారట.

కానీ ప్రమోషన్ ఇప్పిస్తామని ఎవరూ అనలేదు. ఎందుకంటే మూర్తి బ్రతకనేర్చినవాడుకాదు. తాను బ్రతుకుతూ ఆఫీసరును బ్రతికించేవాడుకాదు—అల్పసంతోషి. ప్రతి చిన్నమెచ్చుకోలుకూ చెవులవరకూ పెదవులు సాగదీసికొని పిచ్చినవ్వు నవ్వటం మినహా ఏవీ తెలియదు.

'ఆలస్యమైతే ఏం ఫర్వాలేదులే.....అయినా నీ కెందు కీ శ్రమంటే విన్నావ్‌కాదు.....పాపం మీ ఇంట్లో వాళ్ళకు ఎంతో శ్రమ...పైగా ఉట్టిమనిషి కూడ కాదేమో'...నే నన్నాను.

'బాధేముందండీ ఇందులో.....మీరు మా ఇంట్లో చెయ్యికడిగితే మా కెంత గొప్పగా ఉంటుందో నలుగురిలో...తమలాటివాళ్ళు మా ఇంటికి భోజనాని కొస్తున్నారని అది ఎంత సంబరపడిపోతుందో......డ్రైవర్ని పిలవమంటారా?'...కంగారుకంగారుగా వాకిలి కేసి అడుగులు వేశాడు.

'వద్దులే...ఏపాటిదూరముందని మీ ఇల్లు...దగ్గరేగా?...నడిచివెళ్దాంలే...' ధోవతి బిగించుకొని మెల్లగా మెట్లు దిగాను. లైట్స్ ఆఫ్‌చేసి తాళం వేశాడు ప్యూన్.

నా ముందు మూర్తి 'పైలట్'లా.

నా వెనుక ప్యూన్—గార్డులా—అది నా డిగ్నిటీ—వాళ్ళతో విస్తరించి మాట్లాడితే అది (G. O.) జీ. వో. గా నా హోదాకు భంగం. శ్మశానంనుండి తిరిగి వెళ్తున్న బంధువుల్లా మేం ముగ్గురం—

ఒక ఫర్లాంగు దూరంవరకూ విద్యుద్దీపాలున్న బజారు. ఆ బజారులోని సిమెంటురోడ్డుకు అనుబంధంగాఉన్న సందువైపు తిరిగింది మూర్తి శరీరం. అటూ ఇటూ 'ట్రాఫిక్' చూసికొని రోడ్డుదాటి మూర్తిని అనుసరించాను. చెదురు మదురుగా మిణుకు మిణుకుమంటూన్న మున్సిపాలిటీ దీపాల సందు. లోతులేని సైడు కాలవల్లోపడి దొర్లాడి రోడ్డునూ, డ్రైయినేజినీ ఏకంచేసే సందులకు పట్టుగొమ్మయైన గల్లీ. దారివెంటవెళ్ళే ప్రయాణీకులను లెక్కచెయ్యక విసురుగా ఎంగిలాకులు వాలే వీధి. అక్కడక్కడ వెలుగు చారికల్లో వీధిని ఆకట్టుకొన్న అరుగులు మెట్లు. కొన్ని అరుగులపై మేకలు నెమరువేస్తూ పెంటికలు విసర్జిస్తున్నాయి.

దారిలోకి పొడుచుకొచ్చిన ఇళ్ళముందు 'వన్‌వే ట్రాఫిక్'. 'సార్...ఇక్కడ కొద్దిగా బురదగా ఉంది. అక్కడ ఆ రాతిపై కాలువేసి ఒక అంగ వెయ్యండి...కొద్దిగా ఒక్కపది గజాలు బురద...ఆ తరువాత

అంతా బావుంటుంది...' ఆ మాట అప్పటికి పదో సారి అన్నాడు మూర్తి.

'బండ ఏదీ...ఓహో...ఇదా...ఈ తెల్లగా కనిపించేదేగా?'...మూర్తి చూపిన బండను శ్రద్ధగా వెతుక్కొంటూ చిన్నరాతిపై కాలు మోపాను. ఆ 'ఫీట్' చెయ్యటం అలవాటు లేక చెప్పు చర్రున జారింది— గిలకలవరకూ తారులాటి పదార్థం. తప్పతాగి నిద్రబొయ్యేవాణ్ణి లేపితే, బూతులు తిట్టినట్లు నిశ్శబ్దత చెడిన మురుగు కాలువ ముక్కులు పగిలే దుర్గంధం వెదజల్లసాగింది.

ధోవతి పైకి తీసికొని ముక్కుకు అడ్డం పెట్టుకొన్నాను.

'ఈ ఊరు మున్సిపాలిటీ వాళ్ళుత్త రోగ్స్ సార్...ఇళ్ళమీద పన్ను సరిపోక 'వృత్తిపన్ను'ని వసూలు చేస్తున్నారు. అయినా ఈ వీధులింతే... ఎప్పుడైనా గవర్నరో, ఎవడో మంత్రివస్తున్నాడంటే ఇంత డి. డి. టీ.—సున్నం కొట్టేస్తారు...అయినా టార్చిలైట్ తేవాల్సింది నేను'...

'ఫర్వాలేదులే...కడిగితే పోతుంది'...

ఆ మలుపులోఉన్న డబ్బా కొట్టు దాటించి మరొక సందులో ప్రవేశించాడు.

'ఇక వచ్చేశాం సార్...ఇంకెంత ఫ్యూయార్డ్స్'... అని అంతలోనే ఏదో జ్ఞాపకం వచ్చినట్లు తలగోక్కుని 'మీ రిక్కడే ఉండండి సార్!'...అంటూ పెద్ద పెద్ద అంగలేస్తూ కిళ్లీకొట్టుకేసి నడిచాడు ధోవతిచెంగు పైకెత్తుకొని.

నిర్జీవమైన ఆ సందులో డబ్బాకొట్టు— చిన్నకోడిగుడ్డుదీపంతో దాని సజీవత్వం వ్యక్తపరుస్తోంది—అందంగా అమర్చిన ఖాళీ సిగరెట్టుపెట్టెలు పిప్పరమెంటు సీసాలు—ఏవేవో చిన్న డబ్బాలు. కాళ్ళు వేలాడ వేసికొని బీడి దమ్ములాగుతూ దినపత్రికను భూతద్దంలో చూస్తున్నాడు కొట్టుమనిషి.

మూర్తి గొంతు చిన్నగా మాట్లాడింది.

కొట్టుపైనుండి దూకి నిటారుగ నిలబడ్డాడు—అతను. వేలాడుతూన్న గెలనుండి సర్రున ఓ అరడజను అరటిపండ్లు కోసి మూర్తి చేతిలో పెట్టాడు. మళ్లీ మూర్తి సీరియస్‌గా చెప్పాడు గాలిలో చేయి ఊపుతూ.

బీడి ఘాటుగా నాల్గు దమ్ములు లాగి అవతల పడవేసి తమలపాకులు అందుకొని తడి తుడవసాగాడు ధోవతిపై.

'వెళ్దాం సార్'—అరటి పండ్లను ధోవతి చెంగులోదాస్తూ మూర్తి ముందుదారి చూపెట్టాడు.

మరో మలుపు తిరిగింది మూర్తి శరీరం.

'వచ్చేత్తన్నారు...వత్తన్నారు'...

వీధి అరుగుపై పది సంవత్సరాల పిల్లల గొంతులు అరుస్తున్నాయి. హరికేన్ దీపపు వెలుగులో వాళ్ల కళ్లు మిలమిలలాడుతూ పొంచి చూస్తున్నాయి. వాళ్ళ వెనుక తలుపుకు చేరువగా నిలబడిన ఇల్లాలు లోనికి తప్పుకొంది.

'మీరందరూ ఇంకా నిద్రపోలేదా!...లోనికి పొండి...' మూర్తి గొంతు కసురుకొంది.

'ఇదే సార్ మా యిల్లు...ఈ లాటి ఇల్లు మెయిన్ రోడ్డులో అయితే 'యాభై'కి తక్కువ చెప్పరు. ఇంటిముందే కుళాయి...అన్నివసతులున్నాయి. తరువాత ఇంటి ఓనర్ కూడ చాలా మంచివాడులెండి... నేను నెల తిరగకముందే టంచనుగా అద్దె అప్పజెబుతానని మనమంటే కొద్దిగా ఇది చూపిస్తాడు'...

ప్రక్కకు తిరిగి చూశాను. చెడిపోయిన కుళాయి 'సర్ సర్'మంటూ నీళ్లుకక్కి వీధంతా రొచ్చు చేస్తోంది.

'మీ రిక్కడ ఆగండి సార్ అరుగుమీద'... అంటూ లోనికెళ్లాడు. హనుమంతుడు సంజీవి కొండ తెచ్చినట్లు నిగనిగలాడే రాగిబిందెతో ప్రత్యక్షమయ్యాడు. నేను కాళ్లు చేతులూ కడుక్కున్నంతసేపూ ఒక చేతిలో సోప్ డిష్ పట్టుకొని నిలబడ్డాడు. ఫ్యాన్ అందించిన టవలుతో శుభ్రంగా తుడుచుకొంటూ, కాళ్లు విదిలించుకొని మెల్లగా లోనికి నడిచాము.

గోడలపై మాసిపోయిన దేవుళ్ళ ఫోటోలు, చినిగిపోయిన సినిమా తారల కేలండర్లు, వంకీకి తగిలించిన మూర్తి పాత చొక్కాలు, బారుకు రెండు రెక్కలు తెరచుకొన్న అలమారులో పిల్లల పుస్తకాలు, దాని ప్రక్కనే చాపపై మునగడ తీసికొన్న ఇద్దరు పిల్లలు. పుస్తకాలు ఛాతీపై వేసికొని నిద్రపోతున్నారు — ప్రక్క గదిలోనుండి ఈ వంక సన్నగా మాటలు వినిపిస్తున్నాయి.

'తప్పుకదూ!...మీకు నాన్నగారు ఇన్ని అరటిపండ్లు తెస్తారు...ఇవి మీకు కాదని చెప్పాకదా?... పెద్దవాళ్ళు మనింటి కొచ్చినప్పుడు ఇలా అల్లరి పెట్టవచ్చా?...హుష్.. ఒరే...బుజ్జీ, నీవు మరింత కరువు బోతువురా...వాటిని ముట్టుకొంటే చేతులు విరగ్గొట్టేస్తా...ఆఁయ్...పడుకోండి'...సాధ్యమైనంత మెల్లగా కసురుకొంటోంది ఆ గృహిణి కంఠం.

'నా కొకటిచ్చెయమ్మా...మళ్ళీ ముట్టుకోను. అక్కాయ్ కొద్దులే'...చిన్న పిల్లవాని కంఠం మరింత దీనంగా బ్రతిమాలుతోంది.

'జాగ్రత్త సార్... పైన గడప తగులుతుంది— పాడు...ఎప్పుడో ఇక్ష్వాకులనాడు కట్టింది సార్...ఆ పీటపై కూర్చోండి......కస్తూరీ, మా అమ్మను పిలువు'...రెండు దోసెలని గడప ఇవతలనుండి అరిచే సప్లయర్‌లా పెద్దగా కేకపెడుతూ ముందు గదిలోకి నిష్క్రమించాడు మూర్తి.

నా పీటముందు స్టెయిన్‌లెస్ పళ్ళెం— ఒక గ్లాసు—తోమిన ఇత్తడి మరచెంబుతో మంచినీళ్ళు. స్టెయిన్‌లెస్‌స్టీల్ మరచెంబు కొనలేకపోయి ఉండవచ్చు మూర్తి. పొడలుపొడలుగా నలుమూలలా ప్రాకుతోంది హరికేన్‌లాంతరు వెలుగు. గోడమీద మరో కోడిగుడ్డు దీపం.

దీపపువెలుగులో తుప్పుపట్టిన డాల్డా డబ్బాలు— ఓవల్టిన్ డబ్బాలు అసంఖ్యాకంగా చిందరవందరగా ఉన్నాయి. వాటిపైన నల్లగా పొగచూరిపోయిన లేబిల్స్—ధనియాలుకారం — మిరపకాయలు — కరివేపాకు మొదలైన పేర్లు కావచ్చు. కుంపటి ప్రక్కగాఉన్న అలమారులో ఇత్తడిగ్లాసులు, తదితర అల్యూమినమ్ వంటపాత్రలు. సరిగా పొగపొయ్యే వీలులేక వంటింటి గోడలన్నీ నల్లగా పొగబారి ఉన్నాయి. ఇల్లంతా జీర్ణావస్థలోఉన్న వస్తువులతో పాతగుడ్డలతో మాగుడు వాసన లీనుతోంది.

'నమస్కారమండి'...గాజుల గలగలలతోసహా కంఠం వినిపించింది. గృహిణి వినయంగా చేతులు జోడించింది.

తెల్లగా పాలిపోయిన ముఖం—సాగి సన్నబడిన మెడ—నొసట తిలకం—విశాలమైన కళ్ళు మినహా మరో అందంలేదు. పెట్టె అడుగున చానాళ్ళుగా భద్రపరచపడిన పట్టుచీరె నలిగిన మడతల్లో పూచిక పుల్లలా ఆమె—ప్రకోపించిన ఉదరంతో.

రెండు లడ్లు తెచ్చి నాకు వడ్డించింది.

'మూర్తీ......నాతోపాటు నీవు కూడ భోంచెయ్యి'...అడిగాను. మూర్తిలో రక్తసంచలనం ఆగిపోయింది. కళ్ళప్పగించి ఓ క్షణం అలాగే చూశాడు. 'లేదండి—మీరు భోంచేశాక నేను భోంచేస్తాను. నేనిప్పుడే భోంచెయ్యను. నేను రోజూ పదిగంటలు దాటిన తరువాతనే భోంచేస్తాను.........నే నిప్పుడే భోంచెయ్యను'......కంగారు కంగారుగా నీళ్ళు నమల సాగాడు మూర్తి.

'సరే'...లడ్డు చిదిపి తినసాగాను.

'ఇంక రెండు వేయించుకోండి'.. మధ్య గది గడపమీద కాలుపెట్టి వడ్డన విషయమై అజమాయిషీ జరుపుతూన్న మూర్తి అన్నాడు.

'వద్దు...వద్దు...ఇవి చాలు'...

'ప్రిపరేషన్ బాగుండలేదా?...

'ఓహ్...ఎక్సలెంట్'...

'అయితే ఇంకా రెండు వేయించుకోండి'... తన ఇల్లాలిని కళ్ళతో ఆజ్ఞాపించాడు.

ఒక లడ్డు తెచ్చి పళ్ళెంలో పెట్టింది.

'రెండు లడ్డులెండి...తీపి ఎక్కువతింటే వులి హోర—అవి భోంచెయ్యలేరు'......ఆమె సంజాయిషీ చెప్పింది.

'అమ్మా'...అయిదారేళ్ల పిల్ల లోనికి తొంగి చూసింది. లాంతరు వెలుగులో ఆ అమ్మాయి కళ్ళు భయం భయంగా చూస్తున్నాయి.

'నీ విక్కడి కెందుకొచ్చావ్?...వెళ్లి పడుకో. వెళ్లు. ఊరంతా నిద్రపోతూంటే నీ కళ్ల కింకా నిద్ర రాలేదా?'...ఏదో జరగరాని అపరాధం జరిగిపోయినట్లు ఆ పిల్లకేసి కళ్లు ఉరమసాగాడు.

'ఉండనివ్వు...ఎందుకలా కసురుకొంటావ్?'...

'ఈ పిల్లల సంగతి మీకు తెలియదు సార్...గారాబంచేస్తే నెత్తికెక్కి కూర్చుంటారు......ఏదో మర్యాదా మన్ననా నేర్చుకోవాలిగదా?'...

'నీకు ఆడపిల్లలెంతమంది?'

'నాకా సార్...నాకు ముగ్గురు మొగపిల్లలు. ఇద్దరాడపిల్లలు. మగపిల్లలిద్దరు పెద్దవాళ్ళు...హైస్కూల్లో చదువుతున్నారు. ఇప్పుడొచ్చిన పిల్ల పెద్దది. దీని తరువాత మళ్లా ఒక మగ పిల్లవాడు. చివరది మళ్లీ ఆడపిల్ల...ఎంతో అదృష్టవంతురాలు. అది పుట్టిన వారంరోజులకల్లా మీరిక్కడకు రావటం మా అదృష్టం...మీ చల్లని చూపు మా మీద ఉండటం, నాకీ ప్రమోషన్ రావటం, అంతా దైవ నిర్ణయం. మీరు చేసిన మేలు ఈ జన్మలో తీర్చుకోలేమండీ...రోజూ తనూ, నేనూ మిమ్మల్ని జ్ఞాపకం చేసికొంటు 'ఉంటామండి'...అర్ధనిమీలితనేత్రుడై పరవశంతో చెప్పుకుపోసాగాడు.

'ఇంకా కొద్దిగా బంగాళాదుంపలవేపుడు వడ్డించమంటారా?'...

'వద్దమ్మా...ఆ బెండకాయ పులుసు కొద్దిగా వెయ్యి'...

'అయితే మీ పెద్దమ్మాయి పుట్టినప్పటినుండి ఏమీ కలిసిరాలేదా?'...

'చిత్తం...కలిసిరాకపోవటమంటే...ఏమీ అనర్థకాలు దాపురించలేదండీ...అది కూడా ఒక అదృష్ట మనుకోవాలిలెండి...అది పుట్టిననాటినుండి ఇంట్లో ఎవరూ తలనొప్పి—జ్వరమని మంచాన పడలేదు...అదృష్టం మాట ఏమోకానీ పిల్లది చాలా తెలివి కలదండీ...పట్టుమని పదేళ్లు లేవు...పది ఎక్కాల వరకూ గణగణమని గంట కొట్టినట్లు అప్పజెబుతుంది...వెంకటేశ్వర సుప్రభాతం ఎంచక్కా చదువుతుందో...' ఉబ్బితబ్బిబ్బయిపోయి అరమోడ్పు కన్నులతో తన పుత్రికయొక్క అఖండమైన తెలివి తేటలను వర్ణించ సాగాడు.

'ఆహా...అలానా?...గుడ్...పది ఎక్కాలు చెబుతుందా?...ఏం పేరూ?' ఆవకాయ కలుపుకొంటూ అడిగాను మూర్తికేసి కళ్లు తిప్పుకొని.

'పేరు...కస్తూరండి'...

'నాన్నా...మరి తమ్ముడే...తమ్ముడే...మీరు తెచ్చిన అరటిపండ్లు తింటున్నాడు...వద్దురంటే ఏడుస్తున్నాడు'...ఆ పిల్లను మెచ్చుకోవటం గ్రహించి ధైర్యంగా కంప్లెయింట్ చేసింది — అమాయికంగా కళ్ళు తిప్పుతూ.

నేను చూసీ చూడనట్లు గమనించసాగాను.

మూర్తి నొచ్చుకొంటూ కనుబొమలు ఎగరవేశాడు.

కళ్లు పెద్దవిచేసి 'ఇక్కడికి రావద్దన్నానుకదా!. ఎందుకొచ్చావ్?... డొక్క చీరేస్తా...ఆఁయ్' అనేలా అనేక అర్థాలు స్ఫురించేలా, భీతిగొలిపే హావభావాలు ప్రదర్శించేడు.

ఆ పిల్ల కిక్కురు మనకుండ తిరోగమించింది చీకటిలో తచ్చాడుతూ— ఉన్న ఒక్కలాంతరూ కోడిగుడ్డు దీపానికి సహాయంగా వంట గదిలోనే ఉండిపోవటాన.

'పిల్లలు...సిసింద్రీలు సార్...వేపుకుతింటారు' అంటూ మెల్లగా ప్రక్కగదిలోకి నడిచాడు నా ప్రత్యుత్తరానికి ఎదురు చూడకుండా. అంతలోనే ఆ గదినుండి రెండు పసికంఠాలు బావురుమని ఏడ్వబోయ్యాయి. మళ్ళీ బలవంతంగా ఏడుపు ఆపుకోటానికై చేతులు నోటికి అడ్డంపెట్టుకొన్నప్పటి స్వనం-- మధ్య మధ్యలో ఎక్కిళ్ళు.

'మళ్లీ గొంతు వినిపించిందంటే తాట ఒలిచేస్తా...జాగ్రత్త.'

మూర్తిగొంతు సాధ్యమయినంత తక్కువ స్థాయిలో పిల్లలను అదుపులో పెట్టసాగింది.

'మజ్జిగ ఉన్నాయమ్మా'......

'పెరుగుందండీ...మీ కోసమని ప్రత్యేకంగా పాలుకొని తోడు వేశాను'. హోటల్‌లోలా చిన్నగిన్నెలో తోడుకొన్న పెరుగుతెచ్చి కంచంలో వేసింది.

'అలానా!...అయ్యో...ఎందుకంత శ్రమ?'

'అప్పుడే పెరుగు వేయించేసికొన్నారా?... అయ్యో...మీరు ఏం భోం చేసినట్లు...ఏదో చెయ్యి కడిగానని పేరుకు తప్పితే'...

పిల్లల నోళ్ళు మూయించి వచ్చిన మూర్తి మళ్ళీ నోరు విప్పాడు.

ప్రక్కగదిలోనుండి నెలలపాప ఏడుపు కెవ్వున వినిపించింది.

'అరెరే...చంటిది లేచిందే!...నే వెళ్ళి చూస్తాలే...నీవు వారికేమేం కావాలో జాగ్రత్తగా చూడు'...

'ఏమీ అక్కర్లేదు...అయిపోయిందిగా...కొద్దిగా ఉప్పువేసి నీవు వెళ్ళమ్మా'. నేనన్నాను.

'ఆ...ఫర్వాలేదు లెండి.. పాలుపట్టిస్తే ఆడే పడుకొంటుంది... ఏమండీ?...ఆ పాలసీసాతెచ్చి ఈ పాలుపోసికొనివెళ్ళి పట్టించండీ...మా పెద్ద పిల్లలున్నారంటే తొమ్మిదింటికే ముసుగు తన్ని పడుకొంటారు'...అంటూ పొయ్యిమీద పాలగిన్నె కాడపట్టుకొని మూర్తికి అందించింది.

రెండు మూడు నిమిషాల్లో ఆ చంటి పిల్ల ఏడుపు తగ్గిపోయి ఒక రకమైన మూలుగులా మారిపోయింది. మధ్య మధ్య పాలపీక చప్పరింపులు మినహా మరే శబ్దమూ లేదు.

ఎంగిలి చేయి కడుక్కొని వంటగది గడపదాటబోయ్యాను.

'కొద్దిగా తలవంచుకోండి'...హెచ్చరింపుతో పాటు తువ్వాలు అందించాడు. నా భోజనం కొరకై వినియోగించిన లాంతరు నా వెంటనే తెస్తూ ముందు గదిలోకి దారి చూపెట్టాడు.

చిన్నపిల్లలు ఆడుకొనే గిలకపండ్లు—సొట్టలు బోయిన పాత పౌడరు డబ్బాలు—లక్కపిడతలు—చంటి దాని మూత్రం తుడిచే గోనెపట్టా – మొదలైన వస్తువులను కాళ్ళతో తన్ని శుభ్రం చేశాడు.

'ఓ నిముషం ఇలా కూర్చోండి'...వాలు కుర్చీ పట్టా విదిల్చాడు. శ్మశానంలో గుంట నక్కలా కాచుక్కూర్చున్న ప్యూన్ బయట అరుగుపై తన ఉనికిని వ్యక్తపరుస్తూ చిన్నదగ్గు దగ్గాడు.

'నరసయ్యా.. నీవు లోనికెళ్ళు'...మూర్తి అతన్ని కేకవేసి నాల్గు చక్కరకేళీలున్న 'ట్రే' పట్టుకొచ్చాడు.

'ఇప్పుడే వస్తాను సార్ రెండు నిముషాల్లో... కిళ్ళీలు కట్టమని చెప్పివచ్చాము...ఇందాకవస్తూ... మళ్ళీ దుకాణం మూస్తాడేమో'...అంటూ నా ప్రత్యుత్తరానికి ఎదురు చూడకుండా తన రథాన్ని గబగబా మెట్లపైనుండి దింపి ఆ రొచ్చులోనే బలవంతంగా తొక్కుకుంటూ వెళ్ళిపొయ్యాడు.

మసక మసగ్గా హరికేన్ దీపపు వెలుగు...

వెనక వంటగదిలో గిన్నెలు సర్దుకొంటూన్న చప్పుడు...

ప్రక్కగదిలో ఏడుస్తూ—రాగంలా, చంటిపాప పాలపీకను చీకుతూన్న శబ్దం...

ప్రక్కకు తిరిగి చూశాను.

ద్వారం ప్రక్కనే మూడు నాల్గు సంవత్సరాల పిల్లవాడు. బొత్తాములులేని లాగు భుజాలకున్న పట్టీలకు వేలాడుతోంది. చొక్కాలేదు. నిద్రకళ్ళతో జోగుతూ ఆశగా విరాశగా నాకేసి చూస్తున్నాడు.

రెండు అరటిపండ్లు చూపించి అందుకోమని చెయ్యి చాపాను—కళ్ళతో పిలుస్తూ. చీకటి గదిలో 'లైట్ ఆన్' చేసినట్లు గప్పుమని అతని కళ్ళు ప్రకాశవంతమయ్యాయి. ఓ క్షణకాలం తటపటాయిస్తూ దిక్కులు చూశాడు.

'తీసుకోకురా...తమ్ముడూ' ... హెచ్చరించింది తలుపు ప్రక్కనుండి ఐదేళ్ళపిల్ల. చౌకబారు నైలాన్ గౌను – పొట్టపైభాగంలో కుట్లు ఊడిపోయి కొద్దిగా క్రిందికి వేలాడుతోంది—సరియైన పోషణలేక వాడిపోయిన బుగ్గలు—సన్నగా ఉన్న కాళ్ళూ చేతులు.

కళ్ళుమాత్రం తన పరిశీలనా శక్తినీ...తెలివి తేటలనూ వ్యక్తపరుస్తున్నాయి.

'నీవేనా కస్తూరివి?'......

.కొరాకొరా కోపంగా చూసింది.

'ఇటురా కస్తూరీ...నీవు మంచి అమ్మాయివి కదూ?...పెద్దవాళ్లు పిలిస్తే రావాలని అమ్మ చెప్ప లేదా?...ఏదీ రెండో ఎక్కం చెప్పు.. పది ఎక్కాలు చెబుతావటగా!...ఇటురా మరి.. ఇదిగో నీ అరటి పండు'...చెయ్యి చాపాను.

'నాకేమీ వద్దులే...అరటిపండ్లు...ఒక్కటైనా కూడా మిగల్చకుండా మూడూ తినేసి.. అరటిపండ్లు నాకేమక్కర్లేదు'...

ఆ చిన్నారి కళ్ళలో కన్నీరు ఊయల లూగ సాగింది—ఆ కనుపాపలు నిస్సహాయమైన కోపంతో, చీత్కారంతో నా కేసి చూడసాగాయి.

తడి ఆరిపోయిన పెదవులు లోపలికి వత్తుకొని చూపు ప్రక్కకు తిప్పుకొన్నాను.

'అక్కాయ్ కొద్దట...నీవు తీసికో!'...పిల్ల వానికి దగ్గరగా జరిగాను.

సందేహిస్తూ మెల్లగా నా.చేతిలో అరటిపండ్లు అందుకొన్నాడు. అందుకొన్నదే తడవుగా గభగభా మింగ సాగాడు—భయం భయంగా వీధి వాకిలికేసీ...వంట గదికేసీ చూస్తూ.

'మళ్లీ...మళ్లీ...రేపుకూడ వత్తారా?' కృత జ్ఞత వెల్లివిరుస్తోన్న కళ్ళతో పరవశం నిండిన కంఠంతో అడిగాడు.

'రమ్మంటావా?'.. ...దగ్గరకు తీసికొన్నాను ఆప్యాయంగా.

ఆహ్వానిస్తూన్న కళ్లతో అంగీకార సూచనగా తల ఊపి... 'అవుతే...అవుతే...మరి.. మరి.. రేపు కూడా...నాన్నగారు...నాన్నగారు.. మళ్లీ అరటిపళ్లు తెత్తారు...కదూ'...అన్నాడు ఆనందోద్వేగంతో.

'మన్నించాలి సార్'.....గసబోసికొంటూ మెల్లెక్కుతూన్న మూర్తి.



# జ్ఞాతకాలత్రయి

శ్రీ సోమసుందర్

కాలం :

క్రకచం వలె కోసింది
మకరం వలె మింగింది
ఫణం వలె బుసకొట్టింది
వ్రణం వలె విషమించింది
సంకటం వలె పీడించింది
కంటకం వలె బాధించింది.

కాలం :

కాంతి వలె జృంభిస్తోంది
క్రాంతి వలె లంఘిస్తోంది
ఉద్యమం వలె సంఘటిస్తోంది
ఉదయం వలె సంచలిస్తోంది
విప్రయోగం వలె భ్రమిస్తోంది
విప్లవోత్సవం వలె రమిస్తోంది.

కాలం :

ప్రవక్త వలె శాసిస్తుంది
సవిత వలె జ్వలిస్తుంది
పీయూషం వలె పొంగుతుంది
మయూరం వలె నర్తిస్తుంది
అధరం వలె చుంబిస్తుంది
ప్రసవం వలె బింబిస్తుంది

# 1. కాలం సంతకాలు :

హృదయంలో వ్రస్త్రక్షాళిత మయ్యే
భావాల హరిద్రంతో సారస్వతి పాదాలకు
పారాణి పచరింప బడుతుంది

కనుకనే కవిత్వం యుగాదినుంచీ మనిషికి
హార్దిక యౌవనాన్ని కాపాడే
కాయకల్ప చికిత్స
కనుకనే కవిత్వం క్షణంలో మనిషిని
పరకాయ ప్రవేశం చేయించే
అణిమాది దివ్యమంత్రం.

మనోహర ప్రత్యూషానిలవీచికల తాకిడిలో
మనోయవనికాభ్యంతరాన
వడివడిగా కదలి పోతూన్న
వేవో రంగురంగుల కలనేతచిత్రాలు
కలధౌతచిత్రాల భంగిమలు.

అల్పాల్పంగా సాగుతూన్న సరస్సుందరతరంగాలు
స్వచ్ఛ ఆనంద క్రేంకార శుభ్ర మరాళాలు
విలోకిత జలదమాలాతృషితమయూరాలు
మహీధర శిఖరాలలో
నిలచిన వృక్షాగ్రాలలో సైతం
వసంత కాలం—చేస్తూనే వుంటుంది
సంతకాలు !

శీతలించిన మబ్బులు ఆవలిస్తే
ధారాపాతంగా మంచుతుంపరలు

అవిరళంగా కదిలే మనస్ చాలనీలో
పైకి పొల్లూ క్రిందికి వెల్లూ
ఇవి—అనంతంగా సాగే
చీకటిని మింగిన వెలుతురు చిరునవ్వులు.

## 2. కాలాగ్ని కింధనాలు :

దివారాత్రాలు
సూర్యుడనే రూపాయి బిళ్ల ఒళ్లుకి
ముఖమూ పృచ్ఛమూ...

పగటి జీవితాన్ని ధనం పాలిస్తే
మాపటి జీవితాన్ని పాలించేది కామం.

త్వగింద్రియానికి జ్వలించే శక్తివుంది
కాల్చే శక్తివుంది, మండించే శక్తి వుంది
కరగి నీరయి పోయే శక్తి వుంది చిత్రం!

కాలం త్వగింద్రియం వంటిది
కాలుస్తుంది, కరగికారిపోతుంది
ఇంతలో కాలి భస్మమై పోతుంది

ఇంత వేగీయమానంగా నడుస్తున్న కాలం
వంకర టింకర్లుగానో, సమాంతరంగానో
లేక అనంతవర్తులాకారంగానో
మనిషి కెప్పటికీ తీరని సందేహమే!

ఒక మహత్తు మరణించడానికీ
వేరొక మహిమాన్విత జనించడానికీ
మధ్యపడినగండి—అదే కాలాఖాతం
దేనితో పూరించ బడుతుందో సంశయమే ?

కాలం తారుణ్యావృద్ధుడు ప్రపంచించే
చలి మంటల నెగళ్లలో
ధనమూ కామమూ ఇంధనాలు!

## 3. కాలమే నిశ్రేణి

కాలం సువిశాల వాతాయనం లోంచి
అనవరతమూ వినవస్తున్నాయి
అనంత కావ్యాల మర్మర ధ్వనులు.

స్వర్గంగాతీరాల సికతాతలాల దారులలో
నిరవధిక శాద్వల సీమలలో
పల్లవిస్తున్నాయి నిరామయకామనలు.

కవి భావనాకాశ నిర్ఝరిణీ తరంగం
కోమల నీరవ మృదురవాల
సుధా తుషారాల నాలికిస్తున్న దజస్రం.

ప్రణయ కల్లోలినీ తరంగాల తేలిన
రసహృదయా లనంత తారకలై
వికసిస్తున్నాయి కోరకితమైన కోరికలు.

మానస చింతా చింతన లమేయ బలోపేతాలు
మాననీయ గతానేక స్మృతులు విడువని ప్రేతాలు
మానవత్వమాదమాదులు కేవల ద్వైవీభూతాలు.

ఉర్వరీ ఉరస్సీమా నిక్షిప్త సకల సౌందర్యాలపైన
శర్వరీ తమశ్ఛాయ లతివేలంగా జృంభించి
కప్పుతాయి క్షితిజరేఖల మేఖలపైన.

ఆ కొన్న కాలవ్యాలంవలె ఉరికి వస్తున్న దిగంత తిమిరంలో
బాలచంద్ర శార్ఙ్గ శర్కరీ ఖండం
పురోగమిస్తుంది శరఘోషతో.

చిరంతన పథిశ్రమా జీవనులైన మహిమాన్వితులు
మహోపదేశ శ్వానాలతో దత్తాత్రేయశ్రీ పాదులై
ఘనీభూత కాలగర్భంలోంచి—
సాక్షాత్కరిస్తూనే ఉంటారు అమృతజీవనులై !

ధరిత్రీవర్చస్సౌందర్యాన్ని చెరిపేందుకు
దౌర్జన్యం నిర్మించిన పాషాణభరకుడ్యాలలో సైతం
సౌజన్యం విరుస్తుంది సహస్రసజీవనసుమాలై !

తరతరాల పాపాల సోపానాలతో నిశ్శేణిని
నిర్మించుకొని ఎగబ్రాకుతోంది మానవత.

# ఆంధ్రనాటక రంగస్థలముపై - పాశ్చాత్యులయు, పార్శీలయు-ప్రభావము

శ్రీ ఎస్. గంగప్ప

సంస్కృతమున నాటకము, రంగస్థలము – అతి ప్రాచీనకాలమునుండియు ప్రసిద్ధి వహించియున్నవి. అవి పాశ్చాత్యనాటకము, రంగస్థలములతో నేమాత్రము తీసిపోవని మనకు తెలియును. ఇందుకు భారతీయు డెంతయు గర్వింపవలసియున్నది. ప్రాచీనకాలముననే నాట్యశాస్త్రము భరతమహర్షిచే రచితమైనది. తల్లక్ష్య నాటకములు సంస్కృతమున కోకొల్లలు గలవు. భాస, కాళిదాస, భవభూత్యాదు లెందరో కవిపుంగవు లుత్తమ నాటకరచనచే ప్రపంచ ప్రఖ్యాతిని బొందిరి. ఇట్టి సంస్కృతభాషా సాహాయ్యమున అభివృద్ధిచెందిన ప్రాచీనాంధ్ర వాఙ్మయమున నాటకములు వెలయలేదు. మొదట సంస్కృత గ్రంథములే తెనుగున పరివర్తితములైనవి. అదే విధమున నాటకములను గూడ మన ప్రాచీన కవులు పరివర్తనము చేయలేదు. లేదా స్వతంత్ర నాటకముల నయినను రచించలేదు. పందొమ్మిదవ శతాబ్ద్యుత్తర భాగమువరకు తెలుగున నాటకరచన లేదు. అంతమాత్రముచేత ఆంధ్రులకు నాటకమన తెలియదనిగాని, ఆంధ్రదేశమున రంగస్థలముండియుండలేదనిగాని తలంచుట పొరపాటు; రంగస్థలముండిన దనుటకు తగిన యాధారములు గలవు. దేశి నాటకములైన యక్షగానము లనేకములు తెలుగున గలవు. ఇవి ఆంగ్లమునందలి 'Opera' ల వంటి వన వచ్చును. కాని యివి సంస్కృతాంగ్ల భాషలయందలి నాటకములవంటి నాటకములు మాత్రము కావు. అవి తెనుగునకు స్వతస్సిద్ధములైన రచనలు.

## ఆంగ్ల నాటక ప్రభావము

పందొమ్మిదవ శతాబ్ద్యుత్తర భాగమున తెలుగున ఆంధ్రులు నాటకములు రచియింపబూనిరి. అట్టి తెలుగు నాటక రచన, వికాసములు ఆంగ్లభాషా ప్రభావము వలననే కలిగిన వనుటలో సందేహము లేదు. వాఙ్మయాంతర సంపర్కమువలన నొక వాఙ్మయమున పరిణామము కలుగుట సహజము. ప్రపంచమంతట వ్యాపించి, ప్రఖ్యాతి పొందిన ఆంగ్లభాష భారతదేశమున గూడ రాజభాష యగుటచే, తదభ్యాసము సర్వజనులకు ఆవశ్యకమైనది. తత్సంపర్కమువలనను, ఆంగ్లవాఙ్మయమునందలి రసవన్నాటకము లనేకములు ప్రదర్శన మూలకముగా వ్యాప్తిజెందుటవలనను, మనవారుకూడ తెలుగున నాటకములు రచింప నారంభించిరి. "These dark days for Dramas continued up to the middle of the nineteenth century......... when English education spread itself through the length and breadth of India and the English knowing public saw the marvellous effects produced by the English stage and its wonderful scenic performances, the Indians opened their eyes and commenced to enquire what their ancient dramas were like......"[1]. ఆంగ్లేయుల పరిపాలన మన దేశమున వేరూనకమునుపు వ్యాపారార్థమై 'ఈస్టిండియా కంపెనీలు' నెలకొల్పబడెను. ఆ సమయమున ఆంగ్లేయులు, ఆంగ్ల వర్తకులు పాశ్చాత్య నాటకరంగమును భారతదేశమున ప్రవేశపెట్టిరి. మొదట వీరు భారతదేశమందలి మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరములలో సొంతముగా ఆంగ్లనాటకములను ప్రదర్శించుట కారం

1. 'The Dramatic History of the World' (P. 232)—కోలాచలం శ్రీనివాసరావు.

భించిరి. సామాన్యముగా భారతీయులలో ఆంగ్ల విద్యావంతులను, సంపన్నులను, జమీందారులను, రాజులను—ఆంగ్లనాటక ప్రదర్శనములకు ఆహ్వానించెడివారు. ఇట్టి భారతీయులు ఒకవైపు అత్యద్భుతమై మనోహరమైన ఆంగ్లనాటకరంగమువలన ఆకర్షింపబడి, మరొకవైపు ఆంగ్లేయులచేతకూడ అభినందింపబడిన సంస్కృతరూపకౌన్నత్యముచే భావావేశమును బొంది, భారతీయ నాటకరంగమును పునరుద్ధరింపవలెనని తలంచిరి 19 వ శ. న భారతదేశమునందలి ముఖ్యనగరములలో భారతీయులు ఆంగ్లనాటకములుగాని, సంస్కృతరూపకములుగాని, వాని అనువాదములుగాని ప్రదర్శించుట కారంభించిరి. ఆంగ్ల విద్యావంతులైన ఉన్నతాధికారులు, ప్రసిద్ధవ్యక్తులు వివిధపాత్రలు ధరించుచు నాటకరంగమున కన్పట్టుచుండిరి. ఇట్లు గొప్పవారందరు నాటకములందు నటింప నారంభించుటచే నటునకు సంఘమునగల న్యూనభావము తొలగిపోయి, గౌరవభావము కలుగ జొచ్చెను. 19 వ శ. వరకు వేషధారునియెడ అనాదర ముండెడిది. అతడెంత ప్రజ్ఞావంతుడుగాని, గండశిలలను గరగించు గానమాధుర్యముగలవాడుగాని, భావ ప్రకటనమున ప్రవీణుడుగాని సంఘమున గౌరవము లేకపోయెను; అతడు పంక్తిబాహ్యుడు. కనుకనే తక్కువ కులములవారు వీధినాటకములలోను, భాగవతములలోను, బొమ్మలాటలలోను పాల్గొనుచుండెడివారు. అట్టిది మారిపోయినది. ఆంగ్లవాఙ్మయము, పాశ్చాత్య నాగరకతల ప్రభావముచేత భారతదేశమునందు నాటకమునకు, నాటకరంగమునకు, నటునకు అత్యధికగౌరవోన్నతులు గలిగినవి. మన దేశమునందు పనిచేయుచుండిన ఆంగ్లభాషాచార్యులు కళాశాలలలో పాఠ్యపుస్తకములుగా నియమింపబడినవి, ఇతరములు—అయిన షేక్స్పియరు మున్నగువారి నాటకములను తమ విద్యార్థులచే ప్రదర్శింప జేయుచుండెడివారు. ఇందుకు కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి మాటలే నిదర్శనము. '...మాసుదొరగారు ప్రథమ శాస్త్రపరీక్షకు చదువు విద్యార్థులచే, నా సంవత్సరము (1887) పాఠ్యపుస్తకమైన 'వెనీసు వర్తకుడు' (Merchant of Venice) అను నింగ్లీషు నాటకము నాడించిరి[2]...' ఇట్లు కళాశాలలలో ఆంగ్లాధ్యాపకులు విద్యార్థులలోని నాట్యకళాప్రావీణ్యమును ప్రోత్సహించుచుండిరి. ఇట్టివానిని చూచిన యితరులు గూడ నాటకము లాడవలెననెడి ఉత్సాహపూరితులై తత్కార్యమునకు పూనుకొనిరి.

## పార్శీనాటకరంగ ప్రభావము

ప్రారంభదశలో ఆంగ్లనాటకరంగముచే తెలుగు నాటకరంగము ప్రత్యక్షముగా ప్రభావితము కాలేదు. మొదట ఇంగ్లీషు నాటకరంగ ప్రభావము పార్శీ, మహారాష్ట్ర నాటకరంగములపై బడినది. వాని ద్వారమున మన ఆంధ్రనాటకరంగము ప్రభావితమైనది. కనుక తెలుగుపై ఆంగ్లనాటక ప్రభావము పరోక్షమైనది 19 వ శ. న పార్శీ, మహారాష్ట్ర నాటక సమాజములు ఆంధ్ర కర్ణాటకదేశములందు ప్రయాణించి ప్రదర్శన లిచ్చినవి. '...The ever enterprising Parsees, the pleasure seeking Mahamedans, and the talented Maharastras have commenced performances in their own vernaculars.........They have borrowed from the English Stage all that they can conveniently and usefully borrow. Others have followed their example.'[3] పార్శీనాటక సమాజముల ప్రభావము మొదట మహారాష్ట్ర నాటక సమాజములపై ప్రసరించెను. ఈ సమాజములు తరువాత కర్ణాటదేశమున ప్రదర్శన లిచ్చుచు ప్రయాణించుటచే కన్నడ నాటకరంగము ప్రభావితమైనది. తరువాత ఆంధ్రదేశమున వీని ప్రభావ మధికముగా కన్పట్టును. 'సాంగ్లీ' ఆల్టేకరు మున్నగు మహారాష్ట్ర నాటక కంపెనీల నాటక రచనకు 'యక్షగానమే' ఆదర్శప్రాయము. విష్ణుదాస్‌భావే అను ప్రథమ మహారాష్ట్ర నాటక కర్త, సాంగ్లీ మహారాజు ఆదేశానుసారము యక్షగాన పద్ధతిలో, 1848 లో 'సీతా స్వయంవర'మను నాటకమును రచించెను. 'Even in the details of

2. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి చరిత్ర—పుట—60.

3. 'The Dramatic History of the World'—(P. 232, 233)—కోలాచలం శ్రీనివాసరావు.

production, the Bhave performances closely resembled the present Yakshagana' (The Indian Theatre by shari R. K. Yaznick. P. 93.) తరువాత మహారాష్ట్ర నాటక కంపెనీలపై పార్శీ నాటక కంపెనీల ప్రభావము పడెను. ఆల్తేకరు నాటక కంపెనీ దేశ సంచారమునకై బయలుదేరి, మున్ముందు కర్ణాటక ప్రాంతమున నాటకములు ప్రదర్శించెను. అటనుండి వారు 'ధార్వాడు' అను నగరమునుండి బయలుదేరి, 1880 ప్రాంతములలో మన దేశమునకు వచ్చిరి. వారినే మనవారు 'ధార్వాడు నాటక కంపెనీ'వారు అనిరి. నిజమునకు ఆ నాటక కంపెనీ ధార్వాడునకు చెందినదిగాదు. కర్ణాటకులది అసలే కాదు.'[4] మహారాష్ట్ర నాటకరంగమువలన కర్ణాటక నాటకరంగము గూడ ప్రభావితమైనదను విషయము వ్యక్తమైనది. ఈ క్రింది మాటలవలనను ఇది ధృవపడుచున్నది 'నాట్యకళాభిమానులు, నటకులు కలసి కన్నడ నాటకరంగ శతవార్షికోత్సవాన్ని చాల ఉత్సాహంతో ఆడంబరంగా 1948 లో జరుపుకొన్నారు.' '...శ్రీ గుబ్బిచెన్న బసవేశ్వర కృపాపోషిత నాటకసంఘం' అను సంస్థ కర్ణాటక నాట్యకళా చరిత్రలో మైలురాయి. ఈ సమాజం వజ్రోత్సవము జరుపుకొనుటేకాక నేటికిన్నీ చైతన్యం కలిగివుంది... భారతదేశం మొత్తంమీద వారి ప్రథమ నాటకం 'కుమారరామ' 29–11–1884 తేదీన గుబ్బి గ్రామంలో ప్రదర్శింపబడినది.'[5] ఇదే విధముగా బళ్ళారిలో మరాఠీ, హిందీ నాటకములతోపాటు కన్నడ భాషా నాటకములు గూడ . ప్రదర్శింపబడుచుండినవి. అప్పుడు నాటకోచితభాష కన్నడమే యనియు, అందుకు తెనుగుభాష ఉపయోగపడదనియు కొంతమంది చెప్పగా విన్న ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు అట్టి అపోహను పోగొట్టుటకై తెనుగున 'చిత్రనళీయ నాటకము'ను రచించి 1886 లో ప్రదర్శించి 'ఆంధ్రనాటక పితామహు'డన్న బిరుదముచే వహించిరి. కాని ఆనాడు కన్నడ నాటకమునకున్న ప్రాధాన్యము, ప్రజాదరణమును గుర్తించిన ధర్మవరంవారు, కన్నడముననే మొదట నాటకమును రచించిరి. 'నా కా కన్నడమునందును నొక్కింత పరిచయ మున్నందున వారి మతము చొప్పునఁ బోవలసి వచ్చి మొట్టమొదట స్వప్నానిరుద్ధమనుపేర ఉషా కల్యాణ చరిత్రమును గన్నడభాష నాటకముగా నొనరించితి...'.[6] 19 వ శ. చివరి దశకములలో పూనా, ధార్వాడలనుండివచ్చిన సంచార నాటక సమాజములతోపాటు బాలగంధర్వ, ప్రౌఢగంధర్వ మున్నగు మరికొన్ని నాటక సమాజములును ఆంధ్రదేశమునకు వచ్చి ప్రదర్శన లిచ్చినవి. ఇట్టివి ఆంధ్రదేశమునందలి ప్రజలలో ఆంధ్రనాటక పునరుజ్జీవనమున కభిరుచి కలిగించినవి. కోలాచలం శ్రీనివాసరావుగారు పౌరాణిక చారిత్రక నాటకములు స్వతంత్రముగా రచించి యుండినప్పటికి మహారాష్ట్ర నాటకములచే ప్రభావితులై వానిని తెనుగులోనికి పరివర్తనము గావించిరి. 'ఇటీవల బళ్ళారి పురంబునకువచ్చిన పూనా కంపెనీలు రెంటిలో 'కేశవగంధర్వ కంపెనీ'వారు 'రాక్షసీ మహత్వాకాంక్ష'—యను గంభీరనాటకము (Tragedy) నాడి ప్రేక్షకులను మెప్పించిరి......మరియొక 'బాలగంధర్వ' యను కంపెనీవారు 'మానాపమాన' మనెడి నాటకమాడి జనులను హర్షింపజేసిరి......పిదప మహారాష్ట్రభాష నొక నెల దినములు తగినంతవఱకు .నభ్యసించి ప్రారంభమున 'రాక్షసీమహత్వాకాంక్ష' యను నాటకము నాంధ్రీకరించితిని...అయినను దైవానుగ్రహమువల్లఁ బట్టిన పట్టువదలక యథాశక్తి న్యాయముగ (మానాపమాన నాటకము) నాంధ్రీకరించితిని...'[7]. 1880 లోనే 'ధార్వాడ నాటక కంపెనీ' ఆంధ్రదేశమంతట సంచారము గావించి నాటక ప్రదర్శన లిచ్చినది ప్రభావముచేతనే కందుకూరి వీరేశలింగం పంతులుగారు గూడ నాటకముల రచింప నారంభించి ప్రదర్శించిరి. '1880 వ సం. నందు ధార్వాడ నాటక సమాజము

---

4. 'నాదెళ్లవారి హిందీ నాటకములు'— భీమసేన్ నిర్మల్‌గారు – నాట్యకళ—ఏప్రిల్ 1967— పుటలు 15, 16.

5. కర్ణాటక రంగస్థలం'—సి. కె. నాగరాజా రావుగారు నాట్యకళ — సెప్టెంబర్ 1966— పు 17, 18.

6. ధర్మవరం రామకృష్ణమాచార్యులగారి 'చిత్రనళీయ' నాటక పీఠిక.

7. కోలాచలం శ్రీనివాసరావుగారి 'మానాపమాన నాటక' పీఠిక.

వారు (మా రాజమండ్రి) పట్టణమునకువచ్చి గొప్ప పాకవేసి దానిలో తమ నాటకముల నాడిపోయిన తరువాత పాకతీసివేయకముందే యా నాటకశాలలో నాడింపవలెనన్న కుతూహలముతో శ్రీ హర్షదేవ విరచితమైన రత్నావళీనాటికను సంస్కృతమునుండి పద్యగద్యములతోను, ఇంగ్లీషు కవులలో నగ్రగణ్యుడుగా పరిగణింపబడెడు షేక్స్పియరు మహాకవి విరచితమైన 'కామెడీ ఆఫ్ ఎర్రర్సు' నాటకము నింగ్లీషునుండి గద్యాత్మకముగాను, అత్యంత శీఘ్రకాలములో తెలిగించి యీ రెంటిని తన్నాటకశాలలో జయప్రదముగా ప్రదర్శింపించితిని...'. అంతకుముందే (1880 లోనే) శ్రీ విజయనగరము బాలికా పాఠశాలలో వారి విద్యార్థులు కొందరు వారి 'వ్యవహారధర్మబోధిని' నాటకమును ప్రయోగించి యుండిరి. ధార్వాడ నాటక సమాజమునకు జెందిన 'వామనభట్టు జోషి' అనునతడు 1885 లో ఏలూరులో 'ఏలూరు కంపెనీ' అను పేరితో నాటక సమాజమును నెలకొల్పెను. 'ఆ సమాజమునకు నాయకుడైన వామనభట్టుజోషికిని, దక్కిన సభ్యులకును మనస్పర్థలు గలిగినందున, నేలూరు పట్టణమున నతడు తన సమాజమునుండి విడిపోయి, సమాజముమీద కోపము చేత మరియొక సమాజము దానికి పోటీగా లేవదీయ దలచి, మన యాంధ్ర యువకుల కొందరను జేర్చుకొని, యొక నాటక సమాజమును లేవదీసెను. దానికే యేలూరు కంపెనీ యనిపేరు. ధారవాడ నాటక సమాజము వారివలెనే వీరును హిందీలో నాటకము లాడెడివారు...'[9]. తొలుత ఆంధ్రదేశమున గూడ హిందీ నాటకములు రచింపబడి ప్రదర్శింపబడిన వనుటకు మరొక నిదర్శనము గలదు. నాదెళ్ల పురుషోత్తమ్ పేర్కొనదగినవారు. 'ధార్వాడ నాటకములను అనుకరిస్తూ నాటక ప్రదర్శనములకై అనేక నాటక సమాజములు వెలసినవి. వానితోపాటు హిందీ నాటకములు ప్రదర్శింపవలెనను ఉద్దేశ్యముతో బందరులోను, మరికొన్ని పట్టణములలోను నాటక సమాజము లేర్పడినవి...' 'రేపల్లె బోర్డు లోయర్ సెకండరీ స్కూలులో అధ్యాపకులుగానున్న శ్రీ పురుషోత్తములను వారు హిందీ నాటక రచనకై ప్రోత్సహించిరి.'[10] వీరు ముప్పది రెండు హిందీ నాటకములు, పది తెలుగు నాటకములు రచించిరి. పూనా నాటక సమాజము 1885 లో మరల ఆంధ్రదేశమంతట సంచారముచేసి అనేక నాటక ప్రదర్శన లిచ్చినది. అటు తరువాత ఆంధ్రదేశమున తెలుగున సంస్కృతాంగ్ల పరివర్తనములు, స్వతంత్ర నాటకములు వెలసినవి; ప్రదర్శనలు ఆరంభమైనవి.

## తెలుగున నాటక రచన, ప్రదర్శనములు

1860 లోనే కోరాడ రామచంద్రశాస్త్రిగారు 'మంజరీమధుకరీయ'మను నాటకమును రచించినను అది ప్రఖ్యాతికి రాలేదు. 1880 లోనే కందుకూరి వీరేశలింగం పంతులుగారు 'రత్నావళి' (సంస్కృత రత్నావళి), చమత్కార రత్నావళి (కామెడీ ఆఫ్ ఎర్రర్స్)—అను రెండు అనువాద నాటకములను ప్రదర్శించిరి. అయినను ఆంధ్రదేశమున బళ్లారిలో మొట్టమొదటి నాటక సమాజమును నెలకొల్పిన ఘనత ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారికి దక్కినది. దానిపేరు 'సరసవినోదినిసభ'. వీరు న్యాయవాదవృత్తి నవలంబించినను నటన, కవిత్వములందు ప్రావీణ్యము గలిగియుండిరి. వీరి 'చిత్రనళీయ' నాటకముతో తెలుగున 1886 లో స్వతంత్రనాటకరచన, ప్రదర్శన—ఆరంభమైనవి. వీరు ప్రథమ స్వతంత్రాంధ్ర నాటకకర్తలు. వీరు ఇరువదెనిమిది నాటకములు రచించి, ప్రదర్శించి కీర్తిని గడించిరి. వీరికి 'ఆంధ్ర నాటక పితామహు'డను బిరుదము గలదు. వీ రనేక పర్యాయములు తమ సమాజమును మద్రాసుకు తీసికొనిపోయి ప్రదర్శన లిచ్చి, అక్కడివారిలో గూడ నాటక ప్రదర్శనపై నభిలాష కలిగించిరి. ఆంధ్ర నాటకరంగమునకు వీరితో నేమాత్రము తీసిపోని సేవ చేసినవారు కోలాచలం శ్రీనివాసరావుగారు. వీరు ధర్మవరంవారికంటె కొన్నినెలలు మాత్రమే చిన్నవారు. వీరును న్యాయవాదవృత్తి నవలంబించినవారే! వృత్తి లోనేగాక నాటకరచన, ప్రదర్శనలలోను వీరు ధర్మ

8. కందుకూరి వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్ర—ద్వితీయ భాగము—పుట 178.

9. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి స్వీయచరిత్ర—పుట 66.

10. 'నాదెళ్లవారి హిందీ నాటకములు'—భీమసేన్ నిర్మల్‌గారు—నాట్యకళ—ఏప్రిల్ 1967—పుట. 161.

వరంవారికి పోటీగా నిలిచిరి. పౌరాణికములతోపాటు చారిత్రక నాటకము లనేకము రచించిరి వీరును మొత్తము ఇరువదెనిమిది నాటకములు రచించి 'ఆంధ్ర చరిత్ర నాటక పితామహు'డను బిరుదముచే ఖ్యాతి వహించిరి. వీరి నాటక సమాజపు పేరు 'సుమనోరమ సభ'. ఆ సభవారు వీరి నాటకములను ప్రదర్శించెడివారు. వీరు 'ప్రపంచ నాటక చరిత్ర' (The Dramatic History of the World) అను ఉద్గ్రంథము నాంగ్లమున రచించిరి వీరు 'వాణీవిలాస నాటకశాల'ను నెలకొల్పిరి. పార్శీనాటక ప్రదర్శనలచే ప్రభావితులైన ఇమానేని హనుమంతరావుగారు 1885 లో ఒంగోలులో హిందీ, ఉర్దూ నాటకము లాడుట కారంభించిరి. వారి నాటకరచయిత ఉండవల్లి సాహేబుగారు. 1889 లో ఇమానేని హనుమంతరావు గారు రాజమండ్రిలో 'హిందూ నాటక సమాజము'ను స్థాపించిరి. వారికి చిలకమర్తివారు నాటకములు వ్రాసియిచ్చెడివారు. ఈ సమయముననే గుంటూరు 'హిందూసమాజము', విశాఖపట్టణము 'జగన్మిత్ర నాటక సమాజము' వెలసినవి. తరువాత బందరు 'హిందూ థియేటరు', కడప 'సురభి కంపెనీ', నెల్లూరు 'ఆంధ్రాభిమాన సమాజము', పిఠాపురము 'హిందూ థియేట్రికల్ కంపెనీ', నరసాపురం 'ఆర్యానంద హిందూనాటక సమాజము', నరసారావుపేట 'విక్టోరియా మెమోరియల్ థియేట్రికల్ కంపెనీ' మొదలైనవి పేర్కొనదగినవి. వీనిలో కొన్ని 'రాజా'ల అధికారములో నుండినవి. 1891 లో మద్రాసులో 'సుగుణవిలాససభ' స్థాపింపబడినది పై సమాజముల వారు సంస్కృతాంగ్లనాటక పరివర్తనములుగాని, స్వతంత్ర నాటకములుగాని ప్రదర్శించెడివారు. వారి నాటకము లన్నింటను పాశ్చాత్య నాటకయుక్తులు విపరీతముగా నుండెడివి. ఆ ప్రదర్శనములందు ఆంగ్లేయులయు, పార్శీలయు నాటకరంగ ప్రభావ మధికము. చమ్కీదుస్తులు, గాజుదీపములు, నాజూకురంగులు, అలంకారములు, ప్రక్కతెరలు, పైతెరలు—ఆంధ్ర నాటకరంగమున ప్రత్యక్షమైనవి. ఆ మనోహర ప్రదర్శనలు ప్రజాళి నాకర్షించుచుండెను. పార్శీ నాటకములలోని పాటల పద్ధతిని తెలుగు నాటకములలో తెలుగువా రనుసరించిరి. తెలుగున స్వతంత్ర నాటకమును మొదట రచించిన ధర్మవరం వారే ఇట్టిపాటల పద్ధతిని ప్రవేశపెట్టుటలో ఆద్యులు. అనుసరించినవారు కోలాచలంవారు. తరువాత అనేకులనుకరించిరి. దక్షిణ దేశమునందలి ఆధునిక నాటకరంగము నారంభించినవారు ఆంధ్రులే అను విషయము గుర్తింపదగినది.

## పరిణామము

మొదట పురుషులే, స్త్రీ పాత్రలు గూడ ధరించెడివారు. కాని సురభి నాటక సమాజమువారు మనదేశమునకు వచ్చినప్పుడు వారి ప్రదర్శనలలో స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించెడివారు. దాని ననుసరించి ఆంధ్ర నాటకరంగమునగూడ స్త్రీ పాత్రలు స్త్రీలే ధరింప నారంభించిరి మన దేశముననేగాక అంతర్జాతీయముగా గొప్ప షేక్స్పియరు నాటక పాత్రధారిగా ప్రసిద్ధిని గాంచిన 'బళ్ళారి రాఘవ' ఆంధ్ర దేశమున నాట్యకళకు అధికమైన సేవ గావించిరి. వీరు 'సుమనోరమసభ సమాజమున నత్యుత్తమమైన ప్రధానమైన నటులు. Dr. Arundale గారు శ్రీ రాఘవను 'Sir Beerbohmtree' తో పోల్చుచు ఎంతగానో అభినందించిరి. ఆంధ్రదేశమునందలి షేక్స్పియరు నాటకపాత్రధారులలో చంగారెడ్డి, వేంకటరత్నం, దాసుమాధవరావు మున్నగువారు పేర్కొనదగినవారు. టంగుటూరి ప్రకాశం పంతులు గారుగూడ ఉత్తమ నటకులు. స్త్రీ పాత్రలు ధరించి అసమాన నటనా చాతుర్యమును ప్రకటించి యశము నార్జించిన 'స్థానం'వారు చెప్పదగినవారు. 20 వ శ. ప్రారంభములో జనులలో జాతీయ భావములు నెలకొన్న వెంటనే ఆంధ్ర నాటక రంగముగూడ శరవేగముతో ప్రగతి చెందినది. ఆంధ్ర నాటక రంగమున 1929 లో నెలకొల్పబడిన ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఒక మైలురాయి. తరువాత అనేక విధములైన నాటకములు, నాటికలు రచింపబడి, వివిధ పద్ధతులతో ప్రదర్శింపబడి ఆంధ్ర నాటకరంగము సుసంపన్నమైనది.

ఇట్లు ప్రాచీనాంధ్ర వాఙ్మయమున లేని నాటకములు 19 వ. శతాబ్ద్యుత్తర భాగమున రచింపబడి ఆంధ్ర వాఙ్మయమునకు సంపూర్ణత్వమును ప్రసాదించినవి. ఇదంతయు పాశ్చాత్యులయు, పార్శీలయు నాటక ప్రభావముచేతనే కలిగినదని మనకు

విదితమైనది. అట్టి మన ఆంధ్ర నాటకము, రంగ స్థలము ఆధునిక యుగమున విశిష్టమై యలరారు టయేకాక తదితరములైన వానితో సమానమైన ప్రతిపత్తిని సాధింపగల్గినవి.

### ఈ వ్యాస రచన కుపకరించిన గ్రంథములు, వ్యాసములు


1. Influence of English on Telugu Literature (Unpublished).—by Prof. G. N. Reddy, M A., M. Litt; Ph. D,

2. The Dramatic History of the World–by Kolachalam Srinivasa Rao.

3. 'తెలుగు వాఙ్మయము—సంగ్రహ చరిత్ర'— తెలుగు నాటకాలు—శ్రీ కూరా్మ వేణుగోపాలస్వామిగారు.

4. ఆంధ్ర నాటక సమీక్ష — శ్రీ శ్రీనివాస చక్రవర్తి గారు.

5. కందుకూరి వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్ర.

6. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి స్వీయ చరిత్ర.

7. ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి 'చిత్ర నళీయ నాటక' పీఠిక.

8. కోలాచలం శ్రీనివాసరావుగారి 'మానాప మాన' నాటక పీఠిక.

9. నాట్యకళ పత్రికలు—సెప్టెంబరు 1966, ఏప్రిల్ 1967.




# బసవరాజు "ఎలిజీ"లు

శ్రీ జి. రామమోహనరావు

ప్రాచీన గ్రీకు సాహిత్యంలో 'ఎలిజీ'కి ఒక ప్రత్యేక స్థానం ఉంది. కవులు 'ఎలిజీ' రూపంలో ప్రేమ, వీర, రాజకీయ విషాదగీతికలు వ్రాశేవారు. ఈ 'ఎలిజీ', తరువాత ఆంగ్ల సాహిత్యానికి ప్రాకింది. 'ఎలిజీ'లో భాష అప్రధానం, భావం ప్రధానం. వర్ణన అనవసరం, విషయం అవసరం. చెప్పే విషయం సూటిగా చెప్పాలి. డొంక తిరుగుడుమార్గం పనికి రాదు. ఒక్కసారిగా ఊహాలోకానికి ఎగిరిపోయి క్రొత్త లోకం సృష్టించాలన్న కుతూహలం ఉండదు. మనస్సున హత్తుకొన్న భావాన్ని సుకుమారంగా తేలికగా వివరించాలి. ఇవి తరువాత 'ఎలిజీ'కి ప్రత్యేక లక్షణాలుగా మిగిలిపోయాయి సాహిత్యంలో. ఆంగ్ల కవుల రచనల్లోను తెలుగు భావకవుల రచనల్లోను సామాన్యంగా కాన్పించాయి ఈ లక్షణాలు దాదాపుగా. 

'ఎలిజీ'ని తాపీధర్మారావుగారు 'కారుణ్యము'ని అన్నారు. సి. నారాయణరెడ్డిగారు 'స్మృతిగీత'మని పేరు పెట్టారు. ఇది కేవలం ఒక గీతంలో మాత్రమే ఉండేదికాదు. ఒక గీతంలోనైనా, కావ్యంలో ఉన్నా అది 'ఎలిజి' అనవలసిందే. ఆంగ్లంలో ఉన్న 'ఎలిజి' అన్న పదానికి నారాయణరెడ్డిగారి నామకరణం సరిపోయినట్లుగా ఉంది. అందుచేత వారి నామకరణాన్ని యథాతథంగా గ్రహిస్తున్నాను.

సాహిత్య విమర్శకులు 'ఎలిజీ'నిగూర్చి చాల రకాలుగా నిర్వచనాలు చెప్పారు. ఆ నిర్వచనాలన్ని గుదిగ్రుచ్చి అందించటం మంచిది కాదేమో. కాని ఒక్కటి మాత్రం వివరిస్తాను. దీనినిబట్టే ఇతరులయొక్క నిర్వచనాలుకూడా దగ్గరగా ఉన్నాయి. అందుచేత దానినే ప్రధానంగా స్వీకరించి అందిస్తున్నాను.

,Sometimes death is the inspiration and sole theme; at other times it is merely the common starting point from which poets have launched various themes, specu-lations on the nature of death and the hereafter, tributes to friends, the poets own mood, even literary criticism (The Study of poetry written by A.R. Entwistle.)

ఈ లక్షణాలను, ఆంగ్ల కవులను, తెలుగుభావకవులు భేదం లేకుండా అనుకరించారు. విషాదగీతులుగా వ్రాయటమే ధ్యేయంకాదు. ఆత్మగతమైన బాధను వ్యక్తీకరించటం 'స్మృతి' గీతానికి సంబంధించిందే. ఆంగ్ల సాహిత్యంలో ప్రసిద్ధులైనవారు 'ఎలిజీ'లు వ్రాశారు. థామస్ గ్రే వ్రాసిన 'A country church yard' టెన్నిసన్ 'In Memoriam' మిల్టన్ 'Lycidas' ఆర్నాల్డు 'Rugby chapel' షెల్లీ 'Adonais' ఇవన్నీ ఎలిజీ కావ్యములే. ఈ 'ఎలిజీ' రచన బాగా ప్రచారం పొందిన తరువాత 'పేష్టోరల్ ఎలిజీ' అని మరొక అంతర్భాగం అవతరించింది. ఆ 'ఎలిజీ'లలో ఆర్నాల్డు 'Thyrsis' మిల్టన్ 'Lycidas' స్పెన్సర్ 'Astrophel' ప్రసిద్ధ రచనలు.

కాల్పనికోద్యమం బయలుదేరిన తరువాత సాహిత్యం నూతనదృక్పథంతో ముందుకు నడిచింది. భావకవులకు ఒక ఊహాసామ్రాజ్యం అంటూ ఏర్పడింది. అయితే కేవలం భావనాలోకంలో విహంగంలా విహరించటం కాదు. ఒక నూతన ప్రక్రియ సాహిత్యంలో వెల్వడటానికి కాల్పనికోద్యమం కారణమైంది. 'ఎలిజీ' సృష్టికూడ దానియొక్క ప్రభావమే. తెలుగువారు ఆంగ్ల మానసపుత్రులైన తరువాత ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులో క్రొత్త కవిత్వం బయలుదేరింది. ఆ కవిత్వమే భావకవిత్వం. ఆంగ్ల సాహిత్యంలో కాల్పనిక రచనల ప్రభావంతో తెలుగులోకూడ అట్టి రీతులు ప్రవేశపెట్టారు. ఈ 'ఎలిజీ'కూడా ఆంగ్ల సాహిత్య సంపర్కంతో తెలుగు భావకవిత్వంలో వెలిసింది. క్రొత్త పుంతలు త్రొక్కింది. క్రొత్త

రూపులు దిద్దుకొంది. అన్నిటికి అనువుగా భాషలో విప్లవాత్మకమైన మార్పు వచ్చింది. మనసులు ఊసు లాడుకొనే భాషలో అవతరించింది. గుండెలు దూసు కొంటూవచ్చింది. హృదయాన్ని ముక్కలుచేసి పుట్టు కొచ్చింది. 'ఎలిజీ'అంటే సామాన్యంకాదు మానవ హృదయ సంఘర్షణనుండి అమాంతంగా ఆవిర్భ వించింది.

భావకవుల రచనల్లో అచ్చటచ్చట 'ఎలిజీ'లు ఉన్నాయి. ఇంతమంది రచనల్లోకంటె బసవరాజు 'ఎలిజీ'లు గొప్పవి. భావం అరటిపండు వలిచి చేతి కందించినట్లుంటుంది. భాష ఏ పాప మెరుగని బాల వాక్కుల్లా ఉంటుంది. రచన సెలయేరులా ముందుకు పరుగులు పెడుతుంది. అంతేగాక అప్పారావుగారి 'స్మృతి'గీతాలకు ఒక ప్రత్యేక స్థానం ఏర్పడింది. అవి హృదయాన్ని కదిలించి కన్నీరు పెట్టించేవి. గుండెను చీల్చుకొని ముందుకొచ్చేవి ఆ కారణంచేతనే అందరిని బాగా ఆకర్షిస్తాయి.

బసవరాజు 'ఎలిజీ'లను మూడు రకాలుగా చెప్ప వచ్చు. ఒకటి బిడ్డల స్మృతి. రెండవది ఆప్తుల స్మృతి. మూడవది మిత్రస్మృతి. ఈ మూడు రకాల స్మృతిగీతాల్లో బసవరాజు హృదయం ద్రవించింది. అంతులేని దుఃఖం ఊహింపరాని వ్యధ భావింపరాని బాధ తాండవించాయి. ఆయన వ్రాసిన ఇతర గీతాలు వేరు. స్మృతిగీతాలు వేరు. స్మృతి గీతాల్లో హృదయవీణ పలుకుతుంది. పాటలుపాడి బాధ నంది స్తుంది. ఆయనలో బాధ, వ్యధ పడుగు పేకలా అల్లుకుపోయాయి. జీవితంలో కొన్నాళ్ళు వెన్నెల సోనలు కొన్నాళ్ళు చీకటి కోణాలు, సుఖాలు దుఃఖాలు ప్రాప్తించి తనను బాధాసంజనితప్రపంచానికి పట్టు కొని తీశికొని వెళ్ళాయి. అవి వదలి రాలేకపోయారు. వదలి వద్దామంటే పట్టును విడిపించుకోవటం సాధ్యంగాకపోయింది. ఏమైనా ఆయన స్మృతి గీతాలు ఒక చిత్రకారుడు చిత్రించి ఇచ్చిన చిత్రాలలా మనముందు నిలబడతాయి. ఆ మూర్తి సాక్షాత్కా రమే ఆయన 'ఎలిజీ'లలో ఉండే ఘనత.

### బిడ్డల స్మృతి

బసవరాజుకు 1921 సంవత్సరం డిశంబరులో మొదటగా పుత్రిక పుట్టింది. పేరు మంగళప్రద. ముద్దుముచ్చటలు ఆ రూపంలో కలసిపోతూ ఉండేవి. మంగళప్రద జన్మం వసంతంలా విరి సింది. చిత్రజల్లులా కురిసింది. ఆశలు మొగ్గలు తొడిగాయి. మొగ్గలు విరులుగా వికసింపకుండనే జీవి తంలో తీరని సంఘటన సంభవించింది. కలలో ఊహింపని సంఘర్షణ బయలుదేరింది. సుఖం తరువాత దుఃఖం, ఆనందం పిదప విషాదం. నిండించుకొన్న మంగళప్రద మరణించింది. మరణం బసవరాజు హృదయాన్ని బ్రద్దలు చేసింది. నిర్మించు కొన్న సౌధాలు కూలిపోయాయి. పట్టరాని ఆనందం సడుతుండగనే దుఃఖం తరుముకొచ్చింది. ఆ మంగళ ప్రద మరణాన్ని గూర్చి దోపిడి, కడుపుతీపి, చలి పిడుగు, నిర్యాణ సుఖము మొదలైన గీతాల్ని వ్రాశారు.

బంగారు పండంటి
పసిబాల కలిగె
పెట్టి యెవరిని యేమి
తిట్టుకున్నామొ ?
ఇచ్చిన దైవమా
మర్చిపోడాయె.

జీవితంలో ఎన్ని పుణ్యాలు చేసికొంటే ఆ పండంటి బంగారం కలిగింది. బంగారం కలిగిందిగదా సింగారించుకొనేసరికి మాయమయ్యింది. ఆ మాయ ఎవరికీ తెలియదు. తెలిసినా ఎవరూ ఏమీ చేయ లేరు. పాపం భగవంతుడు కత్తిపెట్టి పొడిచి గాయం చేశాడు. నిజంగా నిలవునా బసవరాజు యిల్లు దోచాడు. ఆ నిలువు దోపిడీలో వెలలేని మణిని మరీ కాజేసికొని ఎవ్వరికి కనబడకుండా వెళ్లిపోయాడు. ఆ విధంగా వెళ్లినవానినిగూర్చి చెప్తూతూ

అమృతపాత్రము దొంగిలించావ్ దేవా
అందులో విషము తాగించావ్ దేవా

ఆ దేవు డెన్నిబాధలు పెట్టినా పెట్టవచ్చుకాని ఎంతో కుతూహలంలో ప్రసాదించిన అమృత పాత్రలో విషంపోసి నోటి కందించటమా. ఇంత అధర్మం తను చూడలేదు. అందుచేతనే ఆ భగవంతు డిని ఒక దొంగలా చిత్రించారు. అమృత భాండంలో విషం కలిపి ఇచ్చాడు. ఇది మహానేరం. ఈ నేరానికి కారకులు శిక్షను పొందకుండా, ఈ

నేరము ఈ శిక్ష నీవే యనుభవించమని బసవరాజును కత్తి పెట్టి పొడిచాడు. ఆ తీరనిగాయంతో దుఃఖం చెలియలికట్టను త్రెంచుకొంటుంది. ఒక ప్రక్క హృదయం ముక్కలైపోతోంది. మరొకప్రక్క కట్టుకున్న గూడులన్నీ కూలిపోతున్నాయి. ఆ కూలిన కుటీరం దగ్గరకు 'కోయి లొకసారొచ్చి కూసి పోయింది. కూయబోకన్నా కూయకుండా మానలేదు.'

చిట్టిని జ్ఞాపకం
చేయబోకే
చింతతో ప్రాణాలు
తీయబోకే

అని వేడుకొన్నా ఆగక తీయనిరాగాలు తీసి తీపితో మనసు కోసేసింది. మానవజీవి బాధ దానికేం తెలుసు. గున్నమామిళ్ల గుంపులో చేరి గుసగుసలు పల్కేదానికి మంగళప్రద మరణం ఏం తెలుసు. లే చివుళ్ల మెసవి వసంతగానం చేసేదానికి బసవరాజు బాధ దానికెలా తెలుస్తుంది. దానికేమీ తెలియదని చెప్పుకోలేక చెప్పుకొని వాపోయారు. మరణించిన "మంగళప్రదను తీసికొనివెళ్లినతరువాత పెద్దపెద్ద ఉరుములతో కుండపోతగా వర్షం పడుతూనే ఉన్నది. మధ్యమధ్య పిడుగులుపడి బ్రహ్మాండం బ్రద్దలవుతున్నదా అనిపిస్తున్నది. మంగళప్రద ఉలిక్కిపడిలేచి ఏడుస్తుందేమో నన్న కంగారు" (అప్పారావుగారు—నేను—పేజి 115) ఆ దృశ్యాన్ని చిత్రిస్తూ

బంగారుబొమ్మ నాదు
మంగళప్రదమ్మ యొంటి
రుద్రభూమి కటికనేల
నిద్రించెడు నొడలు మరచి
చూపబోకు మచట నీ
ప్రతాపమెల్ల పిడుగా నా
కన్నతల్లి యడలి లేచి
కక్కటిల్లి ఏడ్వగలదు

అని వాపోయారు బసవరాజు. ఇది ఒక విషాద దృశ్యాన్ని సృష్టించిన ఎలిజి. శ్మశాన వాటికలో నిర్జీవంగా మట్టిలో మాయమైపోతున్న చిన్ని పాపాయిపైన వెల్లిమమకారం అపూర్వమైంది. మరపురానిది. అన్నింటికన్న ఆ రుద్రభూమిలో వారి చేతుల్లోఉన్న మంగళప్రద రూప సాక్షాత్కారం. నిజంగా మంగళప్రద మరణించలా, ఉయ్యాలలో వడలు మరచి హాయిగా నిద్రపోతున్న చిన్నారిబాలలా అనిపిస్తుంది బసవరాజుకు. తన హృదయం ఎంత మెత్తనిదో 'ఎలిజి'లో ఉపయోగించిన పదాలుకూడ అంత మెత్తగా ఉన్నాయి. తన హృదయం ఎంత మెత్తనిదైనా కరకుగుండెయై కత్తి పెట్టి పొడుస్తావా అని ధైర్యంగా అనగలరు. కాని నమ్మారు ఆ సర్వంతర్యామిని; నమ్మినవారినే మోసం చేసి కన్నీరు పెట్టించాడు భగవంతుడు. అంతచేసినా భగవంతుని బసవరాజు

'రుద్రభూమి నేకాకిగ
నిద్రించెడు మమ్మగన్న
మంగళప్రదను నిద్రా
భంగ మొదవకుండ గాచి
కరుణామృతధారల నా
కలిదప్పుల బాధ తీర్చి
చల్లనైన జోలపాట పాడి
మెల్లమెల్ల జోకొట్టుమ
ఈ సాయము జేయుము నే
ఋణము తీర్చికొందునయ్య
ఈ జన్మము గాకున్నను
నింకొక జన్మమునన్నైన'

యని దీనాతిదీనంగా మంగళప్రదకు నిద్రాభంగం కానీయకుండా జోలపాట పాడితే మరో జన్మంలో ఆ ఋణం తీర్చుకుంటారట.అమాయకమైన కోరిక అమాయకమైన హృదయరాజాన్ని గూర్చి. పసికందు ఎడబాటు సహించలేక ఓర్చుకోలేక గుండె రాయి చేసికోలేక భగవంతునిముందు చేతులు కట్టుకొని నిలబడి ఒక్క సాయము చేయుము దేవా యుగయుగాలుగా తరతరాలుగా నీవు చేసిన మేలు మరవకుండ మరొక విధంగా దానికి ప్రతిగా చేస్తానని కోరుకొంటున్నారు. ఎన్ని ప్రార్థనలు చేసినా తన మొర ఆలించే నాథు డెవరు కాన్పించలేదు. కడసారిగా ఆ చల్లని పిడుగును ఉద్దేశించి

......................నా
కన్నతల్లి యడలి లేచి
కక్కటిల్లి ఏడ్వగలదు

ఎంతైనా తాను కన్నతండ్రి కడుపుమంట ఆరటం లేదు. కడుపుకోత కలుగుతుంది. చలిపిడుగా గర్జింపకు

గర్జింపకు అని మనవి వినిపించారు. ఆ మనవి వినే దెవరు?

సంవత్సరాది వచ్చింది. ఆకాశం చుక్కలతో నిండింది. చుక్కలన్నీ సోకు చేసుకొన్నాయని ఆకాశానికి ఆనందమేకాని తన కానందమేది. నిత్యం ఆవేదన నిర్వేదంతో జీవితం క్రుమ్గిపోతోంది. విచారంతో కుమిలిపోతోంది బాధతో కృశిస్తూంది. వాటి నన్నిటిని తట్టుకోలేక 'మినుకు మినుకు మినుకు మనుచు

మింట మెరయు చుక్కలార
చెప్పరేల నా
చిన్నితల్లి యెన్నడొక్క

యని చుక్కలను చూస్తూ తన మంగళప్రద ఆ చుక్కల మధ్యచేరి కేరింతలు కొడుతూ ఆడుకొంటున్నదేమోనని ప్రశ్న వేశారు కాని సమాధానం చెప్పేది ఎవ్వరు? సమాధానం రాకపోయేసరికి గుండె చివుక్కుమని

చెప్పవద్దులే వరాల
కుప్పను కాపాడి మరల
వప్పగింపుక్షీ స్వర్గము
నందున మాకంతె చాలు

అన్నారు. ఆ మాటలు ఎంత హృదయవిదారకంగా ఉన్నాయి. భూమిమీద అప్పగిస్తే మరల ఇల్లు కాళీచేసి వెళ్ళిపోతుం దేమోనన్న భీతిని బయటకు చెప్పకుండ లోన దాచుకొని స్వర్గంలో అప్పజెప్పమని విన్నవిస్తున్నారు. కన్న బిడ్డ మమకారం కన్న తల్లిదండ్రుల కెరుక, కన్నె పాపాయికి కన్నతండ్రి కంటిరెప్ప. ఆ మంగళప్రదే సంవత్సరాది పర్వదినాన్నేఉంటే దివ్యసుందర మందార సుమబాలై ముసిముసినవ్వులు నవ్వుతుండేదిగదా. పాపం మంగళప్రద లేకుండానే సంవత్సరాది చరాచరా వెళ్ళిపోయింది.

మంగళప్రద తరువాత వేద్రాద్రి నరసింహమూర్తి అవతరించాడు అప్పారావుగారికి. నరసింహమూర్తి దీపమై ఇంట వెలశాడు. అతని పుట్టుక దివ్యదీపావళిలా అనిపించింది. నందన వనంలా భాసించింది. హృదయం ఆనందసాగరంలో మునిగింది. ఈ దర్శనంతో మంగళప్రద చేసిన గాయం మాన్పుకువచ్చింది. కాని క్షణంలో జరిగేది ఎవరీ లోకంలో చెపుతారు. ఏదైనా సంభవించిన తరువాతగాని తెలియదు. నరసింహమూర్తి నెవెూనియాతో అవతారం చాలించాడు. అదృష్టం కాస్తా చేయిజారిపోయింది. పచ్చగా వెల్గినకాంతి ఒక్కసారి మాయమైపోయింది. పుట్టినబిడ్డ వేద్రాద్రికే పయనమై వెళ్ళాడు. నదులు పర్వతాలు ఢీకొన్నాయి, భూమ్యాకాశాల సంఘర్షణ బయలుదేరింది. ఆ సంఘర్షణలోనే 'ఉపశాంతి' 'జీర్ణంజీర్ణం' అనే గేయాలు బయల్పడ్డాయి.

వేద్రాద్రి శిఖరాన వెలిగన్న జ్యోతి
మినుకు మినుకుమని కాసేపు కునికిపోయింది
దేవలోకమునుంచి దిగినట్టి గంగ
వచ్చినదారినేపట్టి మళ్ళింది.

ఇద్దరూ వచ్చినదారినే వెళ్ళిపోయారు. ఆ ఇద్దరు ఇంటిలో ఎంతకాలమున్నారు గనుక తొందరపడి వెళ్ళిపోవటానికి. జ్యోతిలా కాన్పించి మినుకుమినుకుమని కాసేపు ఉండి నరసింహుడు వెళ్ళిపోయాడు. ఆశలన్నీ అడుగంటాయి. దేవలోకమునుంచి దిగినట్టి గంగ వచ్చిన దారినే వెళ్ళిపోవటంతో తన జీవితం తనకే ఎదురు తిరిగింది. ఏమి చేయగలరు? చేయవలసినదంతా చేశారు. కాని 'పంజరం దూరిన బంగారుపిట్ట తలుపు తీ సేవేపో తర్లిపోయింది'. 'తర్లిపోవటంలోనే ఆగని తొందరపాటు కన్పిస్తుంది. ఎవరితో ఒక్కమాటకూడ చెప్పకుండా

కాపుర మొచ్చిన కన్నెపాపాయి
ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు'

'ఎటువంటి మామూలు మాటలు. నిజానికి ఎంత పేలవమైన మాటలు. ఇక్కడ మాత్రం మాట మనిషై ఎలాగ గుండెల్లో పాడిచింది'. రోజూ ఎన్ని ఇళ్ళో ఎందరో ఖాళీచేసి వెళ్ళిపోతున్నారు. మరికొందరు ఆ ఇళ్ళల్లోకి వస్తున్నారు. ఖాళీచేసినా ఖాళీగాని ఇళ్ళు అవి. ఈ ఇల్లువేరు. ఈ ఇల్లు కిటికీతలుపులులేని అమాయకపు ఇల్లు. ఈ ఇల్లు ఒక్కొక్కరు ఖాళీచేసి వెళ్ళిపోయిందేగాని తిరిగిరాని ఇల్లు. కొన్ని ఇళ్ళు బావురుమని ఏడుస్తాయి. పరవాలేదు. ఈ ఇల్లు శూన్యం, అబ్బ, దీన్ని పాపాయి ఖాళీచేశాడు గనుక. ప్రపంచ కావ్యభాండాగారాల్లో గొప్ప పంక్తుల్లో ఇదొకటి. 'ఇల్లు ఖాళీచేసి

పోయాడు'. (కృష్ణశాస్త్రిగారి పీఠిక—బసవరాజు గీతాలకు—పేజి 9). గుండెను చీల్చేభావం అందులో ఇమిడి ఉంది. అందుచేతనే చివరి వాక్యం కదిలించి కన్నీరు పెట్టిస్తుంది.

బిడ్డలపైన వ్రాసిన 'ఎలిజీ'లు చదివిన తరువాత చెక్కులపైన కన్నీరు రాకుండ మానదు. నిట్టూర్పులు విడవకుండా ఉండలేం. తన కన్నీరు మనకు చూపించారు. ఆ కన్నీరులో మనకన్నీరు ఏకమైపోయింది. తన మూగబాధ మనలో మోగించారు. మనబాధ ఆయనలో కోటిగొంతులు విప్పి విషాదగీతిక అల్లింది. కన్నీరుకు మూలం హృదయ స్పందనమే గదా. ఆ హృదయ స్పందనానికి బిడ్డల మరణమే గదా. ఆ బిడ్డల మరణం జీవితంలో గొడ్డలిపెట్టులా కన్పించింది. అడుగుతీసి అడుగు వేసేసరికి హఠాత్సంభవాలు. పాపాయిల రాకపోకలు హృదయాన్ని వీణగా జేసికొని పాటలు పాడించుకొన్నాయి. ఏపాట పాడిన ఏమాట మాటాడిన చివరకు మిగిలింది ఆ చివ్వారి బాలల స్మృతిగీతాలే.

## ఆప్తుల స్మృతి

1924 వ సంవత్సరం మే నెలలో అప్పారావుగారి తండ్రి మరణించారు. చిన్నతనంలో తల్లి మరణించింది. తన తండ్రి మరణం బిడ్డను నిలువెల్ల ఒహించింది జీవితంలో అన్నీ మరణాలుగా కాన్పించాయి. దక్కొక్కరి మరణం ఒక్కొక్క రకంగా పీల్చి పిప్పి చేసింది. తండ్రి మరణంతో బసవరాజు జీవితనౌకకు చుక్కాని లేకుండా పోయింది. ఇంటికి పెద్దవారంటూ లేకపోయిన తరువాత పిన్నలకు మార్గం కన్పించదు. వారున్నప్పుడే కదా ధైర్యము, శక్తి లభించేవి. ఆ పెద్దల కరుణాకటాక్షాలున్నంతకాలం జీవితంలో బరువు భారం ఉండవు. దేనికైనా పెద్దవారి అండ లేకపోతే చిన్నవారికి దిక్కుతోచదు. తన తండ్రి మరణంగురించి బసవరాజు 'పితృస్మృతి' అను గేయంలో వ్రాశారు.

తల్లియును దండ్రియును గూడ తానె యగుచు
ప్రాణములకన్న నెక్కుడు ప్రాణముగను
నన్ను గాచి పెంచిన నాదు కన్నతండ్రి
యాత్మకొసంగు శాంతి నాత్మైకనాథు.

తల్లిలేని కారణంచేత తండ్రి లాలన పాలన ఎక్కువయింది. అందుచేత ప్రాణములకన్న మిన్నగా చూచి సాకిన తండ్రి ఋణం తీరేదికాదు. ఆ మమత, వాత్సల్యం రమ్మన్నా వచ్చేవి సహజసిద్ధంగా బిడ్డపైన కలిగేవి. అయితే చిన్నతనంలో తల్లి దూరమైంది. గనుక తల్లిప్రేమ తండ్రి యిచ్చేవారు. బసవరాజు తన తండ్రి దగ్గరనుండి తన ప్రేమ పొందటమేగాక తల్లిప్రేమనుగూడ పొందారు. అట్టి ప్రేమను పొందటంచేతనే మరవలేకుండా ఉండిపోయారు. తన జీవితానికి రూపులేఖలు దిద్దేవారెవరున్నారింకా. అందరూ మెల్లగా ఇహ లోకంనుండి జారుకొంటున్నారంటూ దుఃఖిస్తూ జీవితం గడిపారు.

బసవరాజుకు అవి చదువుకొనే రోజులు. చిన్ననాటినుండి అక్కఅంటే మహాప్రీతి తమ్ముడికి. అక్కకు తమ్ముడుపైన మక్కువ ఎక్కువ. ఆమె పెళ్లి అయింతరువాత అత్తవారింటికి వెళ్లింది. అయినా బసవరాజు అక్కను వదలిఉండలేక వెళ్లి చూచివస్తూ ఉండేవారు. ఒకనాడు హఠాత్తుగా జబ్బుచేసింది కాన్పు సమయంలో. ఆ జబ్బునుండి కోలుకోలేకపోయింది. చివరకాజబ్బుతోనే ప్రాణం వదిలింది. మరణవార్త వినగానే కూలిపోయారు బసవరాజు. మమతలు పండించుకొని జీవితంలో నిండించుకొన్న అక్క దూరమయ్యింది. జీవితంలో దుమారం రేగింది. ఆ దుమారమే బసవరాజుచేత 'సెలయేటిగానం'లో 'కలలో మా అమ్మ' అన్న గీతం వ్రాయించింది.

సోదరీ మేల్మిబంగారుసోయగంపు
దేవకన్నెరో నీకును తీరెనమ్మ
బ్రతుకు నీ రోజులవి చెల్లిపోయెనమ్మ
మఖను జన్మించి పుబ్బలో మాయమైతె
కొత్తలోకాల తిరుగంగ కోర్కె పుట్టెనమ్మ

ముద్దులు మూటగట్టి తమ్ముడూ అని పిలుస్తుంటే హృదయం ద్రవించేది ఆయనకు మఖలో పుట్టింది పుబ్బలో మాయమైంది. హఠాత్తుగా సంభవించిన మరణం గుండెను మాయనిగాయం చేసింది. ఒకప్రక్క తండ్రి మరణంవల్ల అయిన గాయం మానకుండనే మరొక గాయం ఏర్పడింది. ఆమె లేకపోతే తను నిల్వలేదు. తల్లిలేని లోటు అక్క తీరుస్తుందని కలలు

కన్నారు. ఆ కలలన్నీ పగటికలలుగా మారాయి. ఆశలన్నీ అడియాశలై పోయాయి. తన కోరికలన్నీ మన్నుచేసి తనముందు నిలబడకుండ ఎక్కడికో ప్రయాణమై వెళ్లింది. ఆమె ఎడబాటును ఓర్చుకోలేక మరణించిన సోదరిని వెళ్లకుమని చేయి అడ్డుపెట్టి ఆపటానికి ప్రయత్నం చేసినా ఆ ప్రయత్నాన్ని విఫలంచేసి మరీ వెళ్లింది. ఎందుకో అమెకంత తొందర. చిన్నారి తమ్ముడు తనకోసం ఎదురు చూస్తున్నాడు. అహోరాత్రులు పరితపిస్తున్నాడు. తన బాధ ఎవరితోను చెప్పుకోను. ఇంకా తనకు పెద్దవారంటూ ఉండి మార్గం చూపించకపోతే గతేమిటిని ప్రాథేయపడి ఒకసారి విని వెళమని దయను చూపించమని అక్కను వేడుకొన్నాడు. అక్క వినలేకపోయింది. చెవులు గట్టిగా మూసుకొంది. అందుచేత చేయి అడ్డుపెట్టి అక్కా వెళ్లకూ అని దీనంగా వేడుకొంటున్నారు.

## నాయక స్మృతి

దేశరాజకీయాల్లో చిత్తరంజన్ దాసుకు మంచి పేరుంది. ఆయనలేని సభ అంటూ ఉండేది కాదు ఆ రోజుల్లో. ఉపన్యాసాలతోను చర్చలతోను జీవితం గడుస్తున్నది. ఒకసారి ఆయనకు అస్వస్థత కలిగింది. డార్జిలింగ్‌లో ఉంటే అస్వస్థతకు కొంత ఉపశమనం కల్గుతుందన్న అభిప్రాయంతో అక్కడకు చేరుకున్నారు. డార్జిలింగ్ నగరంకూడ దాస్‌కు విశ్రాంతినియ్యలేకపోయింది. ఆ సమయంలో అప్పారావుగారు దాస్‌ను చూడటానికి వెడుతున్నారు. చివరి క్షణాలు దాస్‌కు దగ్గరకు చేరుకున్నాయి. బసవరాజు వెళ్లిన రెండు రోజులకు దాస్ కన్నుమూశారు. ఎక్కడ చూచినా మరణం తటస్థపడుతుంది బసవరాజుకు. దాస్ మరణం సమ్మెటపోటులా కన్పించింది. గుండె దుఃఖంతో భారమైంది. ఆ సందర్భంలో వారు వ్రాసిన 'ఊరేగింపు' గేయం సి. ఆర్. దాసును గురించి వ్రాసినది.

ఊరేగు మన్మథా ఊరేగవోయ్
పెండ్లికొడుకులాగు పల్లకీలో ఎక్కి! ఊరేగు!

ఆయనను కలకత్తా నగరవీధుల్లో ఊరేగిస్తూ శ్మశాన వాటికకు కొనిపోతున్నారు. పందిట్లో పెండ్లికొడుకులా కూర్చున్నారు ఆ శకటంపైన. తన పెండ్లి తంత్రీవాద్యాలతో జరుగుతుంది. స్వాతంత్ర్య శంఖారవంలో తన పెళ్ళి వాద్యాలు చెవిని పడటంలేదు.

ఆయన మహాపురుషుడు. వేదాంతి. రేపనేది ఆయన జీవితంలో లేదు

వేదాంతివి నీకు లేదూ రేపటి చింత
నేడే శుభలగ్నమ్మ్మ వేడుక చూడొచ్చినాము

అంతమంది వేడుక చూస్తున్నారు. శుభలగ్నం. పెద్దలందరూ చేరి పన్నీటిజల్లులు విసరుతున్నా మౌన ముద్ర వహించారు ఆ మౌనముద్రలో ఆయన ఎవరిని చూడరు, చూడలేరు, పల్కరింపలేరు. దేశ రాజకీయాలనుంచి పూర్తి విశ్రాంతికై వెళ్లిపోయారు. చివరకు తాను పెళ్లికొడుకులా వెళ్లిపోవటమే మిగిలింది ప్రజలకు.

## మిత్ర స్మృతి

భార్యాభర్త లిరువురు కోలారు బంగారుగనులు చూడటానికి వెళ్లారు. ఆ రోజల్లా గనులు చూచి బయటకు వస్తున్నారు. ఆ రోజు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు మరణించినట్లుగా పత్రికల్లో వార్తలు ప్రచురించారు. ఆ వార్త చూడగానే ఇద్దరూ నిలువునా నీరయ్యారు. సంగీతంలో సాహిత్యంలా ఉండేది వారి సాంగత్యం. దారుణమరణవార్త చెవిని పడగానే కన్నీళ్లు జలజల రాలాయి చివరి దశలో ఆయన్ను చూడలేకపోయి ఒక అద్భుతరత్నాన్ని కోల్పోయినట్లుగా భావించి దుఃఖించారు. ఆ దుఃఖంనుంచి 'యమునా సాంత్వనము' అనే గేయం దూసుకుంటూ వచ్చింది.

ఏలా పాడే వింక యమునాకళ్యాణి నే
లీలా మానవుడు గోపాలుడు లేడాయె

గోపాలకృష్ణయ్యగారికి యమునాకళ్యాణిరాగం అంటే మహాఅభిమానం. కోరుకున్నప్పుడల్లా బసవరాజును దగ్గర కూర్చోపెట్టుకొని యమునాకళ్యాణిరాగం వినిపించుకొనేవారు. ఆ యమునా కళ్యాణిరాగంలో లీలా మానవుడైన గోపాలుడిక కాన్పించడు. ఆయన లేకపోతే ఇంకెవరికి యమునాకళ్యాణి పాడి వినిపించగలరు? బహుశః యమునాకళ్యాణిరాగం కూడ నోట పల్కదేమో. అత్యంతస్నేహంగా మెలగి ప్రతిమాటలో ఆయనను అనుసరిస్తూ జీవితం గడపటంచేతనే

'కన్నుల పండువుగ
కనిపించ కుంటేనే
ఈనాటి నేస్తం
మేజనమ్మకో తిరిగి
కన్నీళ్ళు గారవకె
కడుపు చెరునయ్యేనే

యని అనుకుంటూ ఉండిపోయారు. కాని ఎన్ని అనుకొంటే ఏమిప్రయోజనం ఆయన పోయినతరువాత. ఆయనతోనే యమునాకళ్యాణి రాగంకూడ వెళ్ళిపోయింది.

అప్పారావుగారిది కత్తిపోట్లు తిని తిని కడుపు గాయమైన పేదగుండె. మనసులో అంతబాధ ఉన్నా గీతం పరుగులు పెడుతూనే ఉండేది. ఆ గీతాలు మానసిక సంఘర్షణనుండి వెల్వడ్డాయి. దుఃఖం వచ్చిందంటే పాటగా పాడవలసిందే. ఆ పాటలో బాధ మోగవలసిందే. ఆ విధంగా మోగినప్పుడే గుండెను పట్టుకుంటుంది. జీవితంలో ఆయనకు విశ్రాంతి తక్కువ. పదిమందిలో కలసిఉన్న ఒక సాహిత్యగోష్ఠి జరగవలసిందే ఆ దర్బార్‌లో ఉండవలసిందే తాను. బసవరాజుది 'మజిలీలేని యాత్ర'. ఆయన తత్వాన్ని బట్టి అందరూ ఆయనను 'జిప్సీ'యని — కృష్ణశాస్త్రిగారిలాంటివారు పిలుస్తూండేవారట. 'నగ్నంగా నిజంగా ఉంటుంది ఈయన కవిత్వం. జిలుగూ తళుకూ ఉండదు. ఉండడానికి వీలులేదు. ప్రతి భావము గుండె చీల్చుకొని దూకుడుగా వొస్తుంది. అందుచేతనే ఈయన పాటలలో తొలి చరణాలే గుండెను పట్టుకుంటవి. అనుభవాలే పాడుకుంటాడు. తన కోసమే ముఖ్యంగా అనిపిస్తుంది. జీవితంలో ఏ దెబ్బ తగిలినా ఏ సుఖం కలిగినా వెంటనే కవిగా పలుకుతాడు. మహాచురుకైన హృదయం. ఫక్కీ గురజాడ అప్పారావుగారిది. కాని కవిత్వం పూర్తిగా కళగా ఎంచుతాడు' (ముద్దుకృష్ణ—వైతాళికులు).

బసవరాజు 'పాట పాడుతూఉండగానే ప్రాణం పోతుందా ప్రాణం పోతున్నప్పుడుకూడా పాట ఆగి పోకుండా నోట మోగుతుందా' యని అనుకుంటూ ఉండేవారట. ఆయన జీవితానికి పాట ప్రాణం లాంటిది. పాట పాడనిదే ఉండలేరు. విశ్రాంతిలో నైనా పాట పాడవలసిందే. కడసారిగా

బ్రతుకు బరువు మోయలేక
చితికి చివికి డస్సి వాడి
పికరుబుట్టి పారిపోయి
వకడనె ఏ తోటలోనా
పాట పాడుతుండంగ నా ప్రాణి దాటియేగేనా
ప్రాణిదాటియేగువేళ పాట నోట మోగేనా

అంటూ భావగీతం స్మృతిపథంలో పాడుకున్నారు.

తృటిలో జరిగిపోయిన జీవితం బసవరాజు అప్పారావుగారిది. ఆయన 'ఎలిజీ'లు మానవబాధలు ఎరుకపరచేవి. ఆయన గీతాలు ప్రణయంనిండిన హృదయాలను రగిలించేవి. ఆయన మాటలు చల్లని చంద్రకిరణ ప్రసారంలో మైమరపించేవి. ఆయన హృదయం ఆనందంలో పండింది విషాదంలో మోడై పోయింది. జీవితంలో ఆయనకు మిగిలింది బాధ తక్కువ.



# ప్రయోగ ప్రామాణ్యవాదము దాని చరిత - 1

శ్రీ సిడ్నీ హుక్

్యక సంబంధమైన ఉద్యమాలను అర్థం చేసుకొనడానికి ఒక పద్ధతి వుంది. ఆ ఉద్యమాలు ఏదో సంస్కృతిలో, ఏదో సభ్యతలో ఉద్భవిస్తాయి. ఆ సంస్కృతి, ఆ సభ్యత ఆధారంగా, తత్త్వకరణోచితంగా ఆ ఉద్యమాలను అర్థం చేసుకోవాలి. అనుభవైకప్రామాణ్యవాదం వుంది. Empiricism. అది గ్రేట్ బ్రిటన్‌లో పుట్టింది. (ఐరోపీయ) ద్వైతము, (Dualism), హేతువాదము (Rationalism) వున్నాయంటే, అవి డికార్టేనాటినుండీకూడా ఫ్రాన్సులో విరాజిల్లుతున్నాయి. ప్రత్యయాత్మక విజ్ఞానవాదానికి (Idealism) జర్మనీయే ఇల్లు; ఆటపట్టు అయిపోయింది. ఇట్లా ఆయా తాత్త్విక ఉద్యమాల అనుపానులు తెలిసి అర్థం చేసుకొనడం మంచి పద్ధతే అయినప్పటికి, ఆ పద్ధతి బాధలు ఆ పద్ధతికి వున్నాయి. ప్రతిఒక్క తాత్త్విక పద్ధతిని గురించిన్నీ దానికి విశ్వంకష ప్రామాణ్యం వున్నట్లు చెప్పబడటం వుంది. అచ్చట ఆ ఏకదేశమైన సంస్కృతి, ఏకదేశమైన సభ్యత ప్రతిబంధకాలుకాక, ఆ తాత్త్విక పద్ధతి వానిని అధిగమించి విశ్వైకసత్యము, తత్త్వము అయినట్లు చెప్పబడటం గోచరిస్తూ వుంటుంది. ఇచ్చట మహాఅయితే, ఎవరైనా ఆ తాత్త్విక పద్ధతిని గుర్తించవచ్చుగాని, అదే సత్యం అని అంగీకరించడం మాత్రం ఇటువంటి సందర్భాలలో కుదరదు.

ఇచ్చట ఇంకో విషయాన్నిగూడా చెప్పుకోవలసి వుంది. ఒక సంస్కృతి వున్నదంటే, ఆ సంస్కృతి నుంచి అనేకరకాలైన తాత్త్వికపద్ధతులు సముద్భవం చెందుతూ వుండటంవుంది. ఆ సంస్కృతియందలి వివిధవిభాగకారణాలవల్ల, ఆర్థిక ధర్మాలవల్ల, మత ధర్మ ప్రయోజనాలవల్ల అవి ప్రభావితం అవడం కూడా కన్పిస్తుంది. ఎక్కడో ఒక రాజ్యం, లేక ప్రభుత్వం ఒక పద్ధతి తాత్త్వికపద్ధతిని తీసుకొని, దానికి అధికారముద్రవేసి, ఇది అధికారతాత్త్వికపద్ధతి అని చెప్పిన సందర్భాలలోతప్ప, ఒక తాత్త్వికపద్ధతి కన్న ఇంకో తాత్త్వికపద్ధతి ప్రబలమై విచారధారా ప్రవంతిని దిద్దడంలో ప్రకృష్టతను ఎందుకు పొందుతూవుంటుందో చెప్పడం కష్టం. తాత్త్విక పద్ధతి విజ్ఞానశాస్త్రంవంటిదికాదు. విజ్ఞానశాస్త్రంలో వున్నట్లు తాత్త్వికపద్ధతిలో సత్యనిగమనానికిగాను—అందరిచేతను ఆమోదింపబడిన సామ్యప్రమాణాలు లేవు.

ప్రయోగప్రామాణ్యవిజ్ఞానవాదం (Pragmatism) వున్నదంటే అమెరికాకు, దానికి సంబంధం వుంది. బయటిదేశాలలో, అమెరికాను గురించి తెలిసినట్లే, తర్వాత విమర్శనుబట్టి మాత్రమే, ఈ వాదం సంగతి తెలుసుగాని, అసలు ఆ వాదాన్ని ప్రపంచించిన వారు ఏమి చెప్పారో, దానిని తెలుసుకొని తెలియడం అన్నది జరిగినట్లు కన్పించదు. కొంతమంది విమర్శకులు ప్రయోగప్రామాణ్యవిజ్ఞానవాదాన్ని పని పనికోసమే అన్న పద్ధతిలో వ్యాఖ్యానించివున్నారు. మరికొందరు ఈ వాదం—అమెరికా జాతిజీవనంయొక్క ఐహికతత్త్వాన్ని చెప్పేది మాత్రమేనని ఖండించివున్నారు. ఇచ్చట ఫలమేతప్ప ఇతరములు గౌణాలుగా భావింపబడతాయనే ధోరణి వ్యక్తం చేయబడటంవుంది. మరికొందరు ఈ ప్రయోగప్రామాణ్యవిజ్ఞానవాదం అన్నది—నిజంగా ఒక తాత్త్వికసిద్ధాంతంకాదుఅన్న పద్ధతితో విమర్శించివుండటంగూడా జరిగింది. ఈప్రయోగప్రామాణ్య విజ్ఞానవాదం పట్ల కొన్ని ప్రక్రియల కూడిక. ఆ ప్రక్రియలు గొంతెమ్మ ఆలోచనల చేయ

డానికి మాత్రం ఉపయోగపడతాయి. అధునాతన విజ్ఞానశాస్త్రంనుంచి 'ఎత్తే ఎగ్గం' చెప్పబడిన దేవతలను ఈ తాత్విక సిద్ధాంతం తిరిగి, ఆ విజ్ఞాన శాస్త్ర ప్రపంచంలో అధిష్ఠాన స్థానాలలో నిల్పాలని చూస్తున్నది—అన్న ధోరణిలో కూడా విమర్శ సాగివుంది. మరికొందరు ఈ తత్వాన్ని, లేక దర్శనాన్ని ఇంకో పద్ధతిలో విమర్శించారు. ఈ దర్శనంలో భవిష్యత్తుకు గుడి కట్టడమూ, వర్తమానాన్ని నిష్కాసనం చేయడము వుంది; ఆ అనుకున్న భవిష్యత్తు వచ్చేదికాదు; అదే విధంగా తత్‌క్షణమాత్ర వర్తమానం కోసం గతాన్నికూడా బలివేయడం ఇందులో వుంది. ఇది ఇంకో విధమైన పూర్వపక్షం.

ఈ విమర్శలను చూస్తే నిజంగా ఆశ్చర్యం వేస్తుంది. ఎందుచేతనంటే ప్రయోగ ప్రామాణ్య విజ్ఞానవాదు లెవ్వరూ తమ దర్శనాన్ని గురించి అట్లా భావన చెయ్యలేదు. తర్కాన్ని, నీతివాదాన్ని తీసుకుపోయి విజ్ఞానశాస్త్రాలకు, లేక సైన్సుకు అనువర్తింప జేశారు. ఆ అనువర్తనంయొక్క కార్యాన్నే ప్రయోగ ప్రామాణ్య విజ్ఞానం అన్నారు.

ఈ ప్రయోగప్రామాణ్యవిజ్ఞానదర్శనాన్నిగురించి ఎవరు ఎట్లా భావించినా, ఈ దర్శనం మాత్రం అమెరికాజీవితరంగంలోంచి విశిష్టమైన, ప్రత్యేక లక్షణంగల తాత్వికఉద్యమంగా ప్రాదుర్భావం చెందింది. ఇచ్చట వేరుమాటకు స్థానంలేదు. అమెరికా తెలియబడిన అనంతరం తొలి శతాబ్దాలలో అమెరికాలో స్థిరనివాసాలు ఏర్పరుచుకున్నవారిపై ఐరోపా ఒక విధమైన జీవితపద్ధతిని విధించింది. ఐరోపాలో వారు ఎరిగివున్న జీవితపద్ధతికన్నా ఈ జీవితపద్ధతి వేరుగా వుండటం ఈ స్థిరనివాసులకు అనుభవంచేత వేద్యం అవుతూవచ్చింది. అయితే ప్రపంచాన్ని గురించిన వారి భావనలు, తాత్విక సిద్ధాంతప్రపంచము అంతా గూడా ఐరోపాలో ఎట్లావుంటే, ఇచ్చట కూడా అట్లాగే వుంటూవచ్చాయి. నిత్యజీవనంలో వారిది ముందు చూపు, ముందుదారి అయిపోయింది. అయితే మానస వ్యాపారంలోమాత్రం ఈ కొత్తఅమెరికనులు ఐరోపా అధికారంలో మిగిలిపోయారు. రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొంది, అమెరికా రిపబ్లిక్ అనే నౌకను ప్రపంచ మహాసముద్రజలప్రవేశం చేయించిన అనంతరం


### Statement about ownership and other particulars about newspaper

*Under Section 19 D (b) of the Press and Registration of Books Act.*

**BHARATI**

1. Place of publication: Madras
2. Periodicity of its publication: Monthly
3. Printer's Name: Sri S. Radhakrishna
   Nationality: Indian
   Address: 6&7, Thambu Chetty Street, Madras-1.
4. Publishers Name: Sri S Radhakrishna
   Nationality: Indian
   Address: (As above)
5. Editor's Name: Sri S. Sambhu Prasad
   Nationality: Indian
   Address: 2-A Greenways Road Madras-28-
6. Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital.

| NAMES | ADDRESSES |
|---|---|
| 1. Mr. S. Sambhu Prasad | 2-A, Greenways Road, Madras-28. |
| 2. Mrs. S. Kamakshamma | Do |
| 3. Mr. S. Nageswara Rao | Do |
| 4. Mr. S. Radhakrishna | 6 & 7, Thambu Chetty Street, Madras-1. |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. RADHAKRISHNA

1-3-68 Signature of Publisher

యొక్క పరిభాషలు. అందువల్ల ఆ పరిభాషను చెప్పే భాషాసంబంధమైన సంజ్ఞాకలాపం ముఖ్యం అవుతున్నది. ఆత్మ చైతన్యం అన్నది భాషవలన వికసిస్తున్నది. ఇతరులను తెలియడము ద్వారా, వారి పోకడలను, భాషలను అనుకరించడంద్వారా, అంతర్గతం చేసుకొనడంద్వారా మనం మనస్సును, ఆత్మను తెలియగల్గుతున్నాము. అనుభవం అన్నదాని సమాజిక ఆయామం లేక పరిణాహం వున్నది. దానిని మనస్తత్వప్రమాణంగాను, లేక ప్రాకృతిక సత్తాగాను చెప్పడానికి వీలులేదని మీడ్ అన్నాడు. మానవునకు ఇంద్రియములద్వారమున గోచరమై విశదప్రత్యయ జాతంగాఏర్పడే సర్వ ఆవిష్కృతకార్యాలయందున్నూ సాంస్కృతిక సంబంధమైన, చరిత్ర సంబంధమైన విషయాలు ప్రవేశించి వుంటున్నట్లుగూడా మీడ్ భావించాడు.

అయితే జాన్ డ్యూయీ (1859–1952) అంటూ తలఎత్తి ఈ ప్రయోగ ప్రామాణ్య విజ్ఞానవాదాన్ని ప్రపంచించడం మొదలుపెట్టే అంతవరకు, ఆ దర్శనానికి సువ్యవస్థితమైన తత్వస్థాయి ఏర్పడలేదు. డ్యూయీ ఆ వాదాన్ని స్థాపించడంకోసం తిరిగి పియర్స్ చెప్పిన ఆదిసూత్రాలను ఏరి పుచ్చుకున్నాడు. జేమ్సు ప్రవేశపెట్టిన పదార్థేతరవాదం తాలూకు గుర్తులన్నింటిని అందులోంచి తొలగద్రోశాడు. తత్వశాస్త్రంలో అనాదినుంచి వస్తున్న ప్రహేళికలవంటి సమస్యలు కొన్నివున్నాయి. వానిని త్రోసివెయ్యడంలో డ్యూయీ అతి చమత్కారమైన పద్ధతిని అవలంబించాడు. పరలోకం అన్న సమస్య వుంది. దానియొక్క ఉనికి నిరూపించడం ఎట్లా? ఇది ప్రశ్ననే ప్రశ్న అడగడంగా వుంటుంది. అంతేగాక ఇచ్చట స్వయంవిగ్రహబాధికులైన ఉక్తులను కల్పన చేయవలసి వుంటుంది. అటువంటి సమస్యలతో పని ఏమిటి? ఇట్లా ఆ సమస్యను దాటించి, డ్యూయీ తన సిద్ధాంతప్రవచనంలో పడ్డాడు. ప్రపంచాన్ని అర్థంచేసుకొని, శాస్త్రవిజిజ్ఞాస ప్రాతిపదికగా మానవుడు ఉత్తమ సమాజాన్ని నిర్మాణం చేసుకోగలందులకు అతని సర్వ ప్రయత్నాలకు దారిచూపించే విధంగా జాన్ డ్యూయీ ఇప్పుడు ప్రజ్ఞాన సిద్ధాంతాన్ని నిర్మించడానికి పూనుకొన్నాడు. ప్రకృతి మారుతున్నది. స్వభావం మారుతున్నది. అదే విధంగా సమాజంలోను మార్పులు వస్తున్నాయి. ఈ జరుగుతున్న మార్పులయొక్క పద్ధతి మానవునకు ఒక అందుకు చోదనాన్ని ఇస్తున్నది. ఆ చోదనాన్నిబట్టి మానవుడు ప్రత్యయ జాతాన్ని, సమాజ వ్యవస్థలను నిరంతరము పునర్నిర్మించుకుంటూ పునర్వ్యవస్థీకరించుకుంటూ పోతూవుంటే, ఆ నిర్మాణం సాగుతూవున్న కొద్దీ ఆ నిర్మాణక్రమంలో మానవునియొక్క స్వభావమే భృశమూ మారిపోతుందని డ్యూయీ అంటాడు. అనుభవం అన్నది అక్రియమైన చైతన్యంమీద బాహ్య పరిస్థితులయొక్క ప్రభావంపడి పనిచేసిన సందర్భంలో పుట్టిన ఉపవస్తువు వంటిదికాదు. ఆ అనుభవం అన్నది ఒక పద్ధతి: ఒక గతి: సంస్కృతీకరింపబడిన జీవసంహతి యొక్కయు, చరిత్రచేత దత్తమైన ప్రపంచంయొక్కయు నడుమ జరుగుతూవుండే ప్రభావపారస్పర్యంయొక్క వర్తనమే అనుభవం అంటాడు డ్యూయీ. అనుభవైకప్రామాణ్యవాదాన్ని, భూతార్థ ప్రామాణ్యవాదాన్ని డ్యూయీ ఖండించాడు. ఈ రెండువాదాల వారున్నూ అనుభవం అన్నది ప్రత్యేక ప్రత్యేక భూతార్థ విషయాలపై ఆధారపడి వుంటుందని, వేదనయొక్క అణువులతో కూడివుంటుందని, వానిమధ్య సంబంధబాంధవ్యాలు ఏమీ వుండవని అనడం డ్యూయీకి సుతరామూ గిట్టలేదు. వేదనయొక్క ఏకరూపంగా మనస్సును చెప్పవచ్చును అన్న వారి నమ్మకాన్నికూడా ఆయన ఖండించాడు. వేదనలు వున్నాయంటే, అవే జ్ఞానంకాదు; జ్ఞాన సముపార్జనకు ప్రచోదనాలు మాత్రమేనని డ్యూయీ అభిప్రా. తర్కాన్ని ఆయన సమగ్రరూపంలో ఆలోచించి, అది విజ్ఞాన పద్ధతి అని, నూతన యదార్థ విషయ ఆవిష్కార ప్రయోగ పరీక్షలతో దానికి సన్నిహిత సంబంధం వున్నదని చెప్పాడు. తర్కము, గణితశాస్త్రము వట్టి భావపరికరాలు, ఉపకరణాలు. జ్ఞానాన్ని పద్ధతిలో పెట్టడానికి మాత్రం ఇవి ఉపయోగపడతాయి అన్నాడు. అవి అనంతత్వంయొక్క వ్యాకృతులుగాని, జీవసత్తాయొక్క ధర్మాలుకాని కావు. డ్యూయీ తన మహాగ్రంథాలలో ఈ ప్రధాన సిద్ధాంతాలను రూపొందించాడు. Experience and Nature (1923), Logic– The Theory of Inquiry–అన్నవి ఆ గ్రంథాలు. తన ఆ తాత్విక సిద్ధాంతాలతో డ్యూయీతత్వ

చింతనమే పద్ధతిగా పెట్టుకున్న వారిని ప్రభావితులను చేయలేక పోయాడు. ఆయన కాలంలో ఈ తాత్త్వికులు ప్రత్యయాత్మకప్రమాణ్యవాదులుగావుంటూ, ఆ అనంతరం ద్వైతులుగానో, భూతార్థ ప్రామాణ్యవాదులుగానో మారిపోయారు. డ్యూయీని పట్టించుకొని, ఆయన తత్త్వాన్ని అనుసరించినవారు విద్యావంతులలో అధికం కాజొచ్చారు. మనస్‌శాస్త్రంలో, విద్యాశాస్త్రంలో, ధర్మశాస్త్రంలో, రాజకీయ సామాజిక శాస్త్రాలలో అధ్యయనం జరిపివున్న విద్యావంతులు ఆయన తత్త్వంలో పడుతూ వచ్చారు. ఆయన చెప్పిన తత్త్వం సర్వజీవితాన్ని దిద్దే తాత్త్వికధర్మం కాకపోయినా, వారుచేసే పనులకు ఒక అర్థాన్ని, ప్రయోజనాన్ని సముపార్జనచేసి, ఉత్తమ సమాజ జీవన మార్గాలను గురించిన సమ్యక్ దృష్టులను సమకూర్చిపెట్టింది.

అమెరికాలో కూడా ఇప్పుడు ప్రయోగ ప్రామాణ్య విజ్ఞానవాదం తన్ను తాను సమర్థించుకోవలసిన స్థితిలో పడిపోయింది. ఇందుకు అనేక కారణాలు కన్పిస్తున్నాయి. తత్త్వశాస్త్రంలో సంప్రదాయవాదుల ప్రతిఘటన ఎక్కువైంది. పదార్థేతర తత్త్వాలు, జీవి ఆవిర్భవ శాస్త్రాలు మాత్రమే యదార్థజ్ఞానానికి మార్గాలుగాని, సైన్సు, విజ్ఞానశాస్త్రము, విజ్ఞానశాస్త్రపద్ధతులు యదార్థజ్ఞానసంపాదనకు మార్గాలుకావని వీరు అంటూ వస్తున్నారు. వీరికి మతధర్మవాదులు తోడైనారు. వారి దృష్టిలో ఈ ప్రయోగప్రామాణ్యవాదం పూర్తిగా లోకసంబంధమైంది. పూర్తిగా ఐహికమైంది. ఇందులో మోక్షానికి దారి చూపించే పద్ధతిలేదు. జనానికి మోక్షమార్గం లేకుండా ఇది చేస్తున్నది. అంతేగాక ప్రపంచం వున్నదంటే, అది పూర్తిగా నైతిక సంబంధమైన విశ్వం వంటిది. ఈ రకమైన భావాలకు ఈ ప్రయోగప్రామాణ్యవాదంలో స్థానం లేదనికూడా మతధర్మవాదులు వాదిస్తూ వున్నారు.

తార్కిక భూతార్థ ప్రామాణ్యవాదులు కూడా ప్రయోగప్రామాణ్యవాదాన్ని నిరసిస్తూ వస్తున్నారు. జ్ఞానాన్వేషణకు ఈ ప్రయోగప్రామాణ్యవాదం ఎంతవరకు పనికివస్తుందిఅని వీరి ప్రశ్న. తాత్త్వికంగా ఈ ప్రయోగప్రామాణ్యవాదం స్థాపించిన పద్ధతులు అందుకు పనికిరావని వారి భావన. అంతేగాక ఈ ప్రయోగ ప్రామాణ్యవాదంతో వారి సంప్రదాయిక తాత్త్విక పద్ధతుల అవశేషాలనుగూడా పసికట్టి, అందుకు కూడా దానిని వారు నిరసిస్తున్నారు. విలువను గురించి, ముఖ్యంగా నైతికమైన విలువలను గురించి ఆ మదింపులు, వస్తునిష్ఠమైన పద్ధతులతో తేల్చడం సాధ్యంకాదని, అవి చెల్లేవో, చెల్లనివో తేల్చాలిఅంటే, విజ్ఞానశాస్త్ర హేతువులద్వారానే ఆ పనిని చేయవలసివుంటుందని వీరు అంటారు. ఇచ్చట 'విజ్ఞానశాస్త్ర' మన్నమాట ఎంతవిశాలమైనదైనా వారికి ఇబ్బందిలేదు.

భాషాశాస్త్రవేత్తలుగూడా ఈ ప్రయోగ ప్రామాణ్య వాదాన్ని విమర్శించకుండా వదిలి పెట్టలేదు. మాటలయొక్క అర్థాన్ని తేల్చడానికి ప్రయోగ ప్రామాణ్యవాదులు చెబుతున్న ప్రయోగరీతి సంకుచితమైనదని, విజ్ఞాన శాస్త్రం పేరను, ఎక్కువ స్పష్టంగా వుండటం మంచిదన్న పేరుతోను మాట అర్థాన్ని మార్చడానికి ప్రయత్నించడంకన్నా వ్యవహారంలో మాట్లాడబడుతూవున్న పద్ధతిలోనే ఆ మాటలు కుశాగ్రంగావుండి సమర్థనీయాలు అవుతున్నాయని వీరు వాదిస్తారు. వీరి ఈ పూర్వపక్షంలోవున్న అర్థం ఇది. ప్రయోగ ప్రామాణ్యవాదులు మాటల అర్థం విషయంలో విజ్ఞాన శాస్త్రాలు చెబుతున్న పద్ధతుల మీదనే అధికంగా ఆధారపడుతున్నారు. అందువల్ల మతం విషయంలోనేమి, లలిత కళల విషయంలోనేమి ప్రతిమీమాంసాపద్ధతిలోను వాని వాని పరిభాషలు అర్థవంతాలైనప్పుడు వానియంతట అవి రూఢములు కాగలందుకు అనువైన స్వంతపద్ధతులు అచ్చట వుంటున్నాయి. ఇచ్చటవున్న సందర్భం ఇది అయినప్పుడు ఆయా మాటల అర్థాన్ని విస్పష్టం చేయడానికి విజ్ఞానశాస్త్ర సంబంధమైన ప్రయోగ పద్ధతులను అవలంబించవలసిన ఆవశ్యకత లేదు. ప్రయోగ ప్రామాణ్యవాదులు ఈ పద్ధతిని ఆమోదించరు. అర్థనిర్ణయసంబంధమైన వ్యవహారాలలో ఈ పద్ధతి ప్రతీపధోరణిగా, విరుద్ధపద్ధతిగా గోచరిస్తుంది. ఈ భాషాశాస్త్రవాదులు చెప్పే పద్ధతిని ఆమోదించేపక్షంలో అప్పుడు ఇచ్చట సందిగ్ధతకు, అస్పష్టతకు తలుపులు తెరిచినట్లు అయిపోతుందని, ఇది జరిగినప్పుడు మార్మికధోరణులు బాఢత, గాఢత క్రింద ఊరేగగల్గడం సంభవం కాగలదని ప్రయోగ ప్రామాణ్యవాదులు అంటారు.

# మర్మగవాక్షము

## శ్రీ రమణారెడ్డి

ప్రకృతి తనూహారిత్యము
ప్రచుర దృశ్య సారస్యము
ఎల్లకాల మొకలాగె
ట్లుల్లాసము గూర్పజాలు?

పరిచితమై పాండురవౌ
ప్రపంచమే వింత నిడును?
వింతల గనలేని కనులు
గంతలు గాకేమి టగును?

వయసు మీరుకొలది ఊహ
విప్పుగానియెడల దేహ
భారము పైబడి పోవగ
భావనోత్సుకత తొలగును.

మేనిప్పుడు మేరుదృశము
మనసో పరమాణుదృశము
మేనికి లోబడిన మనసు
మన్నుకింది మేలి దినుసు.

క్షణక్షణము పునర్నవా
మానసౌఖ్యమే కరవా?
మరి ఎందుకు కవికి ఉనికి?
మని లాభము నాసికునికి.

అనుభవ మొక శకటమైన
అనుభూతియె సుమి కందెన!
పాతబడిన నేమి? ధరణి
పూడిపోని అద్భుతఖని.

చోద్యాలను చూడలేని
చత్వారపు కనులకేని
చర్మ యవనికల మాటున
మర్మగవాక్షము లున్నవి.

చూడబడిన వస్తువులకు
చూడబడని విలువ లలరు;
అవే వాని అసలు ధరలు;
ఆనందమే ప్రకృతి మొహరు.

# మ ర్మ గ వా క్ష ము

మోకాళ్లను ఎడముజేసి
మీగాళ్లను తాకునట్లు
మూర్ధమ్మును వంచి దూర్చి
మంటినుండి చూడు మిన్ను:—

వృక్షమ్మొక మకుటధారి
నాగొక జలతారులాగు
గరికతలను చిరుతారక
గనిమల వెంబడి సరిగమ.

ఎండ తలకు మెరుగుదండ
ఏనుబోతొక మబ్బుకొండ
తొండ దొంగచాటు హంత
తుమ్మెద పూవుల నియంత.

తలకిందులుగా లోకము
తిలకించిన అదె నాకము !
బాలకుడే ఆదిమకవి
బాల్యమేను స్మృతిలో దివి.

చిన్ననాళ్ల కవి కెన్నడు
చన్ననాళ్ల కాగూడదు
పిన్నచూపు పెద్దతలపు
లున్నపుడే వాణి వలపు.

మరల మరల బాలుడనై
మరనుగాక మనుజుడనై
మేల్కొని కనుగొని జీవన
మూల్కొని మనుటయె కావున.

బాల్యము ప్రాప్తించనిచో
తాల్యమేని ఘనసంపద :
నిజపు మేలిముసుగు దీయు
నైసర్గిక మేకమాయ !

# కాపీరైటు ఒప్పందంలో మార్పు : రచయితల ఆగ్రహం

శ్రీ హ్యూ స్టీడ్‌మాన్ విలియమ్స్

రచయితలు ప్రతిభచేత జీవిస్తారు. వారి రచనలే వారికి ఆస్తి. ఆ రచనలపై వారికి హక్కు భుక్తాలు పూర్తిగా వున్నాయి. అయితే ఇటీవల ఈ హక్కుకు ప్రమాదం వాటిల్లేపని ఒకటి జరిగింది. అంతర్జాతీయ కాపీరైట్ ఒప్పందం సవరింపబడింది. ఇది ప్రపంచం అంతటా రచయితలకు ఆందోళనను, ఆగ్రహాన్నికూడా కల్గించింది.

అసలు ఆస్తులు ఎన్నోరకాలుగా వున్నాయి. వానిలో మేధాసంబంధమైన ఆస్థి కూడా ఒకటి. అయితే దీనిని ఇతమిత్థంగా నిర్వచించడం కష్టమైన పని. అందువల్ల దానిని రక్షించుకొనడం కూడా కష్టమైనపనే అవుతున్నది. చట్టరీత్యా ఈ ఆస్థికి ఒకవిధమైన రక్షణ చేకూర్చబడివుంది. దీనిని 'కాపీ రైటు' అంటున్నారు: యంత్రాలు కనిపెట్టినవారికి, డిజైన్‌లు వేసినవారికి ఒక రక్షణ వుంది. దానిని 'పేటెంటు' అంటారు. ఆ 'పేటెంటు' వారికి ఎట్లాగో, రచయితలకు 'కాపీరైటు' అట్లాగు

ఒక రచయిత చేసిన రచనకు ఏదో కొంత ప్రతిఫలం వుంటుంది అన్న రక్షణ ఇందుమూలంగా ఏర్పడుతున్నది.

ఇట్లా వుండగా గత జులైలో స్వీడన్‌లో ఈ మేధా సంబంధమైన ఆస్థిని గురించి ఒక మహాసభ జరిగింది. ఆ మహాసభ లక్ష్యం ఒక్కటే. అది—బెర్న్ ఏర్పాటును సంస్కరించడం; అంటే మార్చడం. ఈ మార్పు మూలంగా స్టాక్‌హోమ్ చట్టం అంటూ పుట్టింది. ఆ చట్టంలో వర్ధమానదేశాలకు సంబంధించిన అంశం ఒకటి చేర్చబడింది.

ఆ అంశము, ఆ అంశం మూలంగా స్టాక్‌హోమ్ శాసనము బ్రిటన్‌లో ఇంకా ఆమోదింపబడలేదు. ఇందుకు బ్రిటిష్ రచయితల, ప్రచురణకర్తల ఒత్తిడి కారణం.

కాపీరైటు హక్కులకు సంబంధించిన తొట్టతొలుతటి ఏర్పాటు బెర్న్‌లో జరిగింది, 1886 లో, సెప్టంబరు తొమ్మిదవ తేదీనాడు. ఈ ఏర్పాటుపై సంతకాలు జరిగాయి. ఏభై నాలుగు దేశాలు బెర్న్ ఏర్పాటుపై సంతకాలు చేశాయి. ఈ ఏర్పాటులో రచయితయొక్క, గ్రంథకర్తయొక్క హక్కులు వివరింపబడి వానికి రక్షణలు చెప్పబడినాయి. ఒక గ్రంథకర్త గ్రంథం వున్నదంటే, ఆ గ్రంథం మూలంలోను, అనువాదంలోనుగూడా అన్ని హక్కులు రచయిత జీవించి వున్నంతకాలం అతనివే; అతని మరణానంతరం ఏభై ఏళ్లదాకా ఆ హక్కులు అతనికి చెందిన విధంగానే రక్షింపబడతాయి. పరిస్థితి ఇది గనుక, బెర్న్ ఒప్పందంపై సంతకాలు చేసిన దేశాలవారు ఎవరుగాని, రచయితయొక్క అనుమతి లేకుండా అతని జీవితకాలంలోను, అతని మరణానంతరం, ఆయన నిర్వాహకులయొక్క అనుమతి లేకుండాను, ఆ రచయిత గ్రంథాన్ని ప్రచురించకూడదు. ఈ రకమైన హక్కు రచయితకు వుండటం మూలంగా, రచయిత రచించిన గ్రంథాలవిూద 'రాయల్టీ'లకు భద్రత ఏర్పడుతున్నది.

ఇది అంతా బెర్న్ ఏర్పాటులో చెప్పబడి వుంది. ఆ తర్వాత ఈ ఏర్పాటు అనేక పర్యాయాలు సంస్కరింపబడింది. 1896 లో పారిస్‌లో ఒకసారి, 1908 లో బెర్లిన్‌లో ఇంకొకసారి, 1914 లో

బెర్న్‌లో మరి ఒకసారి, 1928 లో రోమ్‌లో మరి ఇంకోసారి, 1948 లో బ్రస్సెల్సులో మరి మరిఇంకో సారి—ఇట్లా మొదటి బెర్న్ ఏర్పాటులో మార్పులు చేయబడినాయి. ఈ జరిగిన ప్రతిమార్పులోను ఈ కాపీరైటు హక్కును మరింత సమగ్రం చెయ్యడానికి, గ్రంథకర్తలకు ఆ ఏర్పాటు మరింత తృప్తికరంగా వుండేట్లు చెయ్యడానికి గాను ప్రయత్నం జరుగుతూ వచ్చింది.

అయితే ఈ బెర్న్ ఏర్పాటును ఇంతవరకు ఆమోదించకుండా దూరంగా వుంటూవచ్చిన పెద్ద రాజ్యాలు వున్నాయి. అవి మూడు వున్నాయి—అమెరికా, చైనా, రష్యాలు.

బెర్న్ ఏర్పాటును అంగీకరించిన రాజ్యాలమధ్య, అంగీకరించని రాజ్యాలమధ్య వున్న అభిప్రాయభేదాలను సర్దుబాటుచేసే నిమిత్తం సమితి తాలూకు విద్యా విజ్ఞాన సాంస్కృతిక సంఘం 1955 లో ఒక ఏర్పాటుచేసింది. Universal Copyright Convention ను లేక విశ్వంకషమైన కాపీరైటు ఏర్పాటును సాధించింది.

ఈ ఏర్పాటులోవున్న పద్ధతి ఇది. ఒక గ్రంథ కర్త పుస్తకం ప్రచురణ అయింది మొదలు కనీసం ఇరవైఅయిదు సంవత్సరాలవరకు కాపీరైటు రక్షణ వుంటుంది. ఒక గ్రంథం ప్రచురింపబడిన అనంతరం ఏడు సంవత్సరాలలోపల అధికారికమైన అనువాదం ఆ గ్రంథానికి వెలయింపబడక పోయినట్లయితే, గ్రంథ కర్తలయొక్కగాని, ప్రచురణకర్తలయొక్కగాని అనుమతి లేకుండానే ఆ గ్రంథంయొక్క అనువాదం ఎవరైనాసరే వెలయించుకోవచ్చు.

అమెరికావారు ఈ కాపీరైటు పద్ధతిని అవలంబించి, ఆ కాపీరైటు పద్ధతిని అవలంబించడం వలన వేయవలసివున్న గుర్తును పాటిస్తూ వస్తున్నారు. అటువంటి గుర్తువున్న పుస్తకాలకు అమెరికాలో రక్షణ సమకూర్చబడుతున్నది. ఈ పద్ధతిని బెర్న్ ఏర్పాటును అవలంబిస్తున్న దేశాలుకూడా గౌరవిస్తున్నాయి; పాటిస్తున్నాయి.

అయితే ప్రపంచంలో ఇప్పుడు ఒక కొత్త పరిసితి వచ్చిపడింది. ఆసియాలోను, ఆఫ్రికాలోను ఎన్నో దేశాలు తలఎత్తాయి. ఈ దేశాలు, దక్షిణ అమెరికా దేశాలు త్వరితగతిని అభివృద్ధిని పొందడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. ఇందు మూలంగా గ్రంథాలకు, గ్రంథకర్తలకు, ప్రచురణ కర్తలకు వుండే 'కాపీరైటు' హక్కుల పరిస్థితిలో మార్పు వచ్చింది. వర్ధమానదేశాలు విద్యా ప్రమాణాల అభివృద్ధికి, విద్యాభివృద్ధికికూడా తీవ్రకృషిచేస్తూ వుండటంతో, ఇందుకు అవసరమైన పుస్తకాల సంపాదన కోసం విదేశీ ద్రవ్యాన్ని పెద్ద మొత్తాలలో వెచ్చించ వలసిన స్థితి ఏర్పడిపోయింది. ఆఫ్రికా దేశాలతో బ్రిటన్‌చేసే పుస్తకాల వ్యాపారంలో 80 వంతులు పాఠ్య పుస్తక వ్యాపారమే అని చెప్పినప్పుడు ఆశ్చర్యం పడవలసిన అవసరం లేదు.

ఈ పరిస్థితి ఇట్లా రూపుకట్టుతూ వస్తున్నందుమూలంగా అనేకదేశాలలో ప్రభుత్వమే గ్రంథ ప్రచురణకు దిగడంఅన్న పద్ధతి ఏర్పడింది. పాఠ్య పుస్తకాలు చవుకగా లభ్యంఅయ్యేట్లు చూచుకొనడం, సాహిత్యగ్రంథాలు అందుబాటులో వుండేట్లు చూచుకొనడం ఈ దేశాలకు అగత్యం అయిపోయింది తక్కిన ఇతరమైన విషయాల సంగతి, కారణాల సంగతి ఎట్లా వున్నా, ఈపైన చెప్పిన ఒక్కకారణముయొక్క ఫలితమే బెర్న్ ఏర్పాటులో మార్పుకు హేతువు అయిందని చెప్పవలసివుంది. ముఖ్యంగా వర్ధమానదేశాలకు సంబంధించిన అంశం ఇందుకే స్టాక్‌హోం శాసనంలో పొందుపరచబడింది.

ఈ ప్రత్యేకపు ఏర్పాటు పద్ధతి యీ విధంగా వుంది. ఒక గ్రంథకర్త వున్నాడు. ఆ గ్రంథకర్త గ్రంథాన్ని వర్ధమానదేశాలు కాపీరైటు హక్కులకు భంగం లేకుండా ప్రచురించుకొనడానికి వీలుగా, ఆ గ్రంథకర్త మరణానంతరం ఏభై సంవత్సరాలవరకు ఏవిధా మాట్లాడేందుకు వీల్లేదన్న ఏర్పాటును ఇప్పుడు ఈ పద్ధతి ప్రకారం ఇరవై అయిదు సంవత్సరాలకు తగ్గించారు. అంతేకాక ఒక గ్రంథకర్త గ్రంథం ప్రచురింపబడిన మూడు సంవత్సరాలలో, వర్ధమాన దేశాలు—ఆ గ్రంథంపై గ్రంథకర్తకు న్యాయమైన పరిహారాన్నిఇచ్చి— స్థానిక భాషలలో ఆ గ్రంథం అను

వాదాలను గ్రంథకర్త అనుమతితో నిమిత్తం లేకుండానే ప్రచురణ చేసుకోవచ్చు.

ఒక గ్రంథం గనుక విద్యారంగంలో అధ్యాపనానికి, అధ్యయనానికి, పరిశోధనకు అవసరమైనదైనప్పుడు, ఆ గ్రంథాన్ని మూలభాషలోనే ఆ గ్రంథం వ్రాసిన గ్రంథకర్త అనుమతి లేకుండానే స్థానికంగా వర్ధమాన దేశాలు ప్రచురించుకోవచ్చు. అయితే—ఇచ్చట స్థానికంగా గ్రంథకర్తలకు ఇస్తున్న ప్రమాణాలకు అనుగుణమైన పద్ధతిలో ఆ గ్రంథం రచించిన గ్రంథకర్తకు పరిహారాన్ని చెల్లించాలి.

విద్యకోసము, సాంస్కృతికఅవసరాలకోసము అవసరమైన ఒక గ్రంథం అవసరమైనప్పుడు—ఇట్లా అన్నప్పుడు ఇందులో సాహిత్యం అయినది అంతాకూడా చేరుతోంది--ఆ గ్రంథానికి, అధికారికమైన స్థానిక ప్రచురణమన్నది తొలి ప్రచురణ జరిగిన మూడు సంవత్సరాల లోపల వెలువడి వుండకపోయినపక్షంలో, అనుమతితో నిమిత్తం లేకుండానే, ఆ గ్రంథాన్ని స్థానికంగా ప్రచురించుకోవచ్చు.

1967 జులైలో జరిగిన స్టాక్‌హోమ్ ఏర్పాటులో ఇటువంటి మార్పులు జరిగాయి. ఇచ్చట వర్ధమానదేశము అనగా, సమితిచేత వర్ధమానదేశంగా నిర్వచింపబడినది అని అర్థం.

ఈ ఏర్పాటుమూలంగా—పుస్తక ప్రచురణకు పెద్దకష్టం వచ్చినంతపని అయింది. వ్రాసి, ప్రసారం చేయబడిన వ్రాతలు వున్నాయంటే, వాని విషయంలో వర్ధమానదేశాలకు సంబంధించినంతవరకు, కాపీరైటు హక్కులు అన్నవి చెల్లుబాటే కావు. ఆ ప్రసారం లాభార్జన నిమిత్తం జరిగినదైనప్పుడు మాత్రమే దానికి రక్షణ వుంటుంది.

ప్రపంచంలో రేడియోస్టేషన్‌లు చాలావరకు ప్రభుత్వాలపరంగా నడుస్తూవుంటాయిగనుక, వానిని లాభార్జనకోసం అయిన సంస్థలు కావని వాదించడం పెద్దకష్టం ఏమీకాదు. ఇందుమూలంగా ప్రసారం అయిన వ్రాతలకు కాపీరైటు హక్కు అన్నది ఏ వర్ధమానదేశంలోగాని చెల్లుబాటు కాదు.

ఇటువంటి ఏర్పాట్లను గురించి బ్రిటిష్ రచయితలు, ప్రచురణకర్తలు కష్టపడుతున్నారంటే, అందులో ఆశ్చర్యంలేదు. వారికి అన్నము, వెన్నకూడా గ్రంథాలవిూదవచ్చే రాయల్‌టీలే.

రచయితలను, ప్రచురణకర్తలను దెబ్బకొట్టి, వర్ధమానదేశాలకు మారువేషంలో- ఆర్థిక సహాయాన్ని సమకూర్చడమే ఈ ఏర్పాటు అర్థంగా వున్నదని కొందరు అంటున్నారు. కొందరు—ఈ ఏర్పాటును పూర్తిగా దొంగతనంతోనే పోలుస్తున్నారు. మూలంగా బ్రిటిష్ రచయితలకు, ప్రచురణ కర్తలకు సాలుకు ఒక కోటి పౌనుల నష్టం వాటిల్లుతుందని మదింపు చేశారు.

ఇచ్చట గ్రంథకర్తలవాదంలో కొంత సబబు వుంది. ఇతర దేశాలకు ఒక దేశం సహాయం చేస్తున్నదంటే, ఆ సహాయాన్ని ఆ జాతి జాతీ భరించవలసివుంది కాబట్టి, అచ్చట ఆ జాతిలో కష్టపడి గ్రంథాలు రచించుకొని, అదోమాదిరి ఆర్జనతో జీవితం వెళ్లబోసుకుంటున్న కొద్దిమాత్రపు వర్గమైన రచయితలను, ప్రచురణ కర్తలను—ఇట్లా బాధించడం దేనికని, వారికి కష్టము, నష్టము కల్గించేయీ పని ఎందుకని వారు అడగడం కొంతవరకు సమంజసంగానే కన్పిస్తుంది.

## కలగూరగంప:

# తెలుగు నిఘంటువులలో దేశ్యపదములు

“భారతి” జనవరి 1968 సంచికలో శ్రీ భాగవతము రామారావుగారి ‘తెలుగు నిఘంటువులలో దేశ్యపదములపై చిన్నచూపు’ అన్న వ్యాసం చూచాక నాకీ వ్యాసం వ్రాయాలనిపించింది. మన సృత్య శాస్త్రానుగుణ్యంగా కారకము లేనిదే కరణం కూడదట. అలాగే ఒక వ్యాసరచనకు మరొకరి వ్యాసమే సామాన్యంగా కారకవౌతుందేమో!

శ్రీ భా॥ రామారావుగారు నిఘంటువులలోని దేశ్యపదముల చర్చను జేయుచు, తద్వ్యవహార సముచితార్థములను వివరించారు. అందునను శ్రీ బ॥ సీతారామాచార్యుల శబ్దరత్నాకరమును, వావిళ్లవారి నిఘంటువులను సవిమర్శకరించుచు, వ్యవహారార్థము లెయ్యవియో వివరించారు. పోగా నాకు నా నిఘంటువులే పరిశీలనాత్మకములైనను, బ్రహ్మశ్రీ మునునూరి వేంకటశాస్త్రిగారి నిఘంటువులు నుపయోగించినవి. కారణము యేతద్రచనా సమయమున వారు సర్కారుప్రాంత వ్యవహారార్థము వా రుపయోగించి యుందురనియే. కాగా, దేశ్యపదములలో మాండలికములుగా నుచ్చారణభేదము, తద్వారా నర్థభేదము, అన్వర్థ ప్రయోగము సంభవించుట జరుగునని యేతన్నిఘంటు కర్తలకు దెలిసియు వాటిపై దగు పరిశీలనమును, అర్థవివరణమును ఆ నిఘంటువులలో చేయకపోవుట కొంత కొరంతయే.

ప్రస్తుతము నే నీవ్యాసమున ‘పిష్టప్రేషణము’వలె శ్రీ భాగవతము రామారావుగారు వివరించిన దేశ్యపదములకు రాయలసీమ ప్రాంతమున ఉచ్చారణమును, అర్థప్రయోగమును నెట్టివో వివరించుచున్నాను.

1. **అంట:** శ. రత్నాకరమున, శబ్దార్థ చంద్రిక, శబ్దార్థదీపిక, శబ్దకోశములందు కుట్టుడాకు, గుంపను నర్థములకలదు. ‘విస్తరి’ యనునర్థమున ‘విస్తరంట’యని వ్యవహారమున నుండుకతననే లఘుకోశకారుడు ‘విస్తరాకు’ అను నర్థము నిచ్చెను. కాని రాయలసీమ ప్రాంతమున ‘ముద్ద’, మూట అను నర్థములలో వ్యవహరింపబడుచున్నది. ‘ఆ బియ్యము నంట కట్టి తీసికుపో’ ‘అన్నమంట కట్టి తిను’ అని నేటికినీ.

2. **అంబాడు :** ప్రాకుట యనియేకాక ‘తమాషా చేయుట’ అను నర్థములో వ్యవహారము. ‘అంబు+ఆడు’ అంబుతో నాడుట తమాషాకాదు. ‘ఏమి యంబాడు టనుకొంటివా?’ యని. తమాషాయా? అను నర్థమున.

3. **అగడు :** దూఱు, నింద యనియేకాక, ‘పట్టుదల’ యనియు; ‘అగడు సేయదగునా’ యని కీర్తనమున. ‘అల్లరి’ యని మా ప్రాంత వ్యవహారము. ‘అగడెక్కువయినదే—తోస్తుందా యింక’ అని.

4. **అడకత్తు లేక అడుకొత్తు:** శ్రీ భాగవతము రామారావుగారు అడుక్కొత్తు పదాన్ని ఉదహరించారు. ఆ పద మనర్థ ప్రయోగమే కాని వేరు కాదు. ఎట్లన ‘అడప’, ‘పోక’ శబ్దమునకు పర్యాయము. ఆ ‘అడప’ యే వ్యవహారమున ‘అడక’ ‘అడకాయ’ గా మారియుండనగు. ‘అడకాయ+ఒత్తు’ అనుటకన్నా కాలపరిణామమున ‘అడక+ఒత్తు’=అడకొత్తు=అడకత్తు’గా మారెననుట సమంజసము. ‘అడకత్తెర’లో నొక్కావు’ ప్రయోగము వ్యవహారమున ‘కత్తు’ ‘కత్తెర’ సమీప శబ్దములు: ‘అడక’ల కత్తిరించు పనిముట్టు ‘అడకత్తెర’. అదియే ‘అడకత్తు’ లేదా ‘అడక ఒత్తునది’, ‘అడకొత్తునది—అడకొత్తు’. అంతేకాని ‘అడుక్కొత్తు’ సరిగాదు. కాని నిత్యవ్యవహారమున ‘అడకత్తెర’యే.

5. **అధ్వాన్నము : (అర్ధాన్నము?) :—** శ. ర. లో దీని చర్చ లేదు. శ్రీ భా. రా. గారన్నట్లు వావిళ్ల నిఘంటువు ‘అధ్వాన’మునే సూచించినది. కాని శబార్థదీపికా॥ లఘుకోశములు ‘తప్పుదారి’యని

సూచించినవి. 'పాడు' అనునది వ్యవహారసిద్ధము. 'వ్యాపారం మరీ అధ్వాన్నంగా ఉంది' అంటే పాడుగా ఉందన్నమాట. 'అధ్వమున అన్నము' బాగుండుట తటస్థించపనిదే కాన 'పాడు' అన్న అర్థమునే సూచించు ననుట సత్యము. మరి 'అర్ధాన్నము'కూడా మా ప్రాంతమున 'చెడు'అను ప్రయోగమున కలదు. 'అర కడుపు కూడు' అను తెలుగు జాతీయానికిది సంస్కృతమేమో? మా ప్రాంతమున 'అర్ధాన్నం బాపతు' ప్రయోగం విరివిగా కానవస్తుంది.

6. ఇగురము : 'పొందికతనము' అన్నదేకాక, 'వివరము'అన్న పద మపభ్రంశముగా 'ఇగిరం, ఇగురం, ఇగరం'గా యీ ప్రాంతాలనేగాక, చాల ప్రదేశముల వాడబడుట తెలిసినదే. 'ఇగురంగా సెప్పుబాబూ!' అన్నది గ్రామశైలి.

7. ఇలపీట : ఇది మిశ్రపదమేమో యని యనుమానము. 'ఇల' సంస్కృత పదము, వసుధార్థము. భూమినిబాది పీట. దీనికి 'కత్తిపీట' అనే సరైన అర్థం చెప్పుకోలేము. 'ఈలకత్తి' సామాన్య వ్యవహారమున కలదు. 'ఈల' అనునదియు కత్తికే (మామిడికాయలు కొట్టునట్టి కత్తి) జనవ్యవహారము. 'ఈలపీట'=కత్తిగలపీట అనుట సరియగు. 'ఈల పీట'యే వ్యవహారమున కలదు.

8. ఉబ్బరము : 'కడుపుబ్బుట' సకలజన వ్యవహారము. 'వేడికి ఉక్కపోయుట' అనువానికి కొన్నిట ప్రయోగము. కాని కొన్ని ప్రాంతముల, మా ప్రాంతముల 'ఉమ్మరము' అన్న పదమే 'ఉక్కపోయుట' అను నర్థమునకు కలదు. కాని 'పొగరు' 'అతి' ధ్వనించురీతిని 'ఉబ్బరము' వ్యవహారమున కలదు. పోకిరీలను 'ఏమి ఉబ్బర మున్నట్లున్నదే—చేతులూరుకొనవా' యనుట మా యలవాటు.

9. ఊసులు : ప్రొద్దు పోవుటకై మాటలాడుకొనుట. 'ఉబుసు పోకకు కాబోలు ఊసులాడి' యని యీ ప్రాంతపుకవి ప్రయోగము. 'ఊసులు+ఆడుట=ఊసులాడుట' ఊసులాడుకొనుట సామాన్య వ్యవహార ప్రయోగము.

10. ఎటుమటము : 'అస్తవ్యస్తము' అనియే కాక 'ఎడము' అన్నది కొన్ని ప్రాంతముల వ్యవహారము. 'దగ్గరకు రా ఎటుమటం పోతావే?' అన్నది నేను శ్రీకాకుళం ప్రాంతముల, మా ప్రాంతమున వలస వచ్చిన సర్కారువారి నోటా విన్నాను. 'దూరారముగా' అన్నది వారి అర్థం.

11. ఎఱి : వ్యవహారమున 'ఎఱ' యనియే. వానపామనియే అర్థము. 'ఎఱవేసీ—గుఱి చూసీ...' అనునది ప్రయోగము.

12. కడమ : 'మిగిలిన'దనియే. బహుళ ప్రయోగము. 'కడమ'యీతని పాలగు' అని తిరుపతి కవుల ప్రయోగము.

13. కాచండి : బహుశా యిది 'కాచ+అండి' మిశ్రమముగా 'కాచండి'యై యుండవచ్చునేమో ప్రజా బాహుళ్యోపయోగమున? 'కాచము' 'గాజు' అని యర్థము నిచ్చును. 'అండి' 'అండ్డి' శబ్దములు 'గంగాళము' 'లోహపాత్ర' అను నర్థమ్ముల నిచ్చును. 'గాజు లోహముల పాత్ర' యనుట కుదురదు కావున 'లోహపాత్ర' యనియో 'గాజుగంగాళము' అనియో చెప్పవలె. కాని 'కంచు+అండి'=కంచుపాత్రయే' 'కాచండి'గా మారి యుండెనా? భావకవిత యుదయించి, ఉమర్ ఖయ్యాము ననువదించుచుండిన తొలికాలంలో 'కాచాండములో కామిని, వేచి వేచి నా కొఱకై' యంటూ యొక భావకవి 'కాచాండము'ను గాజుపాత్రగానే ప్రయోగించినారు. కాని 'శ్రీశైలము, దోరణాల, యడవల్లి, తోకపల్లిత్యాది ప్రాంతాలలో 'కాచండి'ని 'గాదెలు' అర్థంక్రింద ప్రయోగించుకోటం (నిత్యవ్యవహారంలో) గమనీయమైనది. 'కాచండి ఉందిగా తలగొట్టి నింపండి సద్దలు' అనేది నేడు వినవస్తుందట.

14. కుమ్మ : "ఇది 'కూడు'తో కలిపి 'కూడూ కుమ్మా లేక' అనునట్లుగా ఉపయోగింపబడునది'యని శ్రీ భా. రా. గారన్నారు. కాని 'కూడూ లేకా కుంభం లేకా' అనేది సరైన ప్రయోగం. నిర్వస్తులుగా ప్రయాణం చేయువారిని (సామాన్యంగా తక్షణ ప్రయాణీకులను) అన్నం తిని పొమ్మనుట, లేదా పాత్ర నొకదానిని వెంటదీసికొని పొమ్మనుట నాటి యాచారము. కారణ మేమన పాత్ర దరినున్న మధుకరధాన్యము వండికొనవచ్చుననెడి యూహ. నాడు ప్రయాణముల పాత్రలు మృణ్మయములే యగుట 'కూడూలేకా కుంభంలేకా' యనునది నానుడియైనది

ఇప్పటికీ యీ ప్రాంతము 'మార్కాపురము మొదలు ఆదవాని ఆవలిదనుక 'కూడూ—కుంభాలకీ సామ్యంగా చెబుతారు. పోతే 'కుమ్ము'నకు 'పోటు'లేదా 'దెబ్బ' వ్యవహారమున కలదు. 'ఒక కుమ్ము కుమ్మినానా ఛస్తావు తెలుసా' అనేది మొరటు ప్రయోగము.

15. కొయ్య : 'చిలుకకొయ్య' అనియేకాక పశువుల కట్టుటకై పాతు 'గుంజ' యనియు వ్యవహారమున గలదు. ఇట కొయ్యబాతి ఆవును గట్టుము' అని.

16. మొల : అందరూ యెరిగి వ్యావహరించు పదమే యిది. 'దిసిమొల' అనుట ప్రయోగము. 'మొలత్రాడు' ఇత్యాది.

17. సాలి : 'సాల' శబ్దమునకు రూపాంతరమ్మైనను, జాతిపరముగ నేతకాండ్రకుగల శబ్దమది. 'సాలెవారు' అని.

ఇట్లే మరెన్నియో దేశ్యపదములు తత్తత్ప్రాంతముల ఉచ్చారణ భేదములచే అర్థభేదములుకల్గి నిత్య వ్యవహారమున నుపయోగింపబడుచునే యున్నవి. ఈ వ్యవహారార్థము లన్నిటిని సమగ్రముగ చర్చించి నూత్న నిఘంటుకారులు నిఘంటువులయందు చేర్చెదరని నా విశ్వాసము.

—శ్రీ శాస్త్రి. జి. బాహులేయ.

జనవరి నెల 'భారతి'లో శ్రీ భాగవతము రామారావు గారు వ్రాసిన 'తెలుగు నిఘంటువులలో దేశ్యపదములపై చిన్నచూపు' వ్యాసము చదివినాను. ఆంధ్ర రాష్ట్రావతరణకు పూర్వమునగాని తరువాతగాని తెలంగాణాలోని తెలుగుభాషపట్ల సాహిత్యాభిమానులు అంత శ్రద్ధ వహించినట్లు కనిపించుట లేదు. ఇట్టి పరిస్థితి తెలంగాణాలోని వ్యావహారిక భాషపై శ్రీ రామారావుగారిలాంటి సాహిత్యాభిమానులు కృషి చేయడం ఎంతయో ముదావహము.

ప్రస్తుతము, నేను శ్రీ రామారావుగారు వివరించిన పదములకు తోడుగా మరికొన్ని తెలంగాణమున—ప్రత్యేకముగా కరీంనగర్ జిల్లాలో వాడుకలో ఉన్న కొన్ని దేశ్యపదములను, అవి ఏ రూపమున వాడుకలో ఉన్నదీ ఈ దిగువ పేర్కొనుచున్నాను. ఈ పదములను వివరించుటలో నేను శబ్దార్థచంద్రిక (శ. చ.) ను సంప్రదించినాను. కొన్ని పదములు శ. చ. లో లేవు. కొన్ని అందులో చూపిన అర్థములకు భిన్నముగా వాడుకలో నున్నవి. పెద్దలు పరిష్కరించ ప్రార్థన.

1. అంగీ ; చొక్కా.

2. ఇగ్గుట : లాగుట.

3. ఒరయు : మచ్చరించు, తగులు. ఒరపిడి కలిగించు — ఒరపిడి కలిగించు అను అర్థములో వాడుక. 'మోచేయికి గోడ ఒరుసుక పోయింది.'

4. జౌ (అవు) సుల : శ. చ. లో లేదు. బంగారము పనిచేయువారని అర్థము.

5. ఎంచు ; లెక్కించు; తలచు, ఆక్షేపించు. 'పైసలు ఎంచుకో.'

6. ఎత్తివేయు : తీసివేయు, అలక్ష్యము చేయు, క్రిందబడవేయు. 'గాజుసీసా ఎత్తేస్తె పగిలి పోతది.'

7. ఎత్తుకొనిపోవు : దొంగిలించుకొనిపోవు.

8. ఒట్టు : శ. చ. లో గొప్పది, పెద్దది, లోపము అని ఉన్నది. కాని వాడుకలో 'అఱచు' అను అర్థములో వాడుదురు. 'అబ్బ! ఒట్టికురా' 'కాకులు ఒట్టినట్టు ఒఱ్ఱుతున్నారు'

9. కచ్చరము : దగాది మొదలగు వానిం దెచ్చెడు బండి—ఎడ్లబండి అని అర్థములోనే వాడుదురు.

10. కంచరి : కంచుపని చేయువారు(కమ్మరి అనునది ఇనుప పని చేయువారికే వాడుదురు.)

11. కల్యా (లియా) మాకు : శ. చ. లో లేదు. మూలమేమిటో తెలియదు. కఱివేపాకు అను అర్థములో వాడుకలో నున్నది.

12. కఱి వేపాకు : నల్లని వేపచెట్టు యొక్క ఆకు. (కఱివేప చెట్టుయొక్క కాండము, కొమ్మలు, రెమ్మలూ పూవులు నల్లగా, నీలిగా నుండును.)

13. కుడుక : తక్కెడ, తట్ట, సిబ్బి అని యున్నది. కాని వాడుకలో కొబ్బరికాయ లోపలి భాగము

అని యర్థము—వచ్చికుడుక, ఎండుకుడుకలు.

14. కలువము : మందులు నూరుకొను సాధనము — ఇది రాయితో చేయబడియుండును. శ. చ. లో ఉన్నది.

15 కమ్మ : పుస్తకములోని పేజీ.

16. గవుసెన : మెత్తలపై కవరు (pillow cover). శ. చ. లో ఉన్నది.

17. గుంజు : ఇగ్గుట, ఈడ్చుట, గుంజకొను, లాగుకొను—ఇ అర్థములో వాడుకలో నున్నది.

18. గుమ్మి : బొట్ట, బరద, పజ్జ అని ఉన్నది. కాని వాడుకలో 'ధాన్యము నిలువయుంచెడు గరిసె'—ఇది వెదురుతోగాని ఈతనారతోగాని చేయబడును.

19. గుల్ల : శ. చ. లో కప్పుచిప్ప, చింత పండు మొ. దానిపైనాద కప్పుగానుండు బొబ్బెర, అల్పము, బోలు, అని యున్నది. కాని 'గంప' అను అర్థములో వాడుదురు.

20. గొండ్లువారు : కల్లుదించువారు.

21. గొంగడి : కంబళి.

22. చెంప : లెంప – చెంప దెబ్బలు

23. చల్ల : మజ్జిగ.

24. చుండెలు (క) : చుంచెలుక అని శ. చ. లో ఉన్నది. అదే అర్థములో వాడుదురు.

25. తలుగు పశువులను కట్టెడు సంధానము.

26. తమ్మళి (తంబళి) : శివార్చనచేసి బ్రతికెడు జాతి. 'లగ్నంలో తమ్మళ వాయిద్యాలు ఉంటయి'

27. తంతెలు : మెట్లు.

28. దప్పి, దూప : శ. చ. లో నీరువట్టు శ్రమము, పరితాపము, బడలు అనియున్నది. కాని 'దాహము' అను అర్థములో వాడుకలో నున్నది. 'నాకు దప్పి అయియున్నది'. కొంచం దూపయియున్నది.'

29. దొడ్డు : శ. చ. లో గొప్ప. మంచి, కష్టము, ప్రశస్తము అని యున్నది. వాడుకలో 'మందము, లావు' అను అర్థములలో వాడుదురు. దొడ్డుబట్ట, దొడ్డుకట్టె.

30. పసి(క)గడుగు : శ. చ. లో లేదు. అన్నం వండేటప్పుడు బియ్యం కడిగిననీళ్లు అని వాడుకలో నున్నది.

31. పఱ్ఱె : శ. చ. లో బ్రద్ద, ముక్క అని యున్నది. వాడుకలో చీలికచూపు అను అర్థములో నున్నది. 'ఈ కుండ పఱ్ఱె వాసింది.'

32. పుణుకులు : పూరణము (పిండివంటల లోపల పెట్టెడు బెల్లమువేసి కలిపిన పప్పుముద్ద)ను సెనగపిండిలో ముంచి ఆలూబజ్జీలలాగచేసే పిండివంటకము. వీటిని మూకుట్లో, నూనెతో కాచి తయారుచేయుదురు. శ. చ. లో లేదు.

33. పుణుకుట : పుడుకు, తడవు, వాత్సల్యముచే మునివేళ్లతో చేపట్టుకొను—

34. పుట్నాలు : వేయించిన సెనగలు అని అర్థము. శ. చ. లో లేదు.

35. పోఱడు : పడుచువాడు, బాలుడు అని ఉన్నది. బాలుడు అన్న అర్థములో వాడబడుచున్నది.

36. పోఱి : పడుచుది, బాలిక అని యున్నది, రెండవ అర్థములో వాడుదురు.

37. మలపు : త్రిప్పు, మరలించు, కదిలించు అని యున్నది. 'చెరిపివేయు' అను అర్థములో వాడుకలో నున్నది. 'ఆ బోర్డుమీది లెక్క మలపెయ్యండి సార్.'

38. మలుగు : ఆఱు, నశించు, మొదటి అర్థములో వాడుకలో నున్నది. 'దీపం మలిగిపోయింది.'

39. మలుచుట్టు:— Screw, చీల,తిరుగాణి. ఇదే అర్థములో వాడుకలో నున్నది.

40. మర్తోలు : శ. చ. లో లేదు. Screw driver అని వాడుకలో నున్నది. మర + తోలు అయియుండును.

41. పోడగొట్టు : పోగొట్టుకి—రూపాంతరమయియుండును.

42. మెంట : శ. చ. లో లేదు. 'మెల్ల'

అను అర్థములో వాడుకలో నున్నది. 'ఆయనకు మెంట కన్ను ఉన్నది.'

43. మైసాకీ : పొగవేయుటకు పనికివచ్చు దినుసు—సాంబ్రా .

44. చిమ్మట : ఈలపురుగు. వాడుకలో చిమ్మటపురుగు అందురు.

45. రిల్లుట . చిక్కుడు, గోరుచిక్కుడు మొ.వాని నారను తీసివేయుట అను అర్థములో వాడుదురు.

46. రంధి : చేటు, గొడు, పోరు—వాడుకలో విచారము. 'పరితపించుట, ఆవేదన' అను అర్థములలో వాడుకలో నున్నది. 'నువ్వేమీ రంధిపడకు నిర్రంధిగ ఉండు'.

47. విడెము : విడియము, తాంబూలము. ఇదే అర్థములో వాడుకలో నున్నది.

48. విసురుర్రాయి : శ. చ. లో లేదు. పిండి విసరుటకు ఉపయోగించు రాతి సాధనము. 'విసరు+రాయి'కి రూపాంతరము.

48. సైదము : గోధుమపిండి. శ. చ. లో లేదు.

49. సోలుపు : వరుస —'పిల్లలంతా సోలుపుగ నిలుచోండి.'

ఇక, శ్రీ రామారావుగారు వివరించిన పద జాలములలో—

కాచండి : ఈ పదమునకు మూలము 'కాంసా+హాండి' అనే హిందీపదము. అనగా కంచుతో చేసిన పాత్ర అని అర్థము. వాడుకలోకూడా కంచుతో చేయబడిన పాత్రలనే కాచండి అని పిలుచుట గలదు.

బాండ్లి : బాణలికి రూపాంతరము.

బాటు : బాట్ (తూనికరాయి) అనే హిందీ –దమునకు రూపాంతరము.

సరాతము : ఇది కూడా సరాటా అనే హిందీ పదమునుండి వచ్చినదే. సరాటా అనగా అట్లకాడ.

అర్సీలు : ఇది అన్యదేశము—హిందీలో ఆర్సీ అనగా అద్దము.

ఓడప్పలు : ఇవి రొట్టెలు కావు. వరిపిండితో చేసిన పూరీలు అనవచ్చును. నూనెలో వేసినవెంటనే పొంగి, నూనెలో ఓడలా తేలుతూ ఉంటాయి కాబట్టి, ఈ పేరు వచ్చియుండును.

వయ్యి : 'వహీ' అనే పదమునకు రూపాంతరము.

—శ్రీ నెమిలికొండ చంద్రమౌళి.

* * *

జనవరి 1968 సం. భారతిలో శ్రీ భాగవతము రామారావుగారిచే రచించబడిన 'తెలుగు నిఘంటువులలో దేశ్యపదములపై చిన్నచూపు' అను వ్యాసము చదివిన తదుపరి నాకు గలిగిన సందేహముల నివారించుకొనగోరి ఇది వ్రాయుచున్నాను. నేను శబ్దరత్నాకరమునుగాని, వావిళ్ల నిఘంటువునుగాని చదివినవాడనుగాను. సర్కారు, రాయలసీమల భాషలలోను సాంప్రదాయములలోను నాకు గలిగిన పరిచయమును పురస్కరించుకొని వ్యవహారములోనున్న మాటలకు; భారతిలో అవి పొందిన మార్పులకు, సారూప్యత సిద్ధింపచేసి నా కానందము గల్గింప ప్రార్థించుచూ ఇది వ్రాసుకొనుచున్నాను.

అంట—అంటు—అనగా ఎంగిలి(ఆకు). అన్నము తినినతరువాత మిగిలినది, భుక్తశేషము.

అఱ్ఱ—అఱ—రాయలసీమలో గదిని అఱయని వ్యవహరించుట గలదు.

అవిశసంచి—గవిశన—పెద్దసంచికి సెంట్రల్ డెల్టాలో వ్యంగ్యముగా వాడుమాట.

ఊసులు—మాటలాడుట. 'ఊసు పలుకాడుచుండ రేయి తెల్లారింది.'

గదువ—గదవ లేక గవద—గెడ్డము లేక చుబుకము. గవద అను పదము చెవిక్రింద, క్రింది దవుడకు వెనుకభాగమున గాలి మార్పులవలన వాపునకు వ్యవహారిక నామముగా వాడుచుందురు. అందుచే

గవద—గాలిబిళ్ల.

దిష్టి—దిష్ట—దృష్టిదోషము.

౹—గుబిలి లేక గులిమి లేక గులుగు—కర్ణ మలము.

తాంబాణము — తాంబూలమునకు రూపాంతరము.

నెఱి, నెఱియా—నేఱ, నెఱియ—సన్ననిబిట లేక పగులు.

పాశము—త్రాడు అని. పేశము—పాయసము యొక్క రూపాంతరము. గమనింప ప్రార్థన.

పులకరము—పులపరము—జలుబు మూలమున గలిగిన ఉష్ణము నీమాటతో వ్యవహరింతురు.

పొక్క—బొక్క—రంధ్రము.

బుక్క, బుక్కు—బొక్కు (ట)—త్వర త్వరగా తినుట. ఎముక యనుట వ్యవహారమున విన బడదు.

మొల—జఘనము, నడుము.

లొంత—లొత్త—గుంట.

మొదట వ్రాసినవి భారతినుండి వ్రాయబడి నవి. రెండవ పదము వ్యవహారమున వినవచ్చునవి. తదుపరి భావము. శలవు.

—శ్రీ వి. సత్యనారాయణరాజు.

## మాండలికపదాలు - నిఘంటువులు

భారతి (జనవరి' 68) సంచికలో శ్రీ భాగ వతము రామారావుగారి 'తెలుగు నిఘంటవులలో దేశ్య పదములపై చిన్నచూపు' అనెడి వ్యాసముఁ జదివిన తరువాత మాండలికపదములనుఁగూర్చి యించుక ముచ్చటింపఁ గుతూహలపడి నే నీ లఘువ్యాసమును వ్రాయుచున్నాను.

ప్రాచీనకవుల ప్రయోగములందుఁ గనిపింపక, శబ్దరత్నాకరాది నిఘంటువులందుఁ జేరక మా నెల్లూరు మండలమున కేవలము వ్యవహార ప్రసిద్ధములైన శబ్ద జాలమునకు సంబంధించిమాత్రము వే నిది వ్రాయు చున్నాను. ఉచితరీతిని నే నీ వ్యాసమునందు వాడిన నెల్లూరు నుడులను ప్రాజ్ఞులు గమనింపఁ బ్రార్థన.

ఏ నిఘంటువైనను సమగ్రము, సంపూర్ణము కాదు; కానేరదు. 'Every Dictionary becomes out of date soon after it is published' అని యొకానొక ఆంగ్లనిఘంటుకారుడు చెప్పిన మాట ప్రత్యక్షర సత్యము.

భాష నిత్యనూతన చైతన్య స్రవంతి. ప్రాత పదములు మఱుఁగునఁ బడుచుండ క్రొత్తవి వెలుగు నకు వచ్చుచుండుట, యే భాషకైనను స్వభావ సిద్ధమైన సద్గుణము. ఇందు సంస్కృత శబ్దము లకు భ్రష్ట రూపములు కొన్ని, అన్యదేశీయములు మఱికొన్ని; అన్యదేశ్యములుగాక, మూల రూపములు దెలియక వ్యవహారమునందు విరివిగాఁ గనిపించెడివి మఱియెన్నో గలవు. ప్రాతను మఱుగునకుఁ బోవ నీయక, క్రొత్త శబ్దములకు స్వాగతము పలుకుటయే వాఙ్మయ ప్రియులు సేయఁదగినపని. తదుపరి వానికి సూత్ర కల్పనచేసి, శాస్త్రబద్ధము చేయుట వైయా కరణులయు, నిఘంటుకారులయువంతు.

ఇతర భాషల సంగతి యేమోకాని, మన తెనుఁగునకు సంబంధించి మాత్రము ఒక దౌర్భా గ్యము దాపురించినది. ప్రాచీన కావ్యములందుఁ బ్రయు క్తములైన పదములు—శబ్దరత్నాకర, శబ్దార్థ చంద్రికలందలివి—తెలుఁగనిన నివియేయని మన పండి తుల 1. 'రెట్టమతము.' ఎవడైనను రచయిత వీనిని ద్రోసిపుచ్చి, యింగితము చూపి, యించుక స్వతంత్రించెనో, ప్రమాణములు చూపు మని వాని ప్రాణములు దోడుటయే మన పండితులు చేసిన 2. 'పంగుమాలిన శాదవ.' నిర్నిమిత్తవాద ప్రతి వాదములతోఁ గాలమును వ్యర్థపుచ్చితిమేకాని, వ్యవ హారదృష్టి నలవరుచుకొని, భాషకు బలము నిచ్చు భావపరంపరలకు శక్తిసామర్థ్యములను వెచ్చింప లేకపోయితిమి. మన సంకుచితపు ముసుగు ననంత దివ్యస్వరూపిణియైన భాషాయోషకుఁ దొడిగి 'గోషా బూబు'ను జేసితిమి.

భాష ప్రజల నోటఁ బుట్టి ప్రజల మధ్యను పెరుగుననెడి సత్యము మనలను మోసపుచ్చుటకు పాశ్చాత్యులు కల్పించిన కట్టుకథ. పరమేశ్వరుని

---

1. రెట్టమతము = లోకవిరుద్ధమైన అభి ప్రాయములు కలిగియుండుట.

2. పంగుమాలిన శాదవ=పనికిమాలిన పని.

డమరుక శబ్దతరంగములు, అక్షరరూపము దాల్చి అమాంతము మన ప్రాచీనకావ్యములందు రాలి రాశి యైనవని మన గట్టినమ్మకము. ఆకున కందని పోకకు పొందని యిట్టి సిద్ధాంతముల లొంపినిఁ గుత్తుకల వఱకుఁ గూరుకొనిపోయిన మనకు, వ్యవహారమందున్న పదము లనిన 3. 'తుస్కారము'గాఁ జూచుటయు, పామరభాషయని 4. 'ఏళిన' చేయుటయుఁ బరిపాటియై పోయినది.

ఇప్పుడిప్పు డుత్సాహవంతులైన ఆయా మండలముల యువకవులు స్వతంత్రించి, తమ తమ మాండలిక శబ్దాలను సాహిత్యమున పొదవి సంపన్నము చేయుచున్నారు. 'బాలకవి శరణ్యము'ను 5. 'ఏక్యాణము' చేసెడి పండితులింకను ఉన్నప్పటికిని, పండిత పీఠము యొక్క మొగ్గు కొంతవఱకు వ్యవహారమువైపునకే యని చెప్పనగును. నిత్యజీవితమందు ప్రజల నోళ్ళ లందు నానెడి పదములకు సాహిత్య గౌరవము లభించుచున్నది. అన్ని జిల్లాలయందు నీ రీతిని గాననగును.

మా నెల్లూరుకు సంబంధించినంతవరకు, నెల్లూరు మాండలికముల యింపు సొంపుల నారసికొని, శబ్దతత్త్వమును గమనించి, ఔచిత్యమును పాటించుచు వాటికి సాహిత్యమున చోటు గల్పించుచున్న వారిలో నాకుఁ దెలిసినంతవఱకు శ్రీ కె. వి. రమణారెడ్డిగారు ముఖ్యులు. శ్రీ పులిగుండ్ల రామకృష్ణయ్యగారి 'తుపాను' నాటిక నెల్లూరు నుడుల వైభవ విలాసమును జక్కఁగఁ బ్రదర్శించిన జీవద్రచన. శివారెడ్డి పద్యాలలోనివి 6. 'మరిగింత నాణ్ణాగించినవి.' మహాపండితులు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు వీటిని 7. 'అడపాదడపా' స్పర్శించియున్నారు. మరికొందరు గూడ 8. 'ఆపిని' దీరవాడియున్నారు. కాని ప్రయోగ సార్థక్యతను సాధించుటలో రమణారెడ్డిగారిదే పైచేయి.

మిత్రులు శ్రీ బండి నాగరాజుగారు తమ 'శ్రీ వెంకటేశ్వరము', 'నాగస్వరం' కావ్యములందు నెల్లూరు నుడుల రుచిపాకవిశేషములను చవిచూపియున్నారు. అంతేకాదు; ల్లూరుజిల్లా వ్యావహారిక పదముల నెంతో శ్రమపడి, కనపడినవారినెల్ల 'పీవా, సీవా' యని నాలుగువేల పదములను సేకరించి అర్థవివరణాదులతోఁ గూర్చి పెట్టియున్నారు. సేకరించిన నాలుగువేలతో తనివిసనక ఆ కృషియందే యింకను నిమగ్నులైయున్నారు. (ఈ 'నెల్లూరు నుడులు, నానుడులు.' రచన నెల్లూరునుండి వెలువడుచున్న ఒక స్థానిక వారపత్రికలోఁ బ్రకటింపబడుచున్నది).— దీనిని ప్రత్యేక గ్రంథముగా నిఘంటు రూపమున అచ్చొత్తించుటవలన ఒనఁగూడెడి ప్రయోజన మనల్పము. ఇది—నిఘంటు రూపమునఁ దెచ్చు పని— ఒక్కనికో, ఇద్దఱికో (వ్యక్తులకు) 9. 'ఆరవని పని'. సాహిత్య అకాడెమీవంటి బృహత్సంస్థ లిటి 10. 'అరుసోద్దెపు పని' గుర్తించి ప్రోత్సహింపవలసియున్నది.

ఇటువంటి వాఙ్మయోద్యమము ఆంధ్రదేశమందలి అన్ని జిల్లాలకు అల్లుకొని, ఆయా జిల్లాల 'మాండలిక పదకోశములు' తయారైనపుడు తెలుఁగు భాషకు గలిగెడి 11. 'పోది' యింతింత యనరానిది. ఈ 'పదకోశములు' యువకులైన క్రొత్తకవులకు వెలుగు దివ్విటీలు; ఆంధ్రభాష కమూల్యాలంకారములును కాగలవు. పేరు ప్రతిష్ఠ లార్జించుకొనిన కొందఱు రచయితలు సాహసికమనఃప్రవృత్తికలవారై, బరి తెగించి మాండలిక పదాలను తమ రచనలయందు వాడుచున్నప్పటికిని, యివి నిఘఁటువున కెక్కని దోషమున నవయువరచయితలకు వీటి జోలికి పోవుటకు

---

3. తుస్కారము='తిరస్కారము'నకు భ్రష్టరూపము.

4. ఏళిన='హేళన'కు భ్రష్టరూపము.

5. ఏక్యాణము='వ్యాఖ్యానము'నకు భ్రష్టరూపము. నింద్యార్థములోనే వాడుక.

6. మరిగింత నాణ్ణాగించినవి=ఎక్కువ నాణ్యము పొందినవి.

7. అడపా దడపా=అప్పుడప్పుడు.

8. అపిని=అత్యాశ.

9. ఆరవని పని=అసాధ్యమైన పని.

10. అరుసోద్దెపు పని=అరుదైన, చోద్యమైన పని.

11. పోది=ప్రోది.

గుండెలు చాలుటలేదు. నిఘంటురూపమేర్పడకున్న వీ పదములన్నియు మఱికొంత కాలమునకు మఱుఁగునఁ బడిపోవు ప్రమాదము కద్దు.

మాండలిక పదాలు వ్యావహారిక రచనలందుఁ గానవచ్చినంత విరివిగా గ్రాంథిక రచనలందుఁ గనిపింపకపోవుట విచారకరము. వ్యవహారమునందున్న పదములు వ్యావహారిక రచనలందే ఉపయోగించవలెననెడి నియమము కూడ మంచిదికాదు. గ్రాంథిక వ్యావహారికములనెడివి శైలికి సంబంధించినవేకాని, శబ్దమునకు సంబంధించినవి కాదు. శైలి వాక్య యోజనపై నాధారపడియుండునుగాని, విడిపదముపైఁ గాదనునది యెల్లరెఱిగిన సత్యము. గ్రాంథికము గరళప్రాయమని వ్యావహారిక వాదులును, వ్యావహారికమును ముట్టుకొనుటయే తమకు 12.'అపర్దైష్ట' యని గ్రాంథిక వాదులు తలపోసికొనుట 13 'డామేజా' పని. సమర్థుడైన రచయిత చేతిలో రెండును భాసించగలవు. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి రచనలు చదివిన తరువాత గ్రాంథికమన్న లేని యభిరుచి పొటమరించును. అట్లే కొందఱి వ్యావహారిక శైలిఁ జూచిన పిమ్మట ఉన్న ప్రీతి నశించి లేని రోత జనించుచున్నది

ఇట్లు శైలీసౌభాగ్యమునకు సంబంధించియున్న విషయమును, పదప్రయోగమునకు ముడిపెట్టుటకూడని పని. కాన గ్రాంథికవాదులు సైతము వ్యవహారమునందు ప్రసిద్ధములై, వింతసోయగముల నొలికించు శబ్దములకు కావ్యప్రయోజకత్వమును గలిగించిన దొసగువాటిల్లదు; పైపెచ్చు సారస్వతము పుష్టిఁగొని తుష్టిఁజెందును

—శ్రీ పాకాల వెంకటకృష్ణయ్య.

## "సందేహము-సమాధానము"

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ, తెలుఁగుభాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లు ముద్రించి, ప్రకటించుచున్నది. ఈ సాహిత్యసేవ యనల్పము. అత్యంత ముదావహము. ఇప్పటికి వెలువడిన దాదాపు ఇరువదిరెండు గ్రంథములు—ఆంధ్రసాహితి కమూల్యాలంకారము లనుటలో సందియములేదు. మంచి 'క్యాలికోబైండు'తో తక్కువ ఖరీదుతో నీ పుస్తకములఁ బ్రచురించు వీరికి ఆంధ్రదేశము చిఱకాలము ఋణపడియున్నది.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారిచేఁ బరిష్కృతమయిన 'రాజశేఖర చరిత్రము' అమూల్యావిషయములతోఁ బ్రకటింపఁబడినది. అందలి 'యుపోద్ఘాతము'న నీ క్రిందివాక్యము లున్నవి.

'అప్పలరాజు కూడ నొకనాడు గుత్తి దుర్గాధ్యక్షుఁడుగ నున్నవాఁడే. అతనిపై నీ క్రింది చాటువున్నది.

కం. 'రాజమనోజా! విద్యా
భోజా! కవికల్పభూజ! భూసురకుల ది
గ్గజా!.
.రవితేజ! గుత్తి యప్పలరాజా!9'

ఈ పద్యమునకు—అధస్సూచికలో నిట్లున్నది.

'9. చిన్ననాఁ డెక్కడో విన్నాను. పద్యము పూర్తిగా జ్ఞప్తికి రాలేదు. ఎక్కడ వెదకినను దొఱకలేదు.' [పుట—iv]

దీని విషయమై నేనును వెదుక ఆరంభించితిని. అంతలో అకాడమీవారిదేయగు 'రామాభ్యుదయము'—ఆచార్య శ్రీ కాకర్ల వెంకటరామనరసింహము గారిచేఁ బరిష్కృతమై వెలువడినది. అందీపద్య మిట్లున్నది.

'స్వరయతులకు లక్ష్యము లిచ్చుచు నప్పకవియీ క్రింది చాటువును నయ్యలరాజరామభద్రునిదిగా నిచ్చినాఁడు.'

'రాజ మనోజా! విద్యా
భోజా! దీనార్థికల్పభూజా! రిపు సం
జ్ఞాజా! వైభవవిజిత బి
డౌజా! రవితేజ! గుత్తి యప్పలరాజా!'

---

12. అపర్దైష్ట=అప్రతిష్ఠనుండి భ్రష్టమైనది.

13. డామేజా=Damage అనెడి ఆంగ్లపదము భ్రష్టమై యుండవచ్చును. ఆంగ్లపదమునకున్న అర్థమునందే వాడుకకూడ.

ఈ గుత్తి యప్పలరా జెవ్వఁడో తెలిసికొనుట కాధారములు లేవు. పుట 1 (50)]

ఈ పద్యము శ్రీ పుట్టపర్తివారు సందేహమునకు సమాధానము నొసంగుచున్నది. కాని మఱి యొక సందేహము లేవనెత్తినది. ఈ పద్యమునందలి 'గుత్తి యప్పల రాజెవ్వఁడోః' యని. దీనికి 'రాజశేఖర చరిత్ర' ఉపోద్ఘాతమున సమాధానము లభించినది. అప్పమంత్రిని గూర్చి వారి మాట లివి.

'అప్పమంత్రి సాళ్వ తిమ్మరుసునకు మేనల్లుఁడు. బిడ్డ మగడుకూడ. తిరుమలాంబ సాళ్వ తిమ్మరుసు బిడ్డ! ఈమె యప్పమంత్రి భార్య! అప్పనకు గోపన మంత్రి తమ్ముఁడు......రాజశేఖర చరిత్రమును వ్రాయునాఁటికి— గోపమంత్రి గుత్తిలో నుండినాఁడు. ఈ విషయమును కవియే తెలియఁ జేసెను.

ఉ. ప్రాపిత......య్యైన యా
గోపన మంత్రి, ధర్మ ధన గోపన
సమ్మతి, గుత్తి దుర్గ ల
క్ష్మీపరిపాలనక్రమసమిద్ధ
భుజాబలశాలి,......
......దురంధరుండిలన్. (1 ఆ-27. ప)'
(పుట IV)

ఈ వాక్యము వలన నయ్యలరాజ రామభద్రుఁడు, అప్పల రాజుపై, ప్పిన చాటువనియు, నతఁడప్పఁడు గుత్తిదుర్గాధ్యక్షుఁడుగ నుండెననియుఁ దెలియుచున్నది.

వీరిద్దరి వాక్యములవలన పరస్పర సందేహములు తొలఁగినవి.

ఇట్టి మహత్తర పరిశ్రమతో, ప్రభుత్వము వారును, పరిష్కర్తలును పనిచేయుచుండ, 'శ్రీమతి నాయని కృష్ణకుమారి, ఎం. ఏ' గారిచేఁ బరిష్కృతమైన 'శృంగార శాకుంతలము' పెక్కు పద్య దోషములతో బరిష్కరింపఁబడుట చింత్యము. పాదభంగము గల యీ కందపద్యముఁ జూడుఁడు—

కం॥ ఆ మేడన మంత్రికి సాధ్వీమణి
మాంచాంబకున్ శ్రుతి త్రయము గతి
త్రామత్రయంబు పోలిక
నాముష్యాయణులు గలిగి
రనుపమ తేజల్— (1 ఆ-34)

ఇది యుండవలసిన విధమిది

కం॥ ఆ మేడన మంత్రికి సా—
ధ్వీమణి మాంచాంబకున్ శ్రుతి త్రయము గతి
త్రామత్రయంబు పోలిక
నాముష్యాయణులు గలిగి రనుపమ తేజల్.

ఇందు ప్రాస నియమము కలదు గదా! కనీసము దానివలననైన గుర్తింపవచ్చునే?— ఇట్టివి ప్రతి యాశ్వాసమునను కోకొల్లలు. ఇంకను ప్రథమాశ్వాసమున '114'—వ పద్యము (కందము), అందే 126—వ పద్యము (కందము), ఇదే విధముగా పాదభంగము కలిగియున్నవి. ఇట్టివి చతుర్థాశ్వాసమున ననేకముగా నున్నవి. కందములందే యిట్లుండ, నిక ప్రాసరహితములైన సీస—గీతాదుల యందలి దోషములు అసంఖ్యాకములు. విస్తృత భీతితో వానిలోఁ గొన్నింటి సంఖ్యల మాత్ర మిట నొసఁగుచున్నాఁడను.

ప్రథమాశ్వాసమున:—102—126—113—14—19—22—27—34—39—52—55—62—92.

ద్వితీయాశ్వాసమున:—12 — 21—45— 79—164—191.

తృతీయాశ్వాసమున:— 94—121—140—146—191—214.

చతుర్థాశ్వాసము.— 8—26—27—28—52—66—68—74—76—79—86—93—105—113—121—126—131— 135—132—139—141—173—185.

పోనిందు — అర్థవైశద్యమునకై యొసంగిన దనుకొంద మన్నను, దక్కిన యన్నిపద్యముల యందట్లే పాటింపవలయునుగదా ; దీనినిఁ జూడుఁడు—

కం అనుటయు మాండవ్యుని మన
మునఁ గలిగిన భీతిఁ దెలిసి భూపాలకుఁ డి

ట్లను బ్రాహ్మణ మిత్రునిఁ
బాలుని నే నిన్నకట యేమఁడుదునే యెచటన్.
(2 ఆ—12)

ఈ పద్యమునఁ బూర్వార్థమున వైశద్య మవసరములేదు—ఉత్తరార్థమునఁ గావలసివచ్చెనా? ఎంతయో శ్రమకోర్చి, ధన వ్యయమున కోర్చి ప్రభుత్వమువారు సాహిత్యగ్రంథములఁ బ్రకటింపఁ బూనినపుడు పరిష్కర్త లింత పరాకుగా నుండుట విచారకరము.

ఇంకవిూఁదట వచ్చు గ్రంథముల విషయముననైనను, పరిష్కర్తలు ప్రతుల నన్నిటిని పరిశీలించి, చదువుట కనుకూలముగ నుండునట్లు పదవిభాగాదుల నొనర్చి, శ్రమయైనను—మనోహరముగా నాంధ్రపాఠకలోకమున కందింతురని యాశించుచున్నాను.

—శ్రీ వింజమూరి-విశ్వం.

## పానుగల్లు శాసనము

నల్లగొండకు మైలు దూరమున ఒకప్పుడు కాకతీయ రాజుల పాలనలో ఉండిన పానుగల్లు అను గ్రామమున లభించినంతవరకు శాసనములు ప్రకటితమైనవి. వాహ్యాళికై వెడలి గ్రామ సోమేశ్వరాలయము సందర్శించి తిరిగి వచ్చునపుడు సుందర శిల్ప చిత్రిత స్తంభాగ్ర మొకటి గ్రామమునకు తూర్పున హనుమదాలయము చేరువ కనబడినది. విరామముగా కలయ జూచిన పిమ్మట దక్షిణ భాగమున వ్రాయబడిన ఒక శాసనము కన్పించింది. చక్కని తెలుఁగు అక్షరాలతో వ్రాయబడినది. పరీక్షించి చూడగా ఇది పద్యాత్మకమైనది. ఇందు మూడు పద్యములు గలవు. ఇవి కందములయి యుండవచ్చు. 'శ్రీ సరస్వతేనమః' అని ఆరంభమైనది—మార్గమున నుండుటచే ధూళి ధూసర భూయిష్టమైనది. చక్కగా శుభ్రపరచి, వీలగునంతవరకు దాని ప్రతిబింబము తీయ యత్నించితిని. కాని అది అసమగ్రమయినది. చదువుటకు వీలయి తెలిసిన అక్షరములు సేకరంచినంతవరకు దిగువ పొందుపరచుచున్నాను. (ఇది సుమారు 12 వాక్యములలో వ్రాయబడినది.)

[1] శ్రీ సరస్వతే నమం॥ తనుజా జాతమునం
దనవారు రంజిలంగ బగతుర మానం
బు భంగపడంగ దినముం నందనవారుం
............ఒందిరి॥...............
...................................
...................................
........ ............ ప్రతాప—రుద్ర
...........................నాలుగు
మూరలు..........................
...................................
..........................ఇరువది
నాలుగు.............. ...హయములు
...............గజ................
..............................ఇంచ్చి
రియున్..........................

శాసన మధ్యమున 'ప్రతాపరుద్రుని' నామము సూచితమైనది. చివరలో సంఖ్యాసూచకమై గజాశ్వము లిచ్చియున్నట్లు కన్పట్టుచున్నది. దీని సమగ్రపాఠము లభించకపోవుట శోచ్యము. ఈ స్తంభము సుమారు 70 సం॥లనుండి అటవే పడియున్నట్లు, నిలువులోతుకంటె ఎక్కువ ఉన్నట్లు స్థానిక పౌరులచే దెలియవచ్చినవి.[2] ఛాయాలింగేశ్వరాలయములోని శాసనమునుఁబట్టి ఇదియును ఆ కాలమునాటిదేయని యూహింపవచ్చును. ఇంతకంటె వివరము లెక్కుడు ఒభింపకున్నవి. కావున పురాతత్త్వశాఖవారైన త్రవ్వి, భూగర్భమున ఇంకెట్టి చారిత్రక నిధులు లభించునో సేకరించి ఈ శాసనము పూర్తిగా సరియగు పద్ధతిలో తీసి కాకతీయశాసనముల సాహచర్యమునకు పాత్రమొనర్చగలరు. ఇందెవ్వరు పరిశోధించినను శ్రేయోదాయకమే. శాసన ప్రతిబింబము తీయుటలో సహకరించిన శ్రీ రంగారావుగారికి కృతజ్ఞతలు.

—శ్రీ ఎస్. రామానుజాచార్యులు.

---

1. ఖాళి స్థలము లుంచినచోట అక్షరములు లుప్తమైనవి. భిన్నమైనవి.

2. 'తెలంగాణ శాసనములు అను గ్రంథములో ప్రకటితము.

# గ్రంథ విమర్శలు

## ఇది దారి కాదు

(నాటకం; రచన: శ్రీ అంగర సూర్యారావు; ప్రచురణ: శోభా ప్రచురణలు: విజయనగరం: 96 పేజీలు; వెల: రూ 2.)

తెలుగు నాటకరంగమింకా తన కాళ్ళమీద తాను నిలద్రొక్కుకోలేదు. ఆదిలో జానపద కళా రూపాలే ప్రదర్శనలు కాగా, తర్వాత పాలకు లభిమానించిన సంస్కృత, ప్రాకృత నాటకాలనే చూడవలసి రాగా, చాలకాలంవరకు హరికథలు, బుఱ్ఱకథలు, యక్షగానాలు తోలుబొమ్మలాటలు, వీధి భాగవతములతో సంతృప్తిపడగా, 19 వ శతాబ్ది చివరలో మరాఠీ వాఙ్మయ ప్రభావంతో నాటక ప్రదర్శనలు విరివిగా కొనసాగాయి. కాని ఆ నాటకాలు తెలుగుదనాన్ని తగినంతగా పొందలేక పోయాయి. వస్తువును అద్దంలో చూచి, వస్తువును తీసుకోవటానికి వస్తువు వైపు కాక అద్దంవైపు చేతులు చాపినట్లు తెలుగు నాటక రచయితలు ఆదిలో మరాఠీ, ఇంగ్లీషు, సంస్కృత ప్రభావంతో తెలుగుదనం తగినంతలేని నాటకాలు మాత్రమే వ్రాశారు: ప్రదర్శించారు. ఇతివృత్తం సాంఘికం కావటానికి, జన జీవితానికి సన్నిహితం కావటానికీ చాలకాలం పట్టింది.

పారతంత్ర్యపు రోజుల్లో ఏ యితివృత్తంతో నాటకం ప్రదర్శించినా, చాటునో మాటునో వీర రసమే చిందులు త్రొక్కేది. మరికొంతకాలం గడిచాక తిరుపతి వేంకటకవుల నాటక ప్రస్థానం నాటక ప్రదర్శనలో కొత్త కవాటాలు తెరిచింది. నాటకీయ పద్యరచన సంభాషణకూ, సమాజానికి దగ్గరైంది. దీన్ని ఆలంబనంగా చేసికొని ముందుకు సాగవలసిన ఆంధ్రనాటక పునరుజ్జీవనం వెనుక చూపు చూసింది. కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం నాటకాలు దీని కప వాదాలు. ఇవికూడ ప్రదర్శనంలో అఖండ విజయం సాధింపలేవు. పౌరాణిక, చారిత్రక నాటకాలతో పాటు చింతామణి, వరవిక్రయంవంటి సంస్కరణాత్మకమైన నాటకాలూ, అనువాద నాటకాలూ వచ్చినా పౌరాణిక నాటకాలనూ, చింతామణివంటి నాటకాలనూ, నేటి సాంఘిక నాటకాలు అధిగమించలేదు. నేటి తెలుగు నాటకాలలో ఏ ఉత్తమ సాంఘిక నాటకాన్ని తీసుకున్నా ఒకే వూరిలో ఆ నాటకాన్ని రెండవ సారి ప్రదర్శించటం గగనమే. వరుసగా కొన్నిరోజులు ఏ తెలుగుజాతి యితివృత్తంతో ఉన్నటువంటి నాటకమైనా ప్రదర్శింపబడకపోవటం శోచనీయం—అధఃపాతాళంలోఉన్న తెలుగు నాటకరంగానికి, శ్రీ శ్రీ గారన్నట్లు భూమి ఎంతో ఎత్తుగా ఉన్నది.

పతితులూ, దీనులూ దగాపడిన తమ్ముళ్లను గుఱించి వ్రాసేవాళ్లు కఱవయిన రోజుల్లో, పెద్ద మనుష్యులు తమ రచనల్లో దారి చూపించనప్పుడు, 'ఇది దారి కాదు' అని తమను తాము వేర్పఱచుకొన్నప్పుడు అదే పేరుతో పతితుల దైన్యజీవితం నాటకంగా మలచారు. త్రాగుబోతులూ, జూదరులూ, వ్యభిచారులూ, ఇంకా ఎన్నోరకాల పతితులూ, వీళ్ల కంటె నికృష్టంగా వీళ్లపై ఆధారపడి బ్రతుకుతున్నవారూ, పోలీసులూ యీ నాటకంలో పాత్రధారులు. మాటల్లో గుండెను తాకేవాడి, వేడీ ఉన్నాయి. విషేధించిన దారిలోకి ప్రవేశించిన యీ దీనులు తమకు తాము స్వేచ్ఛగా ఉన్నామని, తృప్తిని కల్పించుకుంటూ వ్యసనపరులై, వ్యసనమే ఆనందమని తమ వ్యసన సమాధిలోనికి చీకటిపడగానే నిష్క్రమిస్తారు. వాళ్ల జీవితాలలో కారుచీకటి. 'వెలుగును ప్రేమించే ఇరులను ద్వేషించే అదృష్టవంతులు' వాళ్లను దరి జేర నివ్వరాయె! 'అసలు వాళ్లు పతితు లెందు కయ్యారు?' అని ఆలోచించే దెవ్వరు? వాళ్లు ఆ నికృష్ట జీవితంలోనుండి బయటపడేదెప్పుడు? ఈ ప్రశ్నలను సామాజికుల ముందుంచుతుం దీనాటకం.

కాని పరిష్కరించదు. కళాసాధనమైన నాటకం యీ సమస్యల్ని పరిష్కరించనక్కరలేదు గూడ. నాటకం ఈ సంస్కరణోద్దేశ్యాన్ని కల్గిస్తే సంస్కర్తలందుకై పాటుబడతారు.

నాటకీయ శిల్పం యీ నాటకంలో కొఱవడిందని చెప్పడానికి సందేహించనక్కరలేదు. సంభాషణలలో ఎంత వాడితనం ఉన్నా నాటకీయంగా ప్రేక్షకులనుండి ఉత్సుకత నాకట్టుకోదు.

శ్రీ అంగర సూర్యారావుగారీ నాటకం వ్రాయటంలో తమ ఉద్దేశ్యమేమిటో ముందుగానే తెలియబఱచి చీకటిలోనికి ప్రయాణించగలిగిన సత్తా ఉన్న వాళ్ళే యీ పుస్తకం తెరవమంటున్నారు. 'పూరిగుడిసెలు—అందరు అమ్మకు బతికేవాళ్ళు—మానవ రూపంలోవున్న రాబందులు—మైకం కలిగించేమందు—మురికి కాలువలు—శిథిలమైన సమాజపు గోడలు—జేబు దొంగలు—వాళ్ళదగ్గర వంతుపుచ్చుకునే దొరలు—బతికిన శవాల రొదలు—బాధలు—యేడుపూ నవ్వూ—వాటి పూర్వాపరాలు—వివరాలు యిందులో వున్నాయి.' ఈ నాటకంలోని గంగరాజా, కొండ, శేఖరం, చిట్టి, రాజన్న అందరూకూడ సమాజంలో హీనంగా చూడబడుతున్నవాళ్ళే. ఐతే వాళ్ళు పెద్దమనుష్యులకంటె తామే పెద్దమనుష్యులమనుకొంటూ వాళ్ళ ప్రపంచాన్ని వేరుగా సృష్టించుకున్నారు. ఒకరిని మించి మరొకరు తెలివిగా మాట్లాడుతూ, గడుసుగా ఎత్తులకు పైఎత్తులువేస్తూ ఒక సాలెగూటిలో ఉన్నట్లే ఉంటారు. ఏ పాత్ర గుఱించయినా ప్రేక్షకుల మనస్సులలో స్ఫుటమయిన ముద్ర పడుతుందనిపించదు. ప్రపంచ నాటకరంగంలో జీవులు ప్రవేశించి నిష్క్రమించినట్లే, యీ నాటకరంగంలోనూ పాత్రలు ప్రవేశిస్తూ నిష్క్రమిస్తాయి. ఇది యథార్థమే అయినా చాల తెలుగు నాటకాల చూచిన తర్వాత నాటకంలో సంవిధాన చాతుర్యం కావాలని కోరుకుంటే అదిందులో లభించదు.

ఏ మహానగరంలో యీ నాటక రంగస్థలం ఏ మారు మూలపీఠి అయినా కావచ్చు. పాత్రల వేషధారణకూడ సహజంగా తలమాసిన, ఒలుమాసిన విధంగా ఉండొచ్చు. వీరంతా దగాపడిన తమ్ముళ్లేగదా మరి! వీరిపట్ల సానుభూతి కలిగించటంలోనూ, సమాజంలో యీ దుస్థితులు మారాలనిపించటంలోనూ యీ నాటకం సంస్కరణోద్దేశ్యం కలిగిస్తుందనటంలో సందేహం లేదు. వ్యాపార దృష్టితో గాక కళాత్మక దృష్టితోనే యిట్టి పుస్తక ప్రచురణకు పూనుకొన్న 'శోభా ప్రచురణలు' విజయనగరం వారు అభినందనార్హులు.

## నవకథామంజరి

(కథానికా సంకలనం; ప్రచురణ:—శ్రీ గోదా గ్రంథమాల; ఉల్లిపాలెము పోస్టు; కృష్ణాజిల్లా; వెల రూ. 4–50; 225 పేజీలు.)

కథానిక బాల్యగండాలను అతిక్రమించి పుష్టిగా గాకపోయినా పీలగానైనా పెరిగింది. యౌవనపు లావణ్యంతో తెలుగుసిగ్గులు వెలార్చుతున్నది. ఇంకా సీమ దాటి పరాయిదేశాల పెద్దల ఆదరాభిమానాలను సంతరించుకొని, శిరసుపైన అక్షింతలు జల్లించుకోలేదు. పైగా 'ఫ్యాషన్ల'కు లోనై తన తెలుగుదనాన్ని విడనాడి విదేశీ పోకడలు పోతున్నందుకు సాటిపెద్దలచేత, విమర్శకులచేత 'అక్షింతలు' వేయించుకున్నది. శ్రీ పాలగుమ్మి, శ్రీ పురాణం కథలను అంతర్జాతీయ స్థాయిలో మెచ్చుకున్నా ఆ అభివృద్ధి క్రమపరిణామం కానేకాదు. ఇప్పుడిప్పుడు శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలను కొన్ని ఆంగ్లపత్రికలు అనువదించి దేశానికంతటికీ, తద్వారా ప్రపంచానికీ అందజేస్తున్నాయి.

తొలితరం మేటికథానికలను, కథారచయితలను యీనాటి యువతరం ఎఱుగరనటం అతిశయోక్తి కాదు. మధ్యవయస్కులైనా చదివి మెచ్చుకున్న జ్ఞాపకాల్నితప్ప మళ్లీ ఆ కథలను భద్రపరచింది తక్కువ. ఈ యాంత్రికయుగంలో అసంఖ్యాకమైన పత్రికలనుండి ఉత్తమ కథానికల నేరుకోలేమనీ, ఉత్తమ కథానికలను మాత్రమే చదవాలని అభిలాష తమకున్నదనేవారి ఆకలి తీర్చటానికి కథానికా సంకలనాలు వెలుగు చూస్తున్నాయి. ఐతే యీ సంకలనాలు చాలమట్టుకు యీ కాలపు కథానికలను

కథానికలకున్నంత ఆదరం తదితర సారస్వత ప్రక్రియలకు లేకపోవటం గమనార్హం. జీవితంలోని ఏ వొక్కటి, రెండు సంఘటనల నాధారం చేసికొని వ్రాస్తున్నది కథానికైతే సమగ్ర జీవిత చిత్రణకు యత్నిస్తున్నది నవల. ప్రబంధాలకూ, కావ్యాలకూ ఉన్నట్లే నవలా శైలికూడ కధాకథనమూ, నాటకీయమూ, వర్ణనాత్మకంగా ఉండవచ్చు. సన్నివేశానికి తగిన శైలిని సమకూర్చుకోవటం రచయిత ప్రతిభ మీదే ఆధారపడి ఉంటుంది. ఇటీవల క్రైమ్, 'సెక్స్' సాహిత్య ప్రభావాలు తెలుగు నవలను దురదృష్ట వశాత్తు తగినంత లోగొన్నాయి. రచయిత అక్కర లేనంత శ్రద్ధను 'ఉత్సుకత'ను కల్పించటానికే వినియోగిస్తున్నాడు. పాశ్చాత్య నవలలను వెఱ్ఱిగా చదివి, అనుకరించబోయి కధాగతికి ఏ విధంగాను ఉపకరించని అనవసరమైన సంభాషణలూ 'details and particulers' మీద చూపించే శ్రద్ధలు నవలకు బరువవుతున్నాయి. కొన్ని నవలలు పాత్రచిత్రణపై అధికమైన మోజుపడి రచించటం వలన సమగ్రత దెబ్బ తింటున్నది. ఇటువంటి లోపాలు మరెన్నో ఇటీవలి నవలల్లో ఉంటున్నాయి. వీటన్నింటినీ అధిగమించి రచయితలు చిరస్మరణీయమైన నవలలు, నాలుగు కాలాలబాటు నిలిచేవి రచించక పోవటం లేదు. ధాన్యం ఉంటేనేగదా విత్తనాలు! లెక్కకు మిక్కుటమైన నవలల రాశిగూర్చి బెంగెట్టుకోనక్కర లేదు. మంచినవలలు యెంచుకుని పాఠకుడు నేడు గాకపోతే రేపైనా తప్పక ఆదరిస్తాడు. అందాకా రచయితలు నిస్పృహతో నవలలను పాఠక సౌలభ్యంకోసం నవలికలు చెయ్యనక్కరలేదు.

శ్రీ వీరాజీ వ్రాసిన 'సుఖంకోసం' అన్న యీ నవల నేటి నవలాసరములో మేలిపూస. వ్రేళ్లమీద లెక్కించటానికి నేటి నవలలు సంఖ్యాపరిమాణంలో అసంఖ్యాకాలు కావటంవలన కొంత ఉత్తమనవల యేదో తెలియటానికి క్లిష్టపరిస్థితి యేర్పడేమాట నిజమే. ఉత్తమ నవలలుగాకూడ నేడు చాల నవలలను పేర్కొనవచ్చు. శ్రీ వీరాజీ వ్రాసిన 'సుఖంకోసం' అట్టి ఉత్తమనవలలలో వొకటి.

'తొలిమలుపు' వీరాజీ యీనాటికే నవలారచయితగా కథకుడుగా సుప్రసిద్ధుడు. 'ఎదిగీ ఎదగని మనుష్యులు'; 'విడీవిడని చిక్కులు'; 'ప్రేమకు పగ్గాలు' నవలలను తెలుగు పాఠకలోకం చిరస్మరణీయాలుగా యెంచుతున్నది. నవలంటే వీరాజీకి మంచినీళ్లప్రాయంకాదు; అసలు రచనంటేనే అరచేతిలో ఉసిరికాయగా యెంచరు. అందుచేతనే ఆయన నవలల్లో జీవితపు నిమ్నోన్నతాలూ, వెలుగునీడలూ, కారుచీకటిలో ఆశాలేశాలూ పాఠకుడిచేత కంటతడి పెట్టిస్తాయి; కఠిన వాస్తవాలు భయపెడతాయి; మనిషిని బ్రతికించే ఆశే, నవలను చదివే సహృదయుణ్ణి పగ్గంవేసి లాగి, గుండెనిండా గాలి పీల్చుకుండే టట్లుచేసి, అమూల్యమైన జీవితంపైన అపారమైన విశ్వాసాన్ని కలిగిస్తాయి.

శైలి విషయంలో దుస్సాహసమైన ప్రయత్నం యీ నవలలో కన్పించదు. ఏ పాత్ర ఎలా మాట్లాడాలో రచయిత కేమీ సంబంధం లేదు. నవలలో ఎవర్ని కదిల్చినా వాళ్లలాగే మాట్లాడతారు. సమాజంలో మనం వీళ్లను వెదికి పట్టుకోనక్కరలేదు. ఎక్కడేనా కన్పిస్తారు. కోటీశ్వరుడు సుందరం, అతడి భార్యా, పిల్లలు అందరూ ఎక్కడేనా కన్పిస్తారు. సుందరానికి భృత్యుడు సీతారాముల్ని మాత్రం కొంచెం జాగ్రత్తగా వెదకాలి. అటువంటి భృత్యులుండరని కాదుగాని ఆ స్వామిభక్తి అపారమైనది. ఆంజనేయుడి హృదయం చీల్చి చూస్తే సీతారాములు కన్పించినట్లు, సీతారాముడి హృదయం చీల్చిచూస్తే మాత్రం వాడి 'అయ్య' సుందరంబాబే కన్పిస్తాడు. అహరహమూ వాడికి సుందరంబాబు ధ్యాసే. ఎప్పుడూ వాడి తలంపు 'అయ్యకు' సుఖంలేదనే. సీతారాముడి కింతగా భక్తి ఉండటానికి కారణం వాళ్ళిద్దరిదీ రక్తసంబంధం కనుకనా? ఏమో! ఆ విషయం రచయిత తేల్చరు. పాఠకుడి ఆలోచనకే నిర్ణయానికే వదిలేస్తారు. చిన్నప్పుడే వాడిని సుందరం బాబు తెచ్చి 'అనాధశరణాలయం'లో చేర్చాడట! ఎక్కడనుండి తీసుకొచ్చాడో సుందరంబాబుకే తెలియాలి. పాఠకులుమాత్రం సీతారాముడు సుందరం గారి 'Illegitimate child' అనుకోవటానికి వీలుంది. ఐతే సీతారాముడి జన్మవృత్తాంతం వాడి కభేద్యమే అయింది. సుందరంబాబు ఆ రహస్యం వాడికి చెప్పకుండానే గుండె ఆగి చనిపొయ్యాడు.

ఇదమిత్థమని చెప్పలేని అనురాగం సుందరంబాబుకు కూడ సీతారాముడిపట్ల ఉండేది.

సీతారాముడు తనను తాను నౌకరుగా యెంచు కోలేదు. తనది ఉద్యోమనే అనుకుంటాడు నౌక ర్లందరిపైనా యజమానికి ఏ అన్యాయమూ జరుగ కుండా, అసౌకర్యం కలుగకుండా పెత్తనం చలా యిస్తాడు. సుందరంబాబు రహస్య జీవితం గురించి తెలిసికోనటానికి కూడ ప్రయత్నించడు. ఆయన ఎంత తఱచి అడిగినా, ఎవ్వరడిగినా 'అయ్య' గురించి ఏమీ చెప్పడు. తన ప్రేమను పంచుకోవటానికి ప్రయత్నించిన పనిమనిషి 'మా లచ్చిమి'ని అయ్యమీద ధ్యాసతో పట్టించుకోక దూరం చేసికొని, ఆమె గొప్పింటివాళ్ళ భోగవస్తువుగా మార డానికి కారకుడౌతాడు. నన్ను ముట్టుకోకు నామాల కాకీఅన్నట్లు నౌకర్లు. ప్రేమను పంచుకోవటానికికూడ నోచుకోడు. సుందరంబాబు మనస్సులో అనురాగాన్ని పొందినా ఆస్తిని పొందటానికి ఆయన అనుగ్రహాన్ని పొందటానికి నోచుకోలేదు. ఈ స్వామి, భృత్యుల అనుబంధం సమాజంలో అరుదైనట్లు సాహిత్యంలో అపూర్వం.

ఈ నవలలోని ప్రతిపాత్రా 'సుఖంకోసం' ప్రాకు లాడ్డమే కన్పిస్తుంది. మఱి మనుష్యులందరూ కూడ సుఖంకోసమేకదా పాకులాడతారు! సుఖంకోసం జరిగిన వేటలో ఎవరికి దక్కిన ఫల మెంత? ఎవరెంత సంతృప్తిని పొందారు? ఈ సమస్యలకు పరిష్కా రంగా వివిధకోణాలనుండి వెలుగును ప్రసరింపజేసి యీ నవలను జీవితమంత విలువైనదిగా చేశారు. కోటీ శ్వరుడు సుందరం ఎంత సంపాదించినా, ఎన్ని విలాసా లున్నా, త్రాగుడూ, జూదమూ వేశ్యా అన్నివ్యసనా లకూ అతడికి అవకాశాలున్నా, భార్యాబిడ్డలు తన మాట విని, తన నర్థంచేసికొని తన అంతస్తుకు తగినట్లు నడవటంలేదని, తనకు సుఖంలేదనీ అను కుంటాడు. ఆయన భార్య ధనలక్ష్మి తన భర్త తనను భార్యగా ఆదరించటంలేదనీ, ఎంత డబ్బున్నా తనకు హోదాలేదని బాధపడుతుంది. అయిన కొడుకులు తమ తండ్రికి ఎంత డబ్బుండి యేమి లాభం? అనుభ వించటానికి గీతలేకపోయెనతరువాత? అనుకుంటారు. ఆయన కుమార్తెలు తమ కిష్టంవచ్చిన యువకుల్ని పెండ్లి చేసికోవటానికి తండ్రి అనుమతించడని బాధ పడతారు. ఈ విధంగా అందరూ తమకు సుఖంలేదనే నిట్టూరుస్తారు. మేనేజర్ అరుమ్గం, డ్రైవర్ గురు వులు అందరూ అంతే. ఇక సీతారాములు సరేసరి. యజమాని సుఖంతప్ప తన సుఖం తాను చూసుకొనే చూసుకోడు. తా నన్నిమాటలూ మనస్సులో యేవీ దాచుకోకుండానే చెప్పేసే గున్నమామిడిచెట్టుతోగూడ యజమానికి సుఖంలేదనే మొఱపెట్టుకుంటాడు. 'సుఖంకోసం' అన్న పేరు యీ నవలకు సరిగా సరిపోయింది.

'Criticism of life' అన్నసూక్తి నవల కన్వయించుకుంటే యీ నవల మంచి విమర్శ గ్రంథం. విమర్శగూడ నౌక కళేగా మరి! కళాత్మక మైన జీవిత విమర్శ యీ నవలలో కన్పిస్తుంది. సంపన్నుడి మనస్సులోని ఆలోచనలను అతడి గుండెపై చెవిపెట్టి వింటున్నట్లు ఉంటుంది. అన్ని సౌఖ్యా లుండికూడ కుటుంబ సభ్యులమధ్య అనురాగ బంధాలు బలంగా లేకపోతే అతడు పొందిన బాధ వర్ణనాతీతం. కాని, శ్రీ వీరాజీ చాలవరకు అతడిని సానుభూతితో అర్థంచేసికొని బాధను మాటల్లో పెట్టటంలో కృతకృత్యులయ్యారు. భాగ్యవంతుడి దాతృత్వమంతా అతడు పన్ను లెగవెయ్యటానికేననీ, అతడు అనాథ శరణాలయాలు నడిపినా, దిక్కులేని వాళ్ళను చేరదీసి తనకు కుక్కలుగా, విశ్వాసపాత్రు లైన నౌకర్లుగా ఉపయోగించుకుంటానికేనని లోకం అనుకోవటంలో నిజం లేకపోలేదంటారు.

ఎన్నో అద్భుత సత్యాలను నీతులు చెప్పినట్లు గాకుండ తన నవలాశిల్పంలో యిరికించి చెప్పిన శ్రీ వీరాజీ అభినందనీయులు. ఈ నవలను నవలాభి మానులైన పాఠకులందరూ చదివి తీరాలి.

## ఆ త్మ బ లి

(రచన: శ్రీమతి సి. ఆనందారామం; ప్రచు రణ: శ్రీ యం. శేషాచలం అండ్కో; మచిలీపట్టణము; సికిందరాబాదు: మద్రాసు; 192 పేజీలు; వెల రూ. 2)

రచయిత్రుల రచనలలోనే సమకాలిక సమాజం సరిగా వర్ణింపబడుతున్నదని కొందరు విమర్శకుల

తలంపు. కాని వారి రచనల్లో వైవిధ్యం తక్కువని రచయిత్రులలో కొందరు అంగీకరిస్తూనే ఉన్నారు. ఇల్లూ, ఇంటి పరిస్థితులకు మించి ఊహించలేని, చాలమంది రచయిత్రులు అపోహల మేఘాలను వ్యక్తుల మధ్య సృష్టించి వాటిని చెదరగొట్టటంలోనే రచనను కేంద్రీకరించి, సఫలీకృతులైనట్లుగా భావించి సంతృప్తిపొందుచున్నారు. ఇప్పుడు వ్రాస్తున్న రచయిత్రులలో ఎక్కువమంది మధ్యతరగతి వారే అయినా వారి రచనల్లో తరచు ధనికస్వాముల కష్టాలూ, మానసికమైన బాధలే వర్ణితమౌతున్నాయి. కారూ, మేడా, ద్రాక్షతోటా, అందమైన భవనమూ ఉన్న మనుష్యుల కొచ్చే కష్టాలే, సుఖాలే వస్తువుగా స్వీకరించటం పలుమంది రచయిత్రులలో కనిపిస్తుంది. పోనీ ఆ మనుష్యుల జీవిత విధానాన్నైనా సక్రమంగా పరిశీలించి, తగినంతగా అర్థం చేసికొని వ్రాస్తున్నారా అంటే అదీ లేదు. ఏహ్యమైన 'aristocratic ideas' తో వాళ్ళు మభ్యపడి చదువరులనూ అదో రకమైన నిద్రావస్థలో చిచ్చుకొడుతున్నారు.

జీవితపు మిట్టపల్లాలను కళ్లిప్పి చూసి, చూసిన దానిని చక్కగా రచనగా మలచగలిగిన వారికోసం పాఠకలోకం ఎదురు చూస్తున్నది. అప్పుడుగా రచయిత్రులుకూడ సాహిత్యంలో సరియైన భాగస్వాములనిపించుకొనేది. కొద్దిమంది రచయిత్రులుమాత్రం కాలంకంటే ముందే ఊహించి, వాస్తవాలకు అనవసరమైన ముసుగు తగిలించక కళాత్మకమైన రూపురేఖలు దిద్దగలిగినవారు కన్పించటం ఆనందదాయకం.

పి. శ్రీదేవి కాలాతీత వ్యక్తుల గురించి వ్రాసి అకాల మృత్యువువాత బడినది శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారు సాహిత్యంతో సంఘ చైతన్యాన్ని, వ్యక్తి సంస్కారాన్ని పెంపొందించటానికి నిర్విరామమైన కృషి చేస్తున్నారు.

శ్రీమతి సి. ఆనందారామంగారు 'ఆత్మబలి' అనే యీ నవలలో కాలాతీతంగా ఊహించి, ఆత్మగౌరవంతో బ్రతకా లనుకొనే అక్కయ్య; సంఘానికి తలవొగ్గికూడ 'స్వయంసిద్ధ' కథలోలాగ భర్తను తీర్చిదిద్దుకొన్న చెల్లెళ్ల కథను చక్కని నవలగా వ్రాశారు. కాని యింకా కొన్నిసంఘటనలూ, సంభాషణలూ నేలమీద నడవక గాలిలో తేలిపోయి, నేల విడిచిన సాముగా తయారైనాయి.

శోభ అనే అమ్మాయి స్వతంత్రంగా ఉద్యోగం చేస్తూ, తన జీతంతో కుటుంబాన్ని కొంతవరకు ఆదుకొంటూ, చదువుకొన్న సంస్కారంతో తన వివాహ సమస్యను తానే పరిష్కరించుకోవటానికి సిద్ధమౌతుంది. డాక్టర్ రావు అనే యువకుడు చిన్న వయస్సులోనే భార్యను పోగొట్టుకొని, తన చిన్నారిపాప ఆశను ప్రాణానికిప్రాణంగా పెంచుకుంటూ ఉంటాడు. దేశరక్షణనిధి వసూలు చేస్తూ శోభ డాక్టర్ రావును కలిసికొని, పరిచయం క్రమంగా ఆశకు ఆత్మీయురాలిగా మారి, డాక్టర్ రావు కోరికపై అతడితో వివాహానికి సన్నద్ధమౌతుంది. ఈలోగా ఎన్నో అనుమానాలు, డాక్టర్ రావును చుట్టుముట్టి వేధిస్తాయి. ఈ అపోహలు తొలగిపోయేలోగానే ఆశ చనిపోతుంది. శోభ ఉద్యోగంచేస్తూ, తనతోటి ఉద్యోగుల స్వార్థానికీ, సంకుచితత్వానికీ, వాళ్లు విసిరే అపనిందల రాళ్లకు అతీతంగా నిలిచి, ఉద్యోగంచేసే అమ్మాయిలకు ఆదర్శంగా నిలుస్తుంది. శోభ, సరోజిని, మాలిని, మూర్తి, కేశవ, భాస్కరరావు అనే పేరులున్నవాళ్లంతా కలిసి యువజన సమాజం స్థాపించి, ఉద్యోగాలుచేస్తూనే సంఘసేవకు పూనుకొంటారు. అన్ని ఔత్సాహిక సమాజాలలాగే వీరి సమాజమూ పరస్పర అభిప్రాయభేదాలకు, స్వార్థానికీ ఆలవాలమై చీటలు వారుతుంది. ఆ సమాజంద్వారా సభ్యులంతా ఎవరి అవకాశాలను వాళ్లు ఎదుక్కొంటారు.

శోభ అన్నయ్య చలపతిని దారిద్ర్యం క్రుంగదీస్తుంది. దారిద్ర్యం అతడి బుద్ధినికూడ క్రుంగదీసి, సాటివాళ్లలో తలయెత్తుకు తిరగాలనే తహతహతప్ప, చెల్లెళ్ల అభిప్రాయాలను, చదువుకుని వాళ్లు పొందిన సంస్కారాన్ని అర్థం చేసికోలేడు. తన చెల్లెళ్ల పెళ్లిచేయటమే తన జీవితధ్యేయంగా పెట్టుకుంటాడు. అందునా విఫలమౌతాడు.

శోభ చెల్లెలు ఉమ సంఘాన్ని యెదిరించదు. తొంగిపోయి చదువురానివాడిని పెళ్లిచేసుకొని, అత్తా ఆడబిడ్డలూ ఎన్నోకష్టాలు పెడితే ఓర్చుకొని, కష్టపడి భర్తను తన ఉద్యోగపు సంపాదనతో చదివించి, స్వయంకృషిలో సఫలీకృతురాలై తన భర్తకు వ్యక్తిత్వాన్ని చేకూరుస్తుంది. పాతివ్రత్యమంటే యిదీ,

దాంపత్యం భార్య అనుకూలవతియైనప్పుడెంత శోభిం చేదీ ఉమకృషిలో వెల్లడౌతుంది.

చలపతి కుటుంబ దారిద్ర్యాన్ని వర్ణించిన సంఘటనలు హృదయవిదారకంగా ఉన్నప్పటికీ, కొన్ని చోట్ల బొత్తిగా అవాస్తవ మనిపిస్తాయి. సమాజాన్ని గూర్చి రచయిత్రి చేసిన వ్యాఖ్యానాలు కొన్నిచోట్ల ఆలోచనలు రేకెత్తింపజేస్తాయి. 'ఏమిటీ సమాజం? పోలేకపోలేకపోయే పాతకాలపు అత్యాచారాల తపానికీ, రాలేకరాలేక అతిమెల్లిగా వచ్చే సంస్కార యుత సభ్యసమాజానికీ నడుమ అందంగా, ఆకర్ష ణీయంగా ఆశలూ, భయాలూ కలబోసుకుని విరిసిన ఈ సంధ్యారాగంలో విజ్ఞాన మలవరించుకొని సంస్కారం సంతరించుకొని పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని పొంది దాని విలువను గుర్తించిన స్త్రీ ఎంత కాల మీ అయోమయంలో తడుముకు లాడాలి?' ఈ వాక్యాలు ఆలోచనాత్మకంగా ఉండి ఆనందింప జేసాయి.

శ్రీమతి ఆనందారామం గారు యీనాటి నవలా రచనలో నూతన ప్రయోగాన్ని చేశారు; ఈ కాలానికి సరిపోయిన యితివృత్తాన్ని యెన్నుకున్నారు. కాని నవల చదివినతరువాత బలీయమైన ముద్రతో పాఠ కులు కలకాలం జ్ఞాపక ముంచుకుంటారని చెప్పటం కష్టం. ఆలోచనను రేకెత్తింపజేసి, సరియైన సంస్కారాన్ని అందించటంలో మాత్రం కృతకృత్యు లైనారు.

—శ్రీ రామమోహనరాయ్

## మార్క్సిస్టు తత్వశాస్త్రం

(మూలం: వి. అఫనాసియేవ్. అనువాదం: వై. విజయకుమార్, నిడమర్తి ఉమారాజేశ్వరరావు, బి. రామచంద్రరావు. విశాలాంధ్ర ప్రచురణాలయం. విజయవాడ—2. వెల రు. 5—00.)

మానవ చరిత్రను ప్రభావితం చేసిన మహ నీయులలో కారల్‌మార్క్స్ స్థానం మొదటి బంతిలో ఉంటుంది. తత్వశాస్త్రాన్ని ఊహాకందని అవాస్తవిక విషయాలను వివరించే శాస్త్రంగాగాక, లోకంలో ఘనీభవించిన అన్యాయాన్నీ—చెడునూ నిర్మూలించి, న్యాయాన్నీ—మంచినీ పెంచే ఉపకర ణంగా చేసినందువల్ల ఆయనకు ఆ ఘనత లభిం చింది. లోకకళ్యాణమే మార్క్సిస్టు తత్వశాస్త్రం యొక్క లక్ష్యం అయినప్పటికీ అందరి లోపాలను అది పరిహరింప లేదు.

మార్క్సిస్టు తత్వశాస్త్రంలో లోపాలు ఉన్నాయంటే ఆశ్చర్యపడ నవసరం లేదు. శాస్త్రంకూడ ఒక శాస్త్రమే. శాస్త్రాలు ప్రతి పాదించే అర్థాలు కావు. ఈ సూత్రం శాస్త్రానికి కూడ వర్తిస్తుంది. వేత్తలు తమకు లభించిన శాస్త్ర విజ్ఞానాన్ని అజ లోకి తీసుకొని ప్రపంచాన్ని గురించీ, మానవునకూ ప్రకృతికీ, మానవునకూ—సమాజానికీ ఉన్న సంబం ధాలను గురించీ కొన్ని సిద్ధాంతాలు వెలయిస్తారు. ఆ సిద్ధాంతాలను శాస్త్రీయ దృక్పథంతోనే పరిశీ లించాలి. అవి అంతర్గత వైరుధ్యం లేకుండా హేతు బద్ధంగా ఉన్నవా? లేవా? చెందుతూ వున్న శాస్త్ర విజ్ఞానం, సమాజ పరిణామం, ఆ దార్శ నిక సిద్ధాంతాలను సమర్థిస్తున్నవా? తృణీక రిస్తున్నవా? ఇత్యాది విషయాలు సత్యప్రియ త్వంతో తేల్చుకోవాలి. ఇటువంటి శాస్త్రీయ దృక్పథంతో అనేకులు మార్క్సిస్టు దర్శనాన్ని కూలంకషంగా పరిశీలించారు. వారిలో సిడ్నీహుక్, బెర్‌ట్రాండ్ రసెల్, కారల్ పాపర్, యం. యన్. రాయ్ ముఖ్యులు. వారు ఈ శతాబ్దంలో అభివృద్ధి చెందుతూవున్న భౌతిక విజ్ఞానాన్నీ, సామాజిక, ఆర్థిక పరిణామాలనూ అజలోకి తీసుకొని మార్క్సిస్టు తత్వశాస్త్రంలోని దోషాలను రుజువు చేసినారు. అయినప్పటికీ కారల్‌మార్క్స్ భక్తులు కొందరు మార్క్సిస్టు తత్వశాస్త్రం దోషరహితమనీ, పరమ సత్యమనీ ఎలుగెత్తి చాటుతున్నారు. వారు మార్క్స్ దర్శనాన్ని ఒక మతంగా, ఒక వేదంగా ఆరాధిస్తున్నారు. 'మార్క్సిస్టు తత్వశాస్త్రం' అను యీ గ్రంథాన్ని రచియించిన అఫనాసి యేవ్ వారి కోవకే చెందినట్లు కనపడుతుంది. ఎందు కంటే 'మార్క్స్ ఉపదేశాలు సత్యమైనవి'— 'మార్క్సిజంలోని సత్యాన్ని చరిత్ర ధృవీకరించింది' (పేజి. 515) 'మానవజాతికి తెలిసిన భావాలన్ని

టిలో శాస్త్రీయ కమ్యూనిజం అత్యంత అభ్యుదయకరమైనది' (పేజీ. 482) 'శాస్త్రీయమైన మార్క్సిస్టు—లెనినిస్టు ప్రపంచ దృక్పథానిదే భవిష్యత్తు.' (పేజీ. 74) అని ఆయన ఉద్ఘాటిస్తున్నారు!

'మార్క్సిస్టు తత్వశాస్త్రం' అను యీ గ్రంథంలో మొత్తం 19 అధ్యాయాలున్నాయి. మొదటి మూడు అధ్యాయాలలో తత్వశాస్త్రంయొక్క స్వరూపాన్ని గురించీ, మార్క్సిస్టు తత్వశాస్త్రం యొక్క అభివృద్ధిని గురించీ చర్చింపబడింది. తరువాత ఆరు అధ్యాయాలలో ప్రధానంగా గతితార్కిక భౌతికవాదం వివరింపబడింది. చివరి పది అధ్యాయాలలో చారిత్రక భౌతికవాదం, వర్గపోరాటం, సామాజిక విప్లవం ఇత్యాది విషయాలు ప్రతిపాదింపబడినాయి.

కారల్ మార్క్స్—ఫ్రెడరిక్ ఎంగెల్సు లిరువురూ 'మార్క్స దర్శన' సంస్థాపకులు. ఈ దర్శనాన్ని 'సైంటిఫిక్ సోషలిజం'అనికూడ పేర్కొనటం కద్దు. అయితే సోషలిస్టుభావాలు మార్క్సుకు ముందు 17—వ శతాబ్దినుండియే ప్రచారంలో వున్నై. మాబ్లీ, మోరెల్లీ, బాబూఫ్ మహాశయులు సోషలిస్టు సిద్ధాంతాలను గురించి వ్రాశారు. ఇంగ్లండులో రాబర్టు ఓవెన్, ఫ్రాంసులో సెయింట్ సైమన్, ఫ్యూరియర్, ప్రౌడన్, లూయీబ్లాంక్‌వంటి ప్రముఖులు సోషలిస్టు సిద్ధాంతాలను వివరించారు. మార్క్సుకి పూర్వమే వర్గపోరాటాన్ని గురించి ధియర్రీ, గిజొలు వర్ణించారు. అదనపు విలువను గురించి హాల్, గాడ్విన్, థాంప్సన్ ప్రభృతులు వివరించారు. ఆడంస్మిత్, రికార్డోలు శ్రమ సిద్ధాంతాన్ని వెలార్చారు. సైంటిఫిక్ సోషలిజానికి పునాదులువేసే ప్రయత్నంలో మార్క్సు తనకు ముందున్న మేధావులనుండి ఎన్నో అభిప్రాయాలు గ్రహించాడు. వైకో, హెర్డర్, మైఖేల్ మహాశయులు చారిత్రక సిద్ధాంతంలో ఆయనకు మార్గదర్శకులు. 'మార్క్సిస్టు తత్వశాస్త్రం' అను యీ గ్రంథంలో పై విషయాలకు తగిన ప్రాధాన్యం యిచ్చినట్లు కనపడదు.

'మార్క్సిస్టు తత్వశాస్త్రం గతితార్కిక భౌతికవాదమని పిలవబడుతుంది.' (పేజి 21.) ఈ వాదంలోని ప్రధానాంశాలు రెండు, ఒకటి గతి తర్కం. రెండవది భౌతికవాదం. భౌతిక వాదానికి గతి తర్కానికీ మధ్య 'సజీవ ఐక్యతను సాధించి' తత్వశాస్త్రంలో మార్క్సు దర్శనం గొప్ప విప్లవం తెచ్చిందంటాడు రచయిత. (పేజి 64.) గతి తర్కాన్ని భౌతిక వాదానికి జోడించవలసిన అవసరమేమిటో, అందువలన భౌతిక వాదానికి కలిగిన మేలు యేమిటో ఆయన రుజువు చెయ్యలేదు. భౌతికవాదం స్వయం సమృద్ధం కాకపోతే 'గతితార్కిక' అనే విశేషణం దానికి పుష్టిని సమకూర్చగలదా?' 'గతి తార్కిక భౌతికవాదం' అనే మాటయే స్వయం బాధితం కాదా? ఎందుకంటే గతి తర్కం భావాలకు సంబంధించినది. గతితర్కమన్నా, మరే తర్కమన్నా అది భావాలకు సంబంధించినదే గదా? భౌతిక ద్రవ్యానికి తర్కం ఉండటమేమిటి?

భావవాది అయిన హెగెల్ మతం ప్రకారం చరిత్ర అంతా బ్రహ్మం. ఆ బ్రహ్మమే విశ్వపరిణామానికి కారణం. అయితే బ్రహ్మపరిణామం అనుయోగి (Thesis), ప్రతియోగి (Anti-Thesis), సంయోగి (Synthesis) అనే త్రికరూపంలో జరుగుతుందంటాడు హెగెల్. ఈ త్రికధారనే గతితర్కమంటారు. భావవాది అయిన హెగెల్ సూత్రీకరించిన గతితర్కాన్ని మార్క్సు భౌతికవాదానికి సంధించటం విస్మయకరం. అంతర్వైరుధ్య తర్కాన్ని గతితర్కమంటారు. గతితర్కంలో ద్వంద్వాలకు లేక విరుద్ధ శక్తులకు ఐక్యం చెప్పుకోవటం ముఖ్యం. ఈ గతి తర్కానికి తర్కశాస్త్రంలో స్థానంలేదు. తర్కశాస్త్రంలో ప్రధానమైన రెండు నియమాలు వున్నాయి. ఒక నియమం ప్రకారం 'ఒకేసారి ఒకే వస్తువు ఇటు సత్యమో అటు అసత్యమో కావాలిగాని, రెండూ కావటానికి వీలులేదు.' ఇక రెండో నియమం ప్రకారం 'ఏదైనా ఒకటి సత్యంకానైనా కావాలి, లేక కాకుండానైనా వుండాలి; కాని యీ రెంటికీ మధ్య మరొకటి లేదు.' అంతర్వైరుధ్యంపైన ఆధారపడిన గతితర్కం పైరెండు నియమాలనూ ఒక్కగీటుతో కొట్టివేస్తుంది. పై నియమాలను కాదని, గతితర్కాన్ని ఆరాధించినందువలన ఆలోచనా ప్రపంచంలో అవ్యవస్థ యేర్పడక తప్పదు. ప్రొఫెసర్ సెబైన్ చెప్పినట్లుగా అంతర్వైరుధ్య నియమం ఒక మాటల గారడీయేకాని

విశుద్ధమైన ఆలోచనా విధానం కాదు. ['The dialectic cannot be said to constitute a definable scientific or philosophical method.'] అయినప్పటికీ మార్క్సిస్టులు గతితర్కాన్ని మించిన పరమార్థం లేదనీ, 'గతితర్కమొక్కటే శాస్త్రీయమైన పద్ధతి' (పేజి. 17.) యనీ ఉద్ఘోషిస్తున్నారు. పైగా గతితర్కం 'ప్రకృతి, మానవసమాజం, ఆలోచనల అభివృద్ధి, చలనాలకు సంబంధించిన సాధారణ నియమాల శాస్త్రం.' (పేజి 129) అని కూడ విశ్వసిస్తున్నారు. ఒక అశాస్త్రీయమైన గతితర్కానికి ఇంత అసంబద్ధమైన ప్రాధాన్యాన్ని కల్పించటం మార్క్సిజంలోని ఒక ప్రధాన దోషం గాదా?

'సామాజికాభివృద్ధికూడ గతితార్కిక శీలమని' (పేజి. 259) మార్క్సిస్టుల నిర్ణయం. వారి వాదం ప్రకారం సామాజిక పరిణామాన్ని నిర్ణయించేది ఉత్పత్తి సాధనాలు – ఆర్థిక స్థితిగతులు. 'సామాజిక పరిణామాలలో ఉత్పత్తి విధానం నిర్ణాయక పాత్ర వహిస్తున్నది.' (పేజి. 332.) ఈ పరిణామం వర్గ పోరాటంద్వారా తప్ప సిద్ధింపదు. కాగా వర్గపోరాటమే మానవచరిత్ర అంటారు మార్క్సిస్టులు. అయితే మానవచరిత్రలో వర్గాలకూ, ఉత్పత్తి విధానాలకూ వున్న ప్రాధాన్యాన్ని యెవ్వరూ కాదనలేరు. కాని చరిత్రగమనానికీ, విప్లవాలకూ కేవలం ఆర్థిక స్థితిగతులేగాక, భావాల ప్రాబల్యం, సమర్థమైన నాయకత్వం కూడ అవసరమే గదా? అయినప్పుడు మహానాయకులు తలెత్తటం 'సహజంగా పూర్తిగా యాదృచ్ఛిక సంఘటన' (పేజి. 340) అని సంభావించటం అసమంజసం. ఇక చారిత్రక పరిణామం 'అనివార్యంగా క్రమగతిలో జరిగి, ధనికస్వామ్యం విధిగా సోషలిజానికి దారి తీస్తుంది' అని మార్క్సు దర్శనం ప్రతిపాదిస్తుంది. ఈ ప్రతిపాదనవల్ల మానవచరిత్ర ఒక 'కర్మవాదంగా' రూపొంది, భవిష్యత్తును గురించి జోస్యంచెప్పే విషయంగా దిగజారింది!

స్వాతంత్ర్యం—రాజ్యాంగయంత్రం—నీతి — కళ మొదలయిన విషయాలను గురించి మార్క్సిస్టుతత్వశాస్త్రం పూర్తిగా వర్గదృష్టితోనే భాష్యం చెప్తుంది. 'మార్క్సిస్టు—లెనినిస్టు సిద్ధాంత పరిజ్ఞానం కలిగి, వాటిని సరిగా పరిస్థితులకు అన్వయించుకోగలిగిన సామర్థ్యాన్ని అలవరచుకొని, వాటి ఆధారంగా ఉత్పత్తి—రాజకీయరంగాల్లో ప్రజలు చైతన్యయుత కార్యకలాపాలకు పూనుకున్నప్పుడే సమాజంలో యదార్థ స్వాతంత్ర్యం వృద్ధిచెందుతుంది.' (పేజి. 269) ఈ నిర్వచనం ప్రకారం మార్క్సు దర్శనాన్ని అంగీకరించని అమెరికావంటి దేశాలలో 'యదార్థ స్వాతంత్ర్యం'లేదని అనుకోవాలా? మార్క్సు దర్శనాన్ని అంగీకరించిన దేశాలమధ్యకూడ వాదభేదాలున్నాయి గదా? ఉదాహరణకు రష్యా—చైనాలమధ్య పొడసూపిన వాదభేదాలు జగద్విదితం. పై నిర్వచనం ప్రకారం 'యదార్థ స్వాతంత్ర్యం' రష్యాలో వున్నదా? లేక చైనాలో వున్నదా?

రాజ్యాంగయంత్రం (స్టేట్) వర్గవ్యవస్థఅనీ, సమాజం కమ్యూనిజంవైపుకు పురోగమించేకొద్దీ 'రాజ్యాంగయంత్రం సమసిపోవటం నెమ్మదినెమ్మదిగా జరిగే దీర్ఘకాల పరిణామం.' (పేజి. 441.) అని 'మార్క్సిస్టు తత్వశాస్త్రం' జోస్యం చెప్తోంది. ఒక వైపున నానాటికీ రాజ్యాంగయంత్రంయొక్క ప్రాధాన్యం పెరుగుతూవుంటే, నెమ్మదిగా అది వాడిపోతుందనుకోవటం కేవలం భ్రమ! మార్క్సిస్టు దృక్పథం ప్రకారం ఎవరికివారు ధర్మమేదో, అధర్మమేదో, నీతి యేదో, అవినీతి యేదో చెప్పుకోటానికి వీలులేదు. ఎందుకంటే 'నీతి వర్గస్వభావం సంతరించుకొన్నది.' 'ఈనాటి సమాజంలో రెండు రకాలైన నీతి—కమ్యూనిస్టు నీతి, బూర్జువానీతి ఒకదానినొకటి ఎదుర్కొంటున్నాయి.' (పేజి. 491.) ఇక కమ్యూనిస్టు నీతి శ్రామికవర్గం సాగించే వర్గపోరాట ప్రయోజనాలకు లోబడి వుంటుంది. (పేజి. 492.) కళను గురించికూడ మార్క్సిజం వర్గదృష్టితోనే పరిశీలిస్తుంది. కళయొక్క 'వేళ్ళు శ్రామిక ప్రజానీకంలో లోతుగా వ్యాపించివుండాలి.' (513 పేజి.) ఏలనన కళ 'వర్గపోరాటంలో ప్రధానమయిన ఆయుధం.' (510. పేజి)

కొన్ని సందర్భాల్లో ఈ గ్రంథంయొక్క అనువాదం అతిక్లిష్టంగా వుంది. ముఖ్యంగా అయిదవ అధ్యాయం పాఠకులను తికమకపెడ్తుంది. ప్లేటోను 'ప్లాటో'గా, లాక్‌ను 'లాకె'గా అనువదించటం అనువాదకుల అశ్రద్ధకు తార్కాణం! —వి. ఆర్.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor : S. Sambhu Prasad


కండనొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
స్థానికమే




AMRUTANJAN
Pain Balm